# ఇందుమతీపరిణయము

(ప్రబంధము)

తెనాలి రామభద్రకవి ప్రణీతము


పరిష్కరణ:
ఉపోద్ఘాతము:
డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, M. A. (Hon.), Ph. D.





తొలిపలుకు
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వల్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"


ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు
లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్
(State Archives)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు

# తొలిపలుకు

క్రీస్తుశకం 10 వ శతాబ్దంలోని నన్నెచోడుని "కుమారసంభవం" మొదలు క్రీస్తుశకం 19 వ శతాబ్దం వరకూ ప్రారంభయుగ–స్వర్ణయుగ–క్షీణయుగ సంబంధకాలుగా హెచ్చులొచ్చులకు లోనైనా వివిధ విశిష్టకృతులు శతసహస్రాలుగా ప్రబంధాలై అవతరించాయి. ప్రబంధావతరణ జరిగిన వివిధ యుగాలలో స్వర్ణయుగంగా భావింపబడిన శ్రీకృష్ణదేవరాయలయుగం తర్వాత ఒక శతాబ్ద కాలంలో వెలసిన కావ్యాలలో ఉత్తమస్థాయికిచెందిన వాటిల్లో యీ "ఇందుమతీ పరిణయం" ఒకటి. దీనిని క్రీస్తుశకం 1570 ప్రాంతంలోవున్న తెనాలి రామభద్రకవి విరచించాడు.

ఈ "ఇందుమతీపరిణయ" కథ చారిత్రకంగా యెప్పుడు జరిగిందో మామూలు లౌకిక దృష్టితోనూ — ప్రాచీనకాల పరిగణనకాలమాన సమగ్ర సమన్వయ పూర్వకమైన దృష్టికి భిన్నంగా తర్కసహంకాని చరిత్రదృష్టితోనూ చెప్పడంకష్టం.

మనదేశంలో ప్రతీయేటా రామాలయాలలో శ్రీరామనవమిగా చైత్రశుద్ధ నవమినాడు శ్రీసీతారాములకల్యాణమహోత్సవాలు భక్తులైన ప్రజలు జరుపుతూ వుంటారు. దుష్టరాక్షస సంహారకుడైన శ్రీరాముని (తండ్రికి తండ్రి) తాతగారైన అజమహారాజుకు విదర్భ దేశాధీశుడైన భోజమహారాజు కుమార్తెయైన ఇందుమతితో జరిగిన పరిణయకథా వర్ణనం కలకృతియిది. భోజుడనేసరికి కాళిదాసు కథలతో ముడివడిన భోజుడు మనకు గుర్తుకురావడం సహజం. కాని ఆ భోజుడూ యీ భోజుడూ ఒకరుకారు.

ఈ ఇందుమతీ పరిణయకథ అతిపురాతనమైన పురాణకథలలో ఒకటి. దీనిని ఆర్షేయ పురాణకథగా మనం ఆమోదించినట్లే తత్కాల పరిగణనా వ్యవస్థను కూడా మనం ఆమోదించక తప్పదు.

14 మన్వంతరాలలో 7 వ దైన వైవస్వత మన్వంతరంలో 5 వ మహాయుగంలోని త్రేతాయుగంలో శ్రీరాముడవతరించినట్లు ఆర్షవైజ్ఞానికులలెక్క. * కాగా శ్రీరాముని తాత నాయనమ్మలైన అజమహారాజు–ఇందుమతుల పరిణయ కథ యిప్పటికి దాదాపు 101088000 సంవత్సరాలకు తరవాతికాలంలోనూ 100656000 సంవత్సరాలకు బాగా పూర్వకాలంలోనూ జరిగిందని చెప్పవలసి ఉంటుంది.

---

*71 చతుర్యుగాలు ఒక మన్వంతరం. చతుర్యుగమంటే కృత–త్రేత–ద్వాపర–కలి–యుగాలు. దీన్నే మహాయుగం అని అంటారు. ఈ మహాయుగ(చతుర్యుగ) కాలపరిమితి 43,20,000 సంవత్సరాలు. ప్రస్తుతం వైవస్వతమన్వంతరంలో 28 వ చతుర్యుగంలో (మహాయుగంలో) కలియుగం నడుస్తున్నది. అనగా 23 చతుర్యుగాలకు పూర్వంవున్న చతుర్యుగంలోని త్రేతాయుగంలో శ్రీరాముడవతరించాడన్నమాట.

వైవస్వతమన్వంతరంలో 5వ త్రేతాయుగంలో ఇక్ష్వాకువంశములో దిలీపుడనేరాజు వుండేవాడు. ఈయనభార్య సుదక్షిణ. యీ దంపతులకు రఘువు పుట్టాడు. యితడు తండ్రివలె మహారాజుగా "గంధవతి" ని వివాహం చేసుకున్నాడు. గంధవతీ రఘుమహారాజులకు ఇందుమతీ ప్రియుడైన అజమహారాజు జనించాడు. ఈ అజుని కుమారుడు దశరథుడు. యీ దశరథునికి కౌసల్య, సుమిత్ర, కైకల యందు కలగినవారే రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు. రఘువు వివాహితుడయిన తర్వాత యెంతకాలానికీ సంతానం కలుగకపోగా తన కడుపు పండనందుకు దిగులు చెందుతాడు. అప్పుడు అర్ధాంగి అయిన గంధవతి కులగురువయిన వశిష్ఠుని ఆశ్రయించి సంతానప్రాప్తికై వుపాయమడుగమంటుంది. రఘువు వశిష్ఠుని వేడగా "విశ్వజిద్యాగం" చెయ్యవలసిందిగా సలహా యిస్తాడు. ఆ సూచనమేరకు రఘువు విశ్వాన్ని జయించి తిరిగి తన సర్వస్వాన్నీ దానం చేసేస్తాడు. మల్లచిప్ప మినహా మరేమీ మిగులని రఘుమహారాజు వద్దకు కౌత్సుడు అనే విద్యార్థిఋషి గురుదక్షిణార్థం అర్థిగా వస్తాడు. అప్పుడు రఘువు తన వీరత్వఫలితంగా కుబేరధనాన్ని స్వీకరించి కౌత్సునికోర్కె నెరవేరుస్తాడు. దానగ్రహీత అయిన కౌత్సుడు ప్రతిఫలంగా "నీకు పుత్రప్రాప్తి అవుగాక" అని వరమిస్తాడు. తత్ఫలితంగా గంధవతీ రఘువులకు అజ(బ్రహ్మ) ముహూర్తంలో కొడుకు పుడుతాడు. అజ ముహూర్తంలో జనించిన పుత్రుడుకాబట్టి అతనికి అజుడని పేరుపెట్టారు. యీ అజుడు పెరిగి పెద్దవాడవడంతోపాటు బహు విద్యావేత్తఅయి స్వయంవరంలో ఇందుమతిచేత వరింపబడి ఆమెను వివాహమాడతాడు. ఆ వివాహానంతరం ఇందుమతితో సహా అజుడు తన నగరానికి వస్తూవుండగా స్వయంవరంలో వరింపబడక చిన్నబుచ్చబడిన యితర రాజకుమారులందరూ అతనిపై యుద్ధానికి తలపడతారు. అప్పుడజుడు వారితో పోరి తుదికి వారిని నిర్జించి విజయశ్రీతో ప్రేయసితో నిజరాజధాని చేరుకుంటాడు. సంగ్రహంగా యిది ఇందుమతీపరిణయ కథ. యీ కథకుమూలం కాళిదాసు రఘువంశం. రఘువంశానికిమూలం ప్రాచీన పురాణగాథలు.

ఒకప్పుడు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి ఒకానొక అమరవాణి ప్రసంగంలో నేను పేర్కొన్నట్లు కాళిదాసు కుమారసంభవ—మేఘసందేశాలతోపాటు రఘువంశ మహాకావ్యంకూడా విశిష్టశ్లేషకావ్యమే.

ఆర్షవిజ్ఞాన దృష్టితో చూచినప్పుడు అజుడు మామూలు అజుడుకాడు. ముహూర్తపరమైన అజుడు. కాలరూపమయిన అజముహూర్తం పరమహంస పరమైనది. "సోహం—హంసః" అన్న మూలస్వరూపానికి ప్రతిబింబకం. యిదేవిధంగా ఇందుమతి నామమాత్ర స్వరూపేందుమతి కానేకాదు. ఇది అక్షరాలా చంద్రమతి. అనగా చంద్రపరమైపోయిన మతి కలదనీ ఇందుశక్తే మతిగా రూపొందిన శక్తిస్వరూపిణి అనీఅర్థం. ఇందుమతీ అజుల వివాహబంధం చంద్రమూల స్వభావాలకూ పరమహంస మూలస్వరూప స్వభావాలకూవున్న అనుబంధ బంధానికి కేవల సంకేతాత్మక చిహ్నం మాత్రమే! దైహికమై లౌకికమైన నామరూపాదులున్నా అవి ఆ అలౌకికశక్తి స్వరూప చేష్టావలయంలోవే కాని తద్భిన్నాలుకావు.

ఆర్షవిజ్ఞానం దృష్టి యేమైనా ఇందుమతీపరిణయ కథను కావ్యరూపంలో మలచాలన్న వాంఛ అనేకమంది ఆంధ్రకవులలో కల్గినట్లు కనిపిస్తున్నది. సంస్కృతభాషాధ్యయనానికి ప్రథమసోపానంవంటి రఘువంశపఠనమే దీనికి కారణం కావచ్చును. ప్రస్తుత ఇందుమతీపరిణయ కావ్యాన్ని తెనాలి రామభద్రకవి రచింపగా ఇతనికాలంలోనూ ఆ తర్వాతకూడా మరికొందరు యీకథనే ఇతివృత్తంగా తీసికొని కావ్యాలు రచించారు. వాటిల్లో కొన్ని యివి.

1. ఇందుమతీపరిణయం — కుమారధూర్జటి
2. ఇందుమతీపరిణయం — కామకూరి కృష్ణావధాని
3. ఇందుమతీపరిణయం — పంతుల బ్రహ్మదేవకవి
4. ఇందుమతీకళ్యాణం — తిమ్మకవి
5. ఇందుమతీపరిణయం — పూడిపెద్ది బుచ్చన్న (ద్విపద కావ్యం)
6. అజచరిత్రం — మతుకుపల్లి నరసింహకవి. (పద్యకావ్యం)

కుమారధూర్జటి, మతుకుపల్లి నరసింహకవి, పూడిపెద్ది బుచ్చన్నలు రచించిన పద్య—ద్విపద కావ్యాలు మూడూ ముద్రితాలయ్యాయి—ధూర్జటి కృతి 1912 లో ముద్రితమైనది. అజచరిత్రం 1898లో ముద్రితమైంది. బుచ్చన్న కృతి యెప్పుడు ముద్రితమైందో తెలియదు కాని ముద్రితమయినట్లు ముద్రితాముద్రిత గ్రంథసూచిక తెలుపుతున్నది. అముద్రితాలైన కృష్ణావధాని, బ్రహ్మదేవకవుల కావ్యాలు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో వున్నాయి. ప్రస్తుత తెనాలి రామభద్రకవి కృతి తాళపత్ర గ్రంథాలు తంజావూరు సరస్వతీ మహాలులోనూ, (M.289–G.2060.) మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోనూ వున్నాయి. ఈ రెండు ప్రతులు మూలంగానే యీ కృతి సంపాదితమైనది.

తిమ్మకవి రచించిన ఇందుమతీ కల్యాణం తంజావూరు సరస్వతీ మహాలులో వున్నది. (M.290–G.920). తిమ్మకవి కృతి అచ్చతెలుగు కావ్యంకాదు. ఈ తిమ్మకవి కూచిమంచి తిమ్మకవికాడు. కూచిమంచి తిమ్మకవి కౌండిన్యగోత్రుడు. లచ్చమ్మ గంగన్నల పుత్రుడు. ఇందుమతీ కల్యాణకర్తయైన తిమ్మకవి వశిష్ఠగోత్రుడు. తిమ్మయామాత్య పుత్రుడు.

ప్రస్తుత కావ్యకర్తయైన రామభద్రకవి సుప్రసిద్ధుడైన తెనాలి రామకృష్ణ కవికి సోదరుని మనుమడు. నాలుగు ఆశ్వాసాలున్న ఈకృతిని రామభద్రకవి పాలచూరి కృష్ణ భూపాలునకు అంకితమిచ్చాడు. కృష్ణభూపాలుడు కొండపల్లి మాచభూపుని కుమార్తె అయిన కృష్ణమాంబను వివాహం చేసుకున్నాడు. కొండపల్లి వారితో పాలచూరివారి సంబంధం కొత్తదికాదు. కృష్ణభూపాలుని తాత అయిన కృష్ణభూపాలుడుకూడా కొండపల్లి ప్రభువైన వెంగళనాథుని కుమార్తెను వివాహం చేసుకున్నాడు. కవి వీరిని భూపాలురు అని వర్ణించినా వీరిని పిల్లజమిందారులవంటి ధనికులుగా మనం భావించవచ్చును. పాలచూరు కొండపల్లికి ఈవల ఆవలగా కృష్ణాగుంటూరు జిల్లాలలోనే పూర్వం వుండి వుండవచ్చును.

సామాన్యంగా కవులు పూర్వం తమకంకితంగా ఫలానా కావ్యం వ్రాయ వలసిందని యే రాజో అభ్యర్థించగా అతనిని కృతిపతిని చేసి కావ్యం వ్రాయడం జరుగుతూ వుండేది. కాని రామభద్రకవి ఇందుమతీ పరిణయం మాత్రం తద్భిన్నంగా రచించాడు. రచనా ప్రారంభానికి పూర్వమూ కాక రచన అనంతరమూ కాక కృతి పూర్తి కాకముందు కృష్ణభూపాలుడు కవినాహ్వానించి గౌరవించి ఇందుమతీ పరిణయాన్ని తన కంకితమియ్యవలసిందిగా అర్థించినట్లు అర్థమౌతున్నది.

"యేనొక్క మహాప్రబంధంబు రసగంధగంధిలంబుగా రచించు సమయమ్మున" (ప్ర. ఆ 17వ.)

తే. గీ. రామభద్ర కవీంద్ర ! నీ రచనఁదనరు
దీనుతంబైన యిందుమతీపరిణయ
మంకితంబుగ మాకు ని మ్మనఘమైన
కృతినిగా కెందు తెకతేర కీర్తి కలదె. (ప్ర. ఆ. 21. ప)

అని రామభద్రకవి రచించాడు. కృష్ణభూపాలుడు కవిని ఇందుమతీ పరిణయం రచించి తన కంకితం యియ్యవలసిందిగా కోరలేదు. నీ రచనతో ఒప్పే ధీనుతమైన ఇందుమతీ పరిణయాన్ని అంకితమిమ్మన్నాడు. కృష్ణభూపాలుడు కవిని ఆహ్వానించిందికూడా రామభద్రకవి మహాప్రబంధాన్ని రసగంధగంధిలంగా రచియిస్తున్న సమయంలోనేకాని రచించకపూర్వమూ కాదు. రచించిన తర్వాతా కాదు. కాగా ఈ కృతి అంకిత నిర్ణయం మొదట జరుగలేదని చెప్పవచ్చు. కవి ఇందుమతీ పరిణయాన్ని "అనుగుండల్లి నిజాంకపీఠమున" (ప్ర. ఆ. 7. ప) అన్న పద్యం మొదలుగా "ప్రకటిత శబ్దబంధ" (ప్ర. ఆ. 16. ప.) అన్న పద్యంవరకూ రచించి "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా" (ప్ర. ఆ. 90. ప.) అని కథా ప్రారంభం చేసినట్లు స్పష్టపడు తున్నది. కాగా కృష్ణభూపాలునికి సంబంధించిన ఆశీర్వచన పద్యషట్కమూ 17 వ వచనాదిగా షష్ఠ్యంతాల అంతంవరకూ (89. వ. పద్యం) ఆ తరువాత రచించి అవతారికలో చేర్చాడని చెప్పక తప్పదు.

## వర్ణవ్యవస్థ

ప్రాచీన కవులు తమ కావ్య అవతారికలలో తమ వంశీకుల గురించీ కృతి పతుల వంశీకుల గురించీ తమకు తెలిసినంతలో పరంపరగా వర్ణించడం ఒక పరిపాటి. కొందరు కవులు తమకు తెలిసినంతలో గోత్ర గృహనామాదులు చెప్పి వాస్తవిక దృష్టితో సత్యసన్నిహితంగా తాత ముత్తాతల తరాల గురించి వర్ణించగా— మరికొందరు కవులు ఆర్షవిజ్ఞాన దృష్టిలేక, దూరదృష్టిలేక అవాస్తవిక దృష్టితో అయథార్థపరంగా–భూనభోమండలాలకు ముడిపెట్టినట్లు – మోకాలికీ బోడితలకూ ముడిపెట్టినట్లు – మధ్య సంబంధం అసంబద్ధమై సుదూరమై గండివడి తెగిపోయినా– కకావికలైనా – కలగాపులగమైనా – ఆ అలౌకిక శక్తి స్వరూప భాగంమొదలుగా వారివారి వంశాలు అవతరించినట్లు వర్ణించుకున్నారు. కొందరివలె యీ రామభద్ర కవికూడా పాలచూరి కృష్ణభూపాలుని వంశం నాల్గవ జాతిదిగా పేర్కొనడానికి ముందు విష్ణుపాదోద్భవి అయిన గంగతోపాటు నాల్గవ జాతి అవతరించినట్లు వర్ణించాడు. ఈ వివరాలను డాక్టర్ వెంకటావధానిగారి ఉపోద్ఘాతంలోనూ (xxv పుట)కావ్య అవతారికలోనూ (ప్ర. ఆ. 24, 25, 26 ప.) చూడవచ్చును.

జాతి, మత, వర్ణ విచక్షణా రహితమైన విధానాన్ని అనుసరిస్తున్న భారత రాజ్యాంగ విధానం అసలు వాస్తవికమైనది. ప్రకృతి సిద్ధమైనది. ఒక్క ఆర్ష విజ్ఞానం దృష్టితోనేకాదు యే విజ్ఞానం దృష్టితో చూచినా సత్యసమ్మతమైనది. అజయ్యమైనది. అభేద్యమైనది. అసలు సృష్టి యెప్పుడు ప్రారంభమైందో అప్పుడే సంఘంలో అతిచారం ప్రారంభమైంది. ఒక్క కలియుగంలోనే కాదు- ద్వాపర, త్రేత - కృతయుగాలలో సైతం అతిచారాలు జరిగినట్లు పురాణాలే వర్ణిస్తాయి. అందువల్ల అతిచార మన్నది యేదో ఒక కాలానికో యుగానికో పరిమితమైందీ కాదు. బద్ధమైందీకాదు. కాగా అతిచారం యెప్పుడు ప్రారంభమైందో యెప్పుడెప్పుడు యెక్కడెక్కడ యే విధంగా జరిగిందో చెప్పడానికి వీలులేదు. యే పుట్టలో యే పామున్నదో యెవరికి తెలుసు? మాజాతి మామతం మావర్ణం అనేంతవరకే మనం వెళ్లనక్కరలేదు "యిది మా వంశం. వీరు మా తాత ముత్తాతలు" అని పేర్కొనే పద్ధతినే మనం చూడవచ్చు. విశ్వాస మాత్రంగా తాతముత్తాలను పేర్కొనడం తప్ప అతిచారాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు తమ పూర్వుల గురించి మాట్లాడే అధికారం యెవ్వరికీ వుండదు. వంశమనుకొనబడే పరంపరలో యే ఒక్కరూ తప్పుదారి పట్టలేదనీ కాలు జారలేదనీ అతిచరించలేదనీ స్త్రీ పురుషుల పరంగా హామీ ఇవ్వగలవారుండరు. యెవరైనా అటువంటి హామీని ఇవ్వగల దృష్టితో మాట్లాడితే అంతకంటే అజ్ఞానులు వేరొకరుండరు. ఈ వర్ణ వ్యవస్థ అన్నది నిరాధారంగా అశాస్త్రీయంగా పరికల్పితమైంది. వర్ణవ్యవస్థకే చోటు లేనప్పుడు తద్విశాల రూపకాలైన జాతి మత వ్యవస్థలు యే విధంగా కాలు నిలదొక్కుకో గలవు? ఈ లౌకికమైన వర్ణవ్యవస్థకు జ్యోతిశ్శాస్త్రంలోనే ఖగోళ వ్యవస్థలోనే స్థానంలేదు. ఒక వ్యక్తి బ్రహ్మర్షిగా సంజనితుడౌతాడు. ఆ బ్రహ్మర్షికి పుట్టే పుత్రుడుకూడా బ్రహ్మర్షి అవ్వాలని యెక్కడ వున్నది? అగస్త్య మహర్షితో పుట్టిన అతని సోదరుడు బ్రహ్మర్షీకాడు. మహర్షీకాడు. మామూలు పండితుడైనా కాడు. అథమాథముడుగా ఊరూపేరూలేని అగస్త్య భ్రాతగా నిలచాడు. మన ప్రాచీన మహర్షుల పుత్రులందరూ ఆ మహర్షులంతటి వారు కాలేక పోయారేమి? ఒక బ్రహ్మర్షి పుట్టినప్పటి గ్రహ నక్షత్ర వ్యవస్థ అతని కొడుకు పుట్టేసరికి యథాతథంగా వుండ నేరదు. బ్రహ్మర్షి జనన కాలంలో కంటే మేల్తరంగానూ వుండవచ్చు. హీనాతి హీనంగానూ వుండవచ్చు. లేదా సర్వసామాన్యంగానూ వుండవచ్చు. కాగా గొప్పవాని సంతతి మరింత గొప్పదీకావచ్చు హీనమైనదీ సామాన్యమైనదీ కావచ్చు నన్నమాట. ఇదే విధంగా ఒక హీనునికి బ్రహ్మర్షి పుట్టవచ్చు. మరింత హీనుడూ పుట్టవచ్చు. కాగా ప్రస్తుత వర్ణ వ్యవస్థ ఆర్ష దృష్టితోకూడా నీతి బాహ్యమైనదీ శాస్త్ర విదూరమైనదీ అని స్పష్టపడుతున్నది.

నాల్గవజాతి విష్ణుపాదోద్భవమైన దన్న భావానికి మూల భూతమైన పురుష సూక్తంలోని ఋగ్వేద మంత్రమిది.

బ్రాహ్మణోఽ స్య ముఖమాసీత్, బాహూరాజన్యః కృతః,
ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥

ఈ మంత్రం తరువాత తత్ప్రజాపతి పురుష స్వరూప వర్ణనంగానే ఈ క్రింది ఋక్కులుకూడా వున్నాయి.

> చంద్రమా మనసోజాతః, చక్షోః సూర్యో అజాయత
> ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత ॥
> నాభ్యా ఆసీదంతరిక్షం, శీర్ష్ణో ద్యౌః సమవర్తత
> పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రాత్, తథాలోకాగ్ం అకల్పయన్॥

దూరదృష్టిలేని వారు సంపూర్ణ సమన్వయ దృక్పథం లేనివారు ఆర్షవిజ్ఞాన వైఖరుల అవగాహనలేనివారు వీటిలో తొలి ఋక్కుకు "ప్రజాపతికి బ్రాహ్మణుడు ముఖం, క్షత్రియుడు బాహువులు, వైశ్యులు తొడలు, పాదములవల్ల శూద్రుడు పుట్టెను" అని లౌకికమైన వర్ణవ్యవస్థను దృష్టిలో పెట్టుకుని అర్థం వ్రాశారు. కొందరు "బ్రాహ్మణాదులు ముఖంవంటివారు – బాహువులవంటివారు – తొడల వంటివారు–పాదములవంటి వారు" అని అర్థం చెప్పగా మరి కొందరు "బ్రాహ్మణాదులు ముఖంనుంచి పుట్టారు–బాహువులనుంచి పుట్టారు–ఊరువులనుంచిపుట్టారు–పాదములనుంచి పుట్టారు" అనిఅర్థం చెప్పారు. ఈ అర్థవైఖరు లెట్లావున్నా కొందరు బ్రాహ్మణాది త్రివర్ణాలవారు ప్రజాపతికి ఆయా అవయవాలయ్యారనీ శూద్రుడు పాదంనుంచి పుట్టాడనీ ప్రత్యేకంగా వ్రాశారు.

ఆర్ష దృక్కుతో గుణకర్మ పరమైన బ్రాహ్మణాది భేదాలను విస్మరించడంవల్ల వాటిని గ్రహించి తమ స్థానాన్ని నిలుపుకొనలేకపోవడంవల్ల గుర్తించలేక పోవడంవల్ల సంఘంలో పలుకుబడి కోసం – పెత్తనం కోసం – ఆధిక్యం కోసం సృష్టించిన దురర్థాలేయివి. బ్రహ్మజ్ఞానియైన వాడు బ్రాహ్మణుడన్న ఆర్ష నిర్వచనం ప్రకారం నామమాత్రపు బ్రాహ్మణులైన వారు అసలు బ్రాహ్మణులుగా నిలువగలరా ? ఆ మహావిష్ణువు పాదాలనుంచే శూద్రుడు పుట్టాడని వాదంకోసమైనా ఆమోదించుదాం – ఆ శూద్రుణ్ణి అపవిత్రునిగా బ్రాహ్మణుల దరిజేరరాని వానిగా ధర్మాలు చెప్పడం – వెలివేసినట్లు చూడటం న్యాయమా ? శూద్రుని దూరంచేసినట్లు నీచ – అగౌరవ భావాలతో చూచినట్లు – విష్ణుపాదాలను తక్కినదేహంతో దూరంచేసి నీచ – అగౌరవ భావాలతో చూడగలరా ? చూడలేరు సరిగదా ! ఆ విష్ణుపాదాలకే సాష్టాంగ దండ ప్రణామాలు చేయకుండా ఉండడం ఈ వర్ణ వ్యవస్థా రూపానుయాయులైన వారికి అసాధ్యం. పాదాలు నరికిన మహావిష్ణువును మనం ఊహించనైనా ఊహించలేము కదా ! "గంగ విష్ణుపాదోద్భవి. విష్ణుపాదంనుంచే పుట్టిన ఆగంగలో మునగడంవల్ల పవిత్రుల మవుతాం – పుణ్యలోకాలు లభిస్తాయి." అని భావించి తీర్థాలాడుతున్నవారే ఆ విష్ణుపాదోద్భవులైన శూద్రులను తక్కువ వారుగా అపవిత్రులుగా చూడడం పుణ్యప్రదమని యెలా అనగలం? విష్ణు పాదాలు ఒక్క భూదేవవంద్యాలు మాత్రమేకావు. సర్వజన–భూదేవ–దేవ–దేవ దేవవంద్యాలు కూడా కదా ! మరి తత్పవిత్ర పాదోద్భవులు తక్కువవారెలా అవుతారు ? ఇదంతావాదంకోసం వ్రాస్తున్న విషయం.

గుణకర్మలను దృష్టిలోపెట్టుకొని "బ్రాహ్మణోఽస్య" ఇత్యాది మంత్రానికి అర్థంచెప్పాలి తప్ప తద్భిన్నంగా చెప్పరాదు. ఒకవేళ చెప్పినా వాస్తవికమై తర్కసహమై యేపరిస్థితుల్లోనూ నిలువనేరదు. బ్రాహ్మణుడు ముఖంవంటివాడు అని అర్థం చెప్పితే బ్రహ్మజ్ఞానియైన యే బ్రాహ్మణుడైనా ముఖంవంటివాడే అవుతాడు. ఇదే విధంగా క్షాత్రశక్తి కలవాడెవడైనా బాహువుల వంటివాడే అవుతాడు. వైశ్యశక్తికలవాడెవడైనా తొడలవంటివాడే అవుతాడు. శూద్రశక్తి కలవాడెవడైనా పాదములవంటివాడే అవుతాడు. ఈ దృష్టితో యిప్పటి లౌకిక వర్ణవ్యవస్థకు స్థానంలేదు. బ్రాహ్మణుని కొడుకు శూద్రుడూ కావచ్చును మరొకడూ కావచ్చును. శూద్రుని కొడుకు బ్రాహ్మణుడైనా కావచ్చును మరొకడైనా కావచ్చును. ఇప్పటి సంఘంలోని వర్ణవ్యవస్థను దృష్టిలో పెట్టుకుని పైమంత్రానికి అర్థం చెప్పదలిస్తే అది ఛిన్నాభిన్నమై శాస్త్రాలనూ వేదాలనూ అప్రామాణికం చేస్తున్నది. ఈ మంత్రాలలో ఉన్న "ఆసీత్-అజాయత-జాతః" వంటి క్రియారూపాలన్నింటికీ "ఆయెను" అని ఒక్కటే అర్థం తప్ప వేరర్థం చెప్పరాదు. "బహ్వర్థాహిధాతవః" గదా! కాగా "అజాయత" అన్నప్పుడు "జాతః" అన్నప్పుడు "పుట్టెను" అని అర్థం చెప్పరాదు. "పుట్టెను" అన్న అర్థమే చెప్పదలిస్తే యెన్నో వ్యాఘాతాలొస్తాయి. విష్ణునాభికమలంనుంచి బ్రహ్మ పుట్టాడుకదా! మరి బ్రహ్మ బ్రాహ్మణుడా కాదా? తద్బ్రహ్మజ్ఞానియైనవాడే బ్రాహ్మణుడుకాగా లేనిది అసలు బ్రహ్మ బ్రాహ్మణుడు కాడా! బ్రహ్మ శివుని దక్షిణాంగ సంజనితుడని శివపురాణం చెప్తున్నది. అనేకమంది బ్రహ్మర్షులు బ్రహ్మసంతతిగా పుట్టారు. వారంతా యే వర్ణం వారౌతారు? చంద్రుడు క్షీరసాగర మథనంలో సంజనితుడయ్యాడని పురాణాలు ఘోషించాయే. పాఠికమైనపై మంత్రార్థం ప్రకారం మరి విష్ణువు మనస్సునుండి చంద్రుడు పుట్టాడా? పాల సముద్రంనుంచి పుట్టాడా? సూర్యుడు అదితి కశ్యపుల కుమారుడని బ్రహ్మాండ పురాణం వర్ణించింది. సూర్యచంద్ర గ్రహాలు రెండూ విష్ణువుకు రెండు నేత్రాలన్నమాట ఉండనే ఉన్నది. మరి విష్ణువు నేత్రాలనుంచి సూర్యుడు పుట్టాడన్న మంత్రవాక్యార్థమేమౌతుంది? వేదమంత్రాలకు పురాణగాథలకు పరస్పర విరుద్ధమైన వ్యాఘాతా లేర్పడ్డంలేదా? కాగా చంద్రుడు ప్రజాపతికి మనస్సువంటివాడు. సూర్యుడు నేత్రంవంటివాడు అనే అర్థం చెప్పితే వారెక్కడ పుట్టినా సమన్వయం అబాధకంగా తర్కసహమే అవుతుంది. ఇదే విధంగా బ్రహ్మజ్ఞానులైన బ్రాహ్మణాదులు ప్రజాపతికి ముఖం వంటివారు అన్న పద్ధతిలో అర్థం చెప్పితే పరమ వైజ్ఞానికమై శిరోధార్యమౌతుంది.

అసలీచతుర్వర్ణాలేకావు. మామూలుగా అంగారకుడు భౌముడనుకుంటాము. కాని విష్ణువు స్వేదబిందువునుంచి ఉద్భవించినట్లు పద్మపురాణం చెప్పుతున్నది. శివుని స్వేద బిందువునుంచి పుట్టినట్లు చెప్పేవికూడా లేకపోలేదు. విష్ణువు చెవులనుంచి మధుకైటభులు పుట్టారు. విష్ణువు మనస్సునుంచి మన్మథుడే కాదు విరజుడు, అపాంతరతముడు వంటి వారుకూడా జన్మించారు. వాల్మీకి బ్రహ్మహృదయ సంజాతుడని చెప్పేవికూడా ఉన్నా విష్ణు హృదయసంజాతుడని చెప్పేవి ఉన్నాయి.

మరొకవిశేషం. విష్ణువు ముఖ-బాహూరుపాదాలనుండి పుట్టకుండా బ్రహ్మదేవుని వివిధ అవయవాలనుంచి పుట్టినవారు అనేకులున్నారు. అంగిరస-అత్రి

–త్రిత – పులస్త్య – మరీచి – సంకల్ప – సనత్కుమార–సరస్వతీ–జ్యేష్ఠాదేవులు బ్రహ్మ హృదయంనుంచీ–కనుబొమ్మలనుంచి రుద్రుడూ, లలాటంనుంచి ఏకాదశరుద్రులూ, నాసారంధ్రంనుంచి అరుణి, పుట్టారు. బ్రహ్మ తుమ్మడంవల్ల అతని గర్భంనుంచి తుతుడు, ఆవులింతతో జాంబవంతుడు, సంజనితులయ్యారు. బ్రహ్మ రసననుంచి వశిష్టుడు, చెవులనుంచి దిక్కన్యలు, కంఠంనుంచి–లేదా–తొడనుంచి నారదుడు, బొటనవ్రేలినుంచి దక్షుడూ, బ్రహ్మ తనచేతినివాసనచూడడంవల్ల అప్సరసలు, నాభినుంచి పులహుడు, సంభూతులయ్యారు. బ్రహ్మ అప్సరసలను చూడగా వీర్య స్ఖలనమై అదియిసుకలో కలవడంవల్ల వాలఖిల్యులు, కొంత బురదలో కలవడం వల్ల వాల్మీకి జనితులయ్యారు. బ్రహ్మ ఒకసారి తన దేహాన్ని విసర్జించవలసిరాగా తద్విసర్జిత శరీరంనుంచి సంధ్యాలలన సంభవించింది. బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులు ముగ్గురూ పరస్పరంచూచుకుంటే ఆ చూపులవల్ల "త్రికళ" సంజనిత అయ్యిందని పురాణవాక్కు. ఇంతెందుకు ? విష్ణు ముఖాద్యవయవాలనుంచి బ్రాహ్మణాదులు పుట్టారన్న వాక్కుకు భిన్నంగా బ్రహ్మ తిరోధానశక్తివల్ల నరులు–కిన్నరులు–పుట్టా రన్నమాటకూడా ఉన్నది. చతుర్వర్ణాలవారేకాదు. అసలు నరులంతా బ్రహ్మ తిరోధానశక్తివల్లనే పుట్టితే విష్ణ్వవయవ చతుర్వర్ణసంజనితత్వ అర్థానికి భిన్నత్వం రావడంలేదా ! అయితే బ్రాహ్మణాదులు విష్ణువు ముఖం వంటివారు–బాహువుల వంటివారు–ఊరువులవంటివారు–పాదములవంటివారు అని అర్థంచెప్పుకున్నప్పుడు యెవరు యెవ్వరి సంతానం అయినా యీ అర్థానికి భిన్నత్వంరాదు.

"జన్మనాజాయతే శూద్రః–కర్మణా జాయతే ద్విజః" అన్నట్లు జన్మతో ప్రతి వారూ శూద్రులే, సామాన్యంగా జ్ఞాననేత్రపరమైన ఉపనయనంతోలభించే గాయత్రీ మంత్రాన్ని అనులోమ–విలోమాలుగా అక్షర లక్షలు జపించి సిద్ధిపొందినవారే అసలైన ద్విజులుగా–సార్థకోపనయనవంతులుగా పరిగణింపబడతారు. "ద్విజత్వ" సిద్ధికి గాయత్రీమంత్రజపం ఒక్కటే ఏకైకమార్గంకాదు. గాయత్రీతర దేవతామంత్ర జపమార్గాలుకూడా అనేకం వున్నాయి. ఏ విధంగానైతేనేమి ? ద్విజత్వసిద్ధి కలిగినవారే క్రమాభ్యుదయంతో బ్రహ్మజ్ఞానులుగా – అంటే – అసలైన బ్రాహ్మణులుగా మరింత పురోగాములై–మహర్షులుగా–బ్రహ్మర్షులుగా వెలుగొంద డానికి సమర్థులౌతారు–సమర్థులౌతారు. అందువల్ల శూద్ర–అశూద్రపరాలైన–సేవా–వైశ్య–క్షాత్ర–బ్రాహ్మ్య–శక్తుల్లో యేదైనా కర్మవల్ల రూపొందేదేగాని జన్మతో లభించేదికాదని గ్రహించక తప్పదు. అసలు యేది లభించినా అది "జన్మ విశేషమే–జననకాలవిశేషమే" నన్నమాటవేరు. ఈ దృష్ట్యాకూడా అసలుకర్మే జన్మసిద్ధమై–మాతాపిత సంతాన సంబంధకారణంగా నిర్ణయించబడే నేటి వర్ణ వ్యవస్థను అసందిగ్ధంగా త్రోసిపుచ్చి కర్మపరమైన సత్యసమ్మతమైన వర్ణవ్యవస్థకు సుదృఢమైన పునాదిగానే నిలుస్తుంది. కాగా అజ్ఞాన విలసితాలై లోకంలో బాగా వేళ్లుపాతుకుని ఉన్న ఈ సంకుచిత జాతి మత వర్ణ వ్యవస్థలను పరిగణించకుండా సర్వజన సామాన్య ధర్మంగా సమాన ప్రతి పత్తితో భారత రాజ్యాంగం ఏకైక మానవతా వాదాన్ని శిరోధార్యంగా భావించడం ఆర్షవిజ్ఞానానికి ముమ్మూర్తులా ప్రతి బింబకమే అనడంలో సందేహంలేదు. మరి అనేక మంది కవులవలెనే తెనాలి రామభద్రకవి కూడా పాలచూరి కృష్ణభూపాలుని వంశ

వర్ణన సందర్భంగా విష్ణుపాదాదిగా నాల్గవజాతిని పేర్కొనడం యీకవి ఆర్షవిజ్ఞాని కానందువల్లా దూరదృష్టిలేనివాడవడంవల్లా జరిగింది.

రామభద్రుని కవిత అసాధారణమైనది. కొన్ని సందర్భాలలో ప్రత్యేకించి కథాకథన గమనాది సందర్భాలలో అతి సామాన్యమైన కవితనే రామభద్రుడు వెలార్చినా వివిధ వర్ణనా ఘట్టాలలో మాత్రం అసాధారణ శబ్దార్థభావ పరిపూర్ణమైన జవజీవాలు కలిగిన కవితనే ధీనుతంగా వెలార్చాడు. "ప్రకటిత శబ్దబంధ రసభావ కవిత్వ విశేష వాసనాధికమతిమంతులై వెలయు ధీరకవీశ్వరకోటికి సమర్పకంగా మాధురీగతితో" ప్రబంధం రచించాలన్న రామభద్రకవి కవిత రసప్లావితమై పరవళ్లు తొక్కింది. రామభద్రకవి కవితా వైశిష్ట్యాన్ని కాళిదాసు రఘువంశ కవితానుకృతి విశిష్ట వికృతి విశేషాలను ఈ కావ్య ఉపోద్ఘాతంలో డాక్టర్ వెంకటావధానిగారు సంగ్రహంగా సమృద్ధిగా వివరించారు.

## సమ్మోహనాస్త్రం

ఆర్షవిజ్ఞానానికి సంబంధించిన ఒక్క విషయంగురించి యిక్కడ పేర్కొంటాను. గంధర్వుడైన ప్రియదర్శనుడు అజునికి సమ్మోహనాస్త్రం ఉపదేశిస్తాడు.

ఆహవము దొరకునీకు
ద్వాహానంతరమునందు వైరిజయశ్రీ
దోహాలమిదిగైకొను స
మ్మోహన శరమంత్రరాజమున్ నృపముఖ్యా !

అన విని నర్మదానదికి నప్పుడపోయి యతండు వార్చియ
త్యనుపమభక్తిమీఱఁగఁ బ్రియంవదుచేనుపదేశమందెదం
త్రనియమ పూర్వకంబుగ నుదఙ్ముఖుఁడై రిపుకోట్లనిద్రచే
మునుఁగఁగ .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

[తృ. ఆ. 56పు-28-29ప.]

పై రెండవపద్యంలో "నిద్రచేమునుఁగఁగ" తరువాతి పాదభాగం ఆ తరువాతి పద్యభాగంకూడా శిథిలమైపోయింది. ఈ సందర్భంలో సమ్మోహనాస్త్ర ప్రయోగ ఫలితమేమిటో స్పష్టంకావడంలేదు. "నిద్రచే మునుఁగఁగ" అన్న శబ్దాలు స్పష్టంగా ఉన్నాయి కాబట్టి తత్ప్రయోగ ప్రభావఫలితంగా నిద్రకు స్థానం వున్నదని చెప్పవచ్చు.

ఇందుమతీస్వయంవరానంతరం పరరాజులతో జరిగినయుద్ధంలో అజుడు సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించి విజయశ్రీ చేబడతాడు. ఈ సందర్భంగా

అమ్మోకటిదొడిగి వింటను
సమ్మోహనమనువు నొడివి జనపతిపై వన్
క్రమ్మగు మూర్ఛలనందఱు
సొమ్మసిలిధరిత్రిఁ బడిరి సురలగ్గింపన్

[చ. ఆ. 111 పు. 182 ప.]

అని సమ్మోహన ప్రయోగఫలితంగా శత్రుసమూహాలు మూర్ఛాగతమైనట్లు విస్పష్టంగా పేర్కొనబడింది. అంతేకాదు. దీనితరువాతి పద్యంలో "మూర్ఛనవనిపైమునిఁగి నిద్రాసక్తినుండువారలయట్ల కొట్టికొన" [188 ప.] అని నిద్రాసక్తులవలె మూర్ఛలోమునిగి కొట్టుకుంటున్నట్లూ, అనంతరపద్యంలో మూర్ఛాస్థితికి భిన్నంగా "భూభుజుల్ కళవళమునఁ జంపకుమటంచు భీతినంజలుల తోడ-నేరములెంచఁగ వలదని శత్రువులు ప్రార్థించగా అజుడార్ద్రహృదయుడై కరుణించినట్లు విరచించబడింది.

ఆర్ష విజ్ఞానందృష్ట్యా వామ దక్షిణాచారాలు రెండింటిలోనూ అస్త్ర విద్యలున్నాయి. వశ్య-ఆకర్షణ-స్తంభన-విద్వేషణ-ఉచ్చాటన-మారణకర్మలనబడే షట్కర్మలలో "సమ్మోహనం" వశ్య ప్రయోగభాగం. వశ్యప్రయోగం-కామ సమ్మోహన భేదాలతో ద్వివిధం - తొలిది తమోగుణ ప్రధానం మలిది రజోగుణ ప్రధానం - సమ్మోహన శబ్దానికి ప్రేమ, మూర్ఛ ఇత్యాద్యర్థాలున్నాయి. మూర్ఛార్థం ఉన్నదికాబట్టి సమ్మోహనాస్త్ర ప్రయోగ ఫలితం మూర్ఛ అని రామభద్రకవి భావించినట్లు కనిపిస్తున్నది. సమ్మోహన ప్రయోగం రెండు విధాలు శత్రు హింసచేసేది - శత్రుహింస చెయ్యకుండా వారిని లోబరిచేది. శత్రుహింసా ప్రయోగంలో మూర్ఛకు స్థానం ఉన్నది. ద్వేషించే వారిపై హింసారహితమై వశ్య పరమైన సమ్మోహనాస్త్ర ప్రయోగంచేస్తే తత్ఫలితంగా వారు వశ్యులై ప్రయోక్తను ప్రేమిస్తారు. సామాన్యంగా యీ ప్రయోగం జరిగినప్పుడు తత్ఫలితంగా మగతనిద్రవంటి నిద్రవస్తుంది. ఈ ప్రయోగం మరింత అధికంగా జరిగితే పూర్తిగా నిద్రావస్థలోకివెళ్లి ఆ నిద్రలో సైతం ప్రయోక్తకు వశీభూతులైవుంటారు. కాళిదాసు పేర్కొన్నది అరిహింసారహితమైన సమ్మోహనాస్త్రమే. "నచారిహింసా విజయశ్చహాస్తే"-ఈ సమ్మోహనాస్త్ర ప్రయోగంవల్ల అరిహింస ఉండదు. విజయం లభిస్తుంది. ఈ అస్త్రప్రయోగ ఫలితంగా శత్రువులు నిద్రవిధేయులైనట్లు "నిద్రా విధేయం నరదేవ సైన్యమ్" అని స్పష్టంగా పేర్కొన్నాడు. రామభద్రకవి మూర్ఛాగతులయ్యారనీ పైగా నిద్రితులవలె మూర్ఛాగతులయ్యారనీ చెప్పడం వాస్తవంకాదు. మూర్ఛాగతులవలె నిద్రించారని పేర్కొన్నాబాగుండేది. మూర్ఛపోవడం వాస్తవికమూకాదు. మూలానుగుణమూకాదు. పైగా మూర్ఛ హింసాసంకలితం - మూర్ఛీకరణం మూలంగా విజయంలభించినా అది అరిహింసా పూర్వకమే. మూర్ఛితులై గతిలేక పడిపోయిన తమపై విజయాన్ని చేపట్టినవ్యక్తిని ప్రేమించి గౌరవించాలనిలేదు. ఓడిపోయి వెన్ను చూపించినా విజయుణ్ని ద్వేషించవచ్చు - అవిద్వేషం ఉండడం సహజంకూడా - కాని అరిహింసా రహిత మైన సమ్మోహనాస్త్ర ప్రయోగఫలితం అటువంటిది కాదు. శత్రువులు

ప్రయోక్తను ప్రేమిస్తారు. "దాసోఽహమ్" అని గౌరవిస్తారు. ఈ "అస్త్ర" విషయ సందర్భంలో కాళిదాసు శాస్త్రీయమైన చక్కని శ్లేషలను సంధించాడు. ఈ సమ్మోహనాస్త్రం గాయత్రీపరమైనది. "సమ్మోహనంనామ" ఇత్యాది శ్లోకంలో "గాంధర్వ" శబ్దానికి "గాంధర్వం గంధర్వ దేవతాత్మకం" అని మల్లినాథసూరి వ్యాఖ్య వ్రాశాడుగాని అది సరికాదు. "గంధర్వ ఉపదిష్టం" కాబట్టి "గాంధర్వమ్" అనబడింది. గంధర్వుడైనప్రియంవదునికి మరొక గంధర్వుడెవడో ఉపదేశించాడని దీనిభావం – చతుర్వింశ త్యక్షరాత్మకమైన "తత్సవితుర్వరేణియంభర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్" అన్న గాయత్రీమంత్రగతమైనది యీ సమ్మోహనాస్త్రం. ఈమంత్రం రెండక్షరాలకు ఒకమాసం వంతున చైత్రాది ద్వాదశమాసాత్మకం– అంటే ఆయా మాసాలలో ఏ తన్మంత్రగతాలైన తత్త ద్వర్ణ పూర్వక వివిధాస్త్ర ప్రయోగాలను ఉపదేశంపొంది సిద్ధిపొందాలన్నమాట. అజునికి ప్రియంవదుడు సమ్మోహనాస్త్రాన్ని చైత్రమాసం ప్రారంభంలోనే ఉపదేశించాడు. ఇందుమతీ స్వయంవరం జరిగింది వసంత ఋతువులోనే. [రామభద్రకవి స్వయంవరానికిముందు వసంతవర్ణనం చెయ్యడం సమంజసమైనదే.] ఈసమ్మోహ నాస్త్రం "తసవ" లకు సంబంధించినది. "గాంధర్వమాదత్స్వ" అన్నప్పుడు "త్స్వ" కారంలో "తత్సవి" బీజాలను సూచించడం జరిగింది. వీటి స్వరూపాన్ని "త్వా రాజ్యరమ్యానపరోవిదర్భాన్" అన్నప్పుడు "త్వా" "వి" అక్షరాలుగా నిర్దేశించాడు. "వి" అపరమైనది. అనగా అస్త్రోపసంహారణలో "వి" పూర్వప్రయుక్తం కావాలన్నమాట. అనగా సమ్మోహనాస్త్ర ప్రయోగం "తత్స" గతంకాగా "వి" ఉపసంహారకమన్నమాట. "చైత్రరథ ప్రదేశ" శబ్దం కుబేరోద్యానార్థకం మాత్రమేకాదు. చైత్రమాస పరార్థకంకూడా. "విదర్భ" శబ్దంచేత యిక్కడ సంసూచిత మయ్యేది కేవల "విదర్భ" దేశం మాత్రమేకాదు. బీజాక్షరపరంగా "వి"–అస్త్రప్రయోగంలో మంత్రపూరితమై సంయోజితమయ్యే తృణ–కుశ–దర్భల్లో అత్యంత శ్రేష్ఠతరమైన "దర్భ" సూచించబడింది.

సామాన్యంగా సమ్మోహన కామ వశ్యప్రయోగాలు చేసేవారికి రజస్త మోగుణాలు అతిశీఘ్రంగా అత్యధికంగా పరివ్యాప్తిచెందుతాయి. కాగా తత్ ప్రయోక్త శక్తిహీనుడైవార్ధక్యానికి పంచేంద్రియాలశక్తిక్షీణతకు లోబడిపోతాడు. ఇటువంటి దుష్ప్రభావాలకు లోనుకాకుండా శక్తివంతుడై నిలవడానికి వాటికి విరుగుడుగా "చంద్ర" (ఇందుమతి) పరమైన "హంసస్సోహం" మంత్రసిద్ధి కూడా కావాలి. దీన్ని కూడా ప్రియదర్శనుడు అజుని కుపదేశించాడు. ఈ "హంస" మంత్రం అమృతప్రదమైన యౌవనశక్తిప్రదాయకం. సత్త్వగుణ సంవర్ధకం. కాగా రజస్తమోగుణవిచ్ఛేదకం అని వేరే చెప్పనక్కరలేదు. "విజయశ్చ హా స్తే" అన్నప్పుడు "హాస్" తే అని "హ"కార"స" కారాలను సూచించాడు. అజుడు కూడా సమ్మోహనాస్త్రప్రయోగానంతరం ఇందుమతి అధరామృతాన్ని (హంసరూపమైనచంద్రామృతాన్ని) స్వీకరించాడనడం రూపంగా యీ విషయాన్ని సూచించాడు.

"నచారిహింసా విజయశ్చ హాస్తే" అన్నప్పుడు ఇందులో వివిధ విశేషాలు కాళిదాసు ఇమిడ్చాడు. అరిహింస అంటే శత్రువులవల్ల జరిగేహింస – శత్రువులకు జరిగే హింస అని రెండర్థాలు. సమ్మోహనాస్త్రప్రయోగం శత్రువులవల్ల నీకు బాధలేకుండా చేస్తుంది–శత్రువులకు బాధకలుగకుండా వారిని లొంగదీస్తుంది–[ప్రేమించేట్లు చేస్తుంది.] "విజయశ్చహాస్తే" విజయం నీకు హస్తగతమౌతుంది. అంతేకాదు–న + అరిహింసా + అవిజయః అన్నప్పుడు అవిజయశబ్దంతో తిరిగి "న" శబ్దం సమన్వయమై "ఓటమి ఉండదు" అన్న అర్థంవస్తుంది. "హస్" = హాకారసకారాలు, తే = నీకు, విజయ్యః = విశిష్టజయప్రదాలు – విశిష్టమనశ్శక్తి సంధాయకాలు. 'ఇత్యాది శాస్త్రీయార్థ విశేషాలను కాళిదాసు పరిగర్భితం చేశాడు. ఇవన్నీ రామభద్రునిరచనలో మనకు గోచరంకావు–ఇటువంటి విశేషాలు కాళిదాసుకృతులన్నిటా ఉన్నా తరువాతివారెవరూ శాస్త్రీయ సమన్వితాలుగా గుర్తించనందువల్ల ఆవిష్కృతాలు కాలేదు.

## ఛందోవిశేషాలు

రామభద్రకవి సర్వసాధారణమైన ఉత్పల, చంపకమాలాది వృత్తాలను, మత్తేభ, శార్దూల విక్రీడితాది వృత్తాలను వివిధ జాత్యుపజాతి పద్యాలను రచించడంతో పాటు మహాస్రగ్ధర, పంచచామరాది అనేక విశిష్ట పద్యాలను బంధాలనుకూడా రచించాడు. వీటిల్లో లాక్షణికంగా విశిష్టమైనవికూడా లేకపోలేదు.

రామభద్రకవి ఉపయోగించిన ఇతర విశేష పద్యాలలో స్రగ్ధర – మహాస్రగ్ధర–లయగ్రాహి – చామరం – పంచచామరం – పృథ్వి – మత్తకోకిల – మాలిని – కవిరాజవిరాజితం – తరల – రగడ – ఉత్సాహాలున్నాయి. మూలప్రతిలో – కవి సరిగ్గానే వ్రాసినా ప్రతి వ్రాసిన వారెవరో పద్యనామాలు కొన్ని పొరపాటుగా వ్రాసినట్లు కనిపిస్తున్నది. ఈ పొరపాట్లలో మాలినీ వృత్తాన్ని (67పు) మ. వృత్తంఅనీ కవిరాజవిరాజితాన్ని (78 పు) కవిరాజఅనీ వ్రాయడం వంటివి అంతగా పట్టించుకొన వలసినవికాదుగాని మహాస్రగ్ధరను స్రగ్ధర అనీ, చామరవృత్తాన్ని ఉత్సాహాన్ని పంచచామరం అనీ ఉటంకించడం కూడా జరిగింది.

ప్రథమాశ్వాసంలోని (138 వ ప. 29 పుట) "నావుడున్ మనంబునన్ ఘనంబుగాఁగ నాదరం" ఇత్యాదిపద్యం వ్రాతప్రతిలో పంచచామరంగా పేర్కొనబడింది. పంచచామరానికి జర జర జగ గణాలుంటాయి. ప్రథమాశ్వాసం లోనిదేయైన "జటాధరేశ్వరా" ఇత్యాది పద్యం (136 ప. 28 పుట) పంచచామర వృత్తం. "నావుడున్ మనంబునన్" ఇత్యాది పద్యానికి పంచచామరగణాలకు భిన్నంగా రజ రజర గణాలున్నాయి. దీన్ని "సుగంధి" వృత్తంగా కొందరు "చామర" వృత్తంగా మరికొందరు శాంతివృత్తం – ప్రశాంతివృత్తం అని ఇంకా కొందరు లాక్షణికులు భావించారు. రామభద్రకవి "చామరం" అని వ్రాస్తే చామర–పంచ చామరాలకు లక్షణమైలక్షణ్యంవున్నదని గుర్తించని ప్రతిలేఖకులెవరో "పంచచామరం" అని వ్రాసివుంటారు.

రామభద్రకవి ద్వితీయాశ్వాసంచివర (118 ప. 50 పుట) ఈ క్రింది "తరల" వృత్తాన్ని రచించాడు.

కదనసూర ముదిత ధీర ఘనవిహార మాధవ
ప్రదర హార శరతుషార రజిత నారవాహ పా
రద పటీర భుజగవార రమణిహార శారదా
సదన నారదసిత సారస మనసార సద్యశా !

ఇందులో న, భ, స, న, జ, ర, గణాలుపయోగించి 11వ అక్షరాన్ని యతి స్థానంగా పాటించాడు. సుప్రసిద్ధ లాక్షణికులైన కవిజనాశ్రయ - ఛందోదర్పణ - లక్షణసార సంగ్రహకర్తలు తరల వృత్తం 19 వ ఛందమైన అతిధృతి ఛందం లోనిదని దానికి "న, భ, ర, స, జ, జ, గ" గణాలుంటాయని 12 వ అక్షరం యతిస్థానం అని పేర్కొన్నారు. కవిజనాశ్రయాదుల లక్షణంప్రకారం తరల అతిధృతి ఛందంలోనిదై పాదానికి 19 అక్షరాలు వుండవలసిరాగా రామభద్రకవి ఒక అక్షరాన్ని తగ్గించి ధృతిచ్ఛందంలోనిదిగా పాదానికి 18 అక్షరాల వంతున లక్షణం మార్చి తరల వృత్తాన్ని రచించాడు. రామభద్రకవికి చాలాకాలం తరువాత లాక్షణికుడుగా ప్రసిద్ధివహించిన అప్పకవి కూడా కవిజనాశ్రయాదులు పేర్కొన్న లక్షణాన్ని అనుసరించే తరల వృత్తం చెప్పాడు.

మట్టుపెట్టి గర్వముల్ సమానులే యెదుర్పమి
గుట్టు మట్టుఁదెలిసె నింకఁగొంక కేగుఁడందరున్
దట్టి గట్టి పోరఁ బోరఁ దారసిల్లి వచ్చినన్
గొట్టి కొట్టి మస్తకములు గుట్ట లిడుదు ధారుణిన్.
(చ. ఆ. 176 ప. 110 పుట)

దీన్ని వ్రాతపతిలో పంచచామరంగా పేర్కొనడం జరిగింది. చామరవృత్తమని భ్రమపడి ఎవరో వ్రాయగా మరొకరు దానిని చూచి చామరం అని పొరపాటున వ్రాశారనుకుని పంచచామరం అని వ్రాసివుంటారు. యిది వాస్తవానికి ఉత్సాహ. యేడు సూర్యగణాలు ఒక గురువు పాదానికి వుండి ఐదవ గణాద్యక్షరం యతి పెడితే ఉత్సాహ అవుతుంది. యేడు సూర్యగణాలు అనేసరికి వివక్షారహితంగా గల నగణాలలో రెండింటిని గాని యేఒక్కదాన్నైనా గాని స్వేచ్ఛగా ప్రయోగించవచ్చు. అందువల్ల ఉత్సాహ పాదాలలో వృత్తపాదాలలోవలె అక్షర పరమైన సంఖ్యానియమం ఉండి తీరాలని చెప్పలేము. పైనుదాహరించిన పద్యంలోనే తొలి మూడు పాదాలలో యేడూ హగణాలే ఉపయోగించినా చతుర్థపాదంలో రెండు నగణాలు ప్రయోగించిన విషయం మనం గుర్తించవలసి వుంటుంది. తొలి పాదత్రయంలో పాదానికి 15 అక్షరాలుండగా తుది పాదంలో మరిరెండక్షరాలు యెక్కువగా-అంటే 17 అక్షరాలున్నాయి. రామభద్రకవి రచించిన ఈ కృతిలోని మరొక ఉత్సాహ పద్యం ఉన్నది చూడండి.

వీరభావ భాసిసత్త్వ విద్విజారి వారహో
హారవారి జారికీర్తి హారితా సుధీరసా
సారధీ సుతాధ్యసూన (చా) చంపమాన దారకా
కారదాన మానితాధిక ప్రభావ భారవీ! (చ. ఆ. 256 ప. 124 పుట)

ఈ పద్యం ఇందుమతీ పరిణయంలో ఉత్సాహగానే పేర్కొనబడింది. ఉత్సాహ లక్షణం ప్రకారం పాదానికి యేడు సూర్యగణాలు ఒక గురువు వంతున గణాలున్నాయి. ఐదవ గణాద్యక్షరం యతివున్నది – లక్షణసార సంగ్రహకర్త పేర్కొన్న అతిశక్వరీచ్ఛందంలోని సుగంధి* (చామరము–ప్రశాంతి) వృత్త లక్షణాలు అక్షరాలా సరిపోతాయి. సుగంధికి రజరజరగణాలతో తొమ్మిదవ అక్షరం యతి ఉండాలి. అంటే మాత్రాచ్ఛందోబద్ధ మనుకున్న "ఉత్సాహ" అక్షరగణ విభజనతో మార్గచ్ఛందోపరమైన మరొకవృత్తంగా కూడా లక్షణవంత మవుతుందని ప్రస్తుత పద్యాన్ని ప్రత్యక్ష ప్రమాణంగా తీసుకుని చెప్పవచ్చు – అయితే పూర్వోదాహృతమైన "మట్టుపెట్టి" ఇత్యాదిపద్యం మార్గచ్ఛందోదృష్టితో సుగంధితో మిశ్రితమైన పరస్థాన విషమవృత్తమవుతుందిగాని సుగంధి మాత్రం కానేరదు. కాగా యేదేశీయచ్ఛందమైనా సరే మార్గచ్ఛందంలో ఉక్తాది యిరవై యారు చందస్సులోనూ పుట్టిన 13, 42, 17, 726 వృత్తాలవల్ల స్వపరిగణనతో సహా రూపొందే వివిధ సమ–అర్థసమ–విషమ–వృత్తాలైనా 135, 108, 273, 98, 92, 72, 314 సంఖ్యలో యేదో ఒక లక్షణానికి ప్రతి బింబమైతీరుతుంది. యింతేకాదు. 26 అక్షరాలనుమించి అక్షర పాదాత్మకాలైన ఉద్ధురమాలా వృత్తాదులను కూడా పరిగణిస్తే వాటినికూడా అర్థసమ విషమా భేదాలుగా రూపొందించి గుర్తించవచ్చు. ఈ మార్గ మహావలయాన్ని ఛేదించి బయటపడి యేదేశీయచ్ఛందమైనా తన స్వతంత్రతా ప్రతిపత్తిని నిలుపుకోవడం యేపరిస్థితుల్లోనూ సాధ్యమయ్యే పనికాదు. అంటే అనంతకోటి సంస్కృత మార్గచ్ఛందోరీతుల్లో యేదేశీయచ్ఛందమైనా అంతర్లీనమై తీరక తప్పదన్నమాట.+

ద్వితీయాశ్వాసంలో (4ప–31 పుట) "తంతువిద్ధ నెమ్మోము తిలకమలర" అన్న తేటగీతిపాదంలో గణయతి భంగాలు కనిపిస్తున్నాయి – అసలు కవి ప్రయుక్తమైన మూలపాఠమేదో గుర్తించవలసి వున్నది – ఇంతకుమించి రామభద్రకవి ప్రాస ప్రయోగంలో గాని – యత్యక్షర మైత్రిలోగాని విశిష్ట ప్రయోగాలేమీ చెయ్యలేదు.

---

* ఏడు హాంబులున్ గమున్ వడెన్మిదిన్ సుగంధికిన్—
దీనిపేరె చామరంబు ధీరవంద్య మారుతీ—
కుంభివళ్ రజద్వయంబగున్ రమున్ ప్రశాంతికిన్—
(లక్షణసార సంగ్రహం ప్ర. ఆ. 33 పుట)
కవిజనాశ్రయ కర్త సుగంధి వృత్తాన్ని 17వ అత్యష్టిచ్ఛందంలో రజరజరవగణాలు కలదిగా దిశాయతిగా పేర్కొన్నాడు.

\+ చూడు. వాఙ్మయ మహోద్యక్షుని పరిశోధనావాఙ్మయం—జాను తెనుగు. (145–150 పుటలు).

అయితే సకృత్తుగా కొన్ని వృత్తాలలో యతి స్థానాల విషయంలో స్వాతంత్ర్యం వహించినట్లు కనిపిస్తున్నది. లాక్షణికులైన కవిజనాశ్రయ కర్త ప్రభృతులు

"ప్రియంబగుచు రుద్ర విశ్రమము పృథ్వికా సంజ్ఞకా"

అంటూ ద్వాదశాక్షర యతిని (12వ అక్షరాన్ని) పాటించగా యీ రామభద్రకవి యీ క్రింది పృథ్వీవృత్తంలో తొమ్మిదవ అక్షరాన్ని యతిస్థానంగా పాటించాడు.

నిరంతర రమావమానిత సతీశ యక్షాధిరా
ట్పురందర ధర వ్రజస్ఫుట సితాబ్జ రాజద్యశో

(ప్ర. ఆ. 146 ప. 30 పుట.)

కవిరాజ విరాజిత వృత్తానికి లాక్షణికులందరూ 8. 14. 20 అక్షరస్థానాలు యతులుగా - పాదానికి మూడు యతుల వంతున ప్రయోగించి పేర్కొనగా* రామభద్రకవి ఈ క్రింది పద్యంలో కేవలం 14వ అక్షరాన్ని మాత్రమే యేకైక యతిగా ప్రతి పాదంలోనూ ప్రయోగించాడు.

స్థిర గుణ భూషణ బాంధవ పోషణ శ్రీకర భాషణ మేరు ధృతీ
పరనృప భీకర రమ్యదయాకర భారజనీకర చారుమతీ
వర బుధగాయక సత్కవినాయక వాంఛితదాయకతాతికృతీ
హరిచిర వైభవ రూపమనోభవ యాహవ భూభవ నీతిరతీ !

(తృ. ఆ. 152 ప. 78 పుట)

## బంధాలు

ఆంధ్రవాఙ్మయంలో బంధకవిత అతి ప్రాచీనమైనది. నన్నెచోడుడు తన కుమార సంభవంలోనే బంధకవితకు స్థానం యిచ్చాడు. ఆ తర్వాత కొంత అనాదృతమైనా ప్రబంధయుగంనుంచి తిరిగి ఆదృతమౌతూ వచ్చింది. లాక్షణికులే కాక కావ్యకర్తలుకూడా చిత్రకవితా రీతులతో తమ శక్తికొలది వివిధబంధాలను రచించారు. అయితే గర్భబంధకవితల గురించిన లక్షణాలు ప్రాచీనులుచాలా తక్కువగానే చెప్పారని చెప్పవచ్చు.

---

* క్రమమున నొక్క నకారము నాలు జ
కారములుం బరగంగ వకా
రమును నొడంబడి రాఁ గవిరాజ వి
రాజిత మన్నది రామనిభా! (కవిజనాశ్రయం. 30 పుట)
కమల దళంబులకైవడిఁ జెన్నగు
కన్నులుఁ జారుముఖ ప్రభలున్
సమధిక వృత్త కుచంబులు నొప్పఁగ
శైలరసర్తు విశాల యతిన్ (ఛందోదర్పణం. ద్వి. ఆ. 54 పుట)

ఆధునిక కవులలో బంధకవితకు లక్షణ గ్రంథం వ్రాసి నూటయేడు వివిధ బంధముల లక్షణాలు రచించిన కీర్తి శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారికే దక్కింది. శ్రీ శాస్త్రిగారు శ్రీ కాశీవిశ్వనాథశతకంలో నిరోష్ఠ్యబంధశత గర్భితచ్ఛత్ర బంధ బంధుర సీసపద్యం రచించారు. "ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంథము" అన్న పేరుతో ఒక లక్షణ గ్రంథం వ్రాసి అందులో శతాధిక (107) ఛత్రాది బంధ లక్షణాలు విరచించారు. ఇటీవలి కాలంలో చైనా - పాకిస్తాన్‌లు మనదేశంపై దురాక్రమణకు ఒడిగట్టిన సందర్భాలను పురస్కరించుకుని ద్వివిధంగా నూట నలభై బంధాలువంతున మలచుకోగల రెండు ఛత్రబంధాలను గర్భితంగావుంచి "విజయశ్రీశృంగారము" అన్న శీర్షికతో శ్లేషమయమైనకవితను లలితలలిత పదజాలంతో 1966 లో నేను రచించాను. అపూర్వంగా షుమారు 300 విభిన్న బంధాల నిముడ్చుకున్న కవిత ఆంధ్ర వాఙ్మయ ప్రపంచంలో యిది ఒక్కటే. ఇది "ఋషిమాలికా బిరుద విరాజిత- హారికర లేఖినీ గృహనామ-షణ్ముఖ కోదండ దండనామ-జన్మనక్షత్ర సంకలిత-సంస్కృతాంధ్ర పదయుక్త శృంగార భావమయ అంకుశాది శతాధిక బంధయుత సుధీర- (విషమ) వృత్త గర్భితఛత్రద్వయబంధగూఢ విజయవృత్త శతాధిక బంధ సంకలిత-చైనా-పాకిస్తాన్ దురాక్రమణ విధ్వంస విజయ భారత వీరభావ స్ఫోరక తారావళీ పద సంశోభిత విజయశ్రీ రగడ.*

రామభద్రకవి యీకావ్యం తుదిని "నాగ-పుష్పమాలికా-చంపక బంధాలు" రచించాడు. "సకల కవీశలోక" ఇత్యాది పద్యం (254 ప. 124 పుట) వ్రాత ప్రతిలో శిధిలమై ఉన్నది. అందువల్ల నాగబంధ చిత్ర స్వరూపాన్ని సమకూర్చలేదు మన స్వంత పూరణలతో-ప్రత్యేకించి బంధకవితను రూపొందించడం కవికి న్యాయం చెయ్యడంకాదన్న దృష్టితో పూరించడం జరుగలేదు.

"హారధరవర" (255 ప. 124 పుట) ఇత్యాది పద్యం పుష్పమాలికా బంధంగా నిబంధించబడింది. లలిత లఘుపద సంవలితమైన ఈ పుష్పమాలికాబంధం పూర్ణ స్వరూప చిత్రాన్ని (xxi వ పుటలో) చూడవచ్చును.

> వీరభావ భాసిసత్త్వ విద్భుజారి వాహహో
> హారవారి జారికీర్తి హారితా సుధీరసా
> సారధీ సుతాఢ్య సూన (చా) చంపమాల దారకా
> కారదాన మానితాధిక ప్రభావ భారవీ !

(256 ప. 124 పుట)

ఇది వ్రాతప్రతిలో పద్మబంధంగా పేర్కొనబడింది. నాగబంధ పద్యంలో "నాగ" శబ్దం ప్రయోగించబడింది. పుష్పమాలికాబంధంలో "హార" శబ్దం ప్రయోగించ బడింది. వీరభావ భాసిసత్త్వ ఇత్యాది పద్యంలో పద్మపదంకాని తత్పర్యాయ

---

* చూడు. డాక్టర్ అడుసుమిల్లి నారాయణరావుగారి (అలంకార ప్రకరణము). ''నారాయణీయము'' పీఠిక (పుటలు 150-152). పీఠికాకర్త ఈ తొలిపలుకు కర్తయే.

పదంకాని ప్రయోగితం కాలేదు. యేదో సమకూర్చాలని ప్రాచీనులు కొన్ని పద్మ బంధాలను సమకూర్చినట్లు కనిపిస్తున్నదికాని అవి సహజ బంధాలుగా భాసించడం లేదు. పద్మానికి దళాలు మరీతక్కువ సంఖ్యలో వుండనేరవు. కాగా "అష్టదళ పద్మబంధమని పూర్వులు కొందరు పేరుపెట్టి యెనిమిది రేకులతో పద్మస్వరూపాన్ని తీర్చిదిద్దాలని చేస్తిన ప్రయత్నం కృతార్థతచెందినా సహృదయహృదయంగమం కాలేక పోయింది. [redacted]భద్రకవి రచించిన "వీరభావ భాసిసత్త్వ" ఇత్యాది పద్యం "పద్మ బంధ"మనే భావించబడితే విడ్డూరంగా చూడడానికే యెబ్బెట్టుగావుండే అసహజమైన చదరంగంవంటి "చతుర్దళ పద్మ బంధం" రూపొందుతుంది. యిటువంటి పద్మాన్ని మనం ఊహించనైనా ఊహించలేము సరిగదా! పద్మానికి క్రిందుగా (తూడె) కాడకూడా లేనటువంటి చతుర్దళ పద్మం తయారవుతుంది. మరింతగా విడ్డూరమై వక్రత్వాన్ని పొందే విషయం మరొకటి ఉన్నది. కాడలేక పోగా ఈ పద్మబంధంలో పద్యం రేకు తుదిభాగంనుంచి–అనగా పైనుంచి ప్రారంభమవుతుంది. పద్యం పుష్పపుకాడవద్దనుంచిగాని, అండభాగంనుంచేగాని గర్భవలయంలో ఒక చోటనుంచి కాని ప్రారంభంకావాలి. ఈ విధంగా ప్రారంభమైతే పుష్పోత్పత్తి స్వభావానికి మూలమధ్యాంతస్వరూపాలకు–పద్మబంధ స్వరూప స్వభావాలకు – అనుగుణంగా ఉంటుంది. పద్మదళం చివరినుంచి పద్యం ప్రారంభమౌతుందంటే పద్మదళం తుది భాగం పద్మానికి మొదలు అన్నట్లుగా వుంటుంది. ఇది యెంత అసహజమైనదో విజ్ఞులకు తెలుప నవసరంలేదు. దీని అసహజచిత్ర స్వరూపాన్ని (xxii పుటలో) చతుర్దళపద్మబంధ చిత్రంలో పద్యంతో సహా ప్రత్యక్షంగా చూడవచ్చును.

ఎవరో తెలియనివారు దీన్ని పద్మబంధంగా ఉటంకించినట్లు కనిపిస్తున్నది. కాని [redacted]భద్రకవి దీన్నిని విశిష్టమైన "త్రిదళ చంపకబంధం"గా నిబంధించినట్లు స్పష్టపడుతున్నది. [redacted]భద్రకవి మూడవపాదంలో "సూనచంపమాన" అని రచించగా ప్రతి వ్రాసిన వ్యక్తి యెవరో "చంపను" "చంప" గానే కలిపివ్రాతలో వ్రాయగా దానిని చూచి మరొక ప్రతిని వ్రాసినవ్యక్తి "చంప" వ్రాయడానికిమారు "చాప" అని వ్రాసినట్లు అర్థమవుతున్నది. యీ పద్యం ధనుర్బంధం కానేకాదు. అందువల్ల "చాప" శబ్దప్రయోగానికి యిక్కడ అవకాశంలేదు. కాగా కవిహృదయాన్ని గుర్తించి లేఖక ప్రమాద సంజనితమైన "చాప"ను చంపగా సవరించడం జరిగింది. చంపకపుష్పాలు అనేక విధాలుగా ఉన్నాయి సామాన్యంగా చంపకానికి అయిదు రేకులు మాత్రమే వుంటాయి. శ్వేతచంపకం – క్షుద్రచంపకం – నాగ చంపకం – నాగపుష్పచంపకం – నాగకేసరక చంపకం – సురతా చంపకం – నీల చంపకం – భూమిచంపకం – హేమచంపకం – ఇత్యాది భేదాలున్నాయి – వృక్ష – లత – క్షుద్ర వృక్ష త్రివిధ రూపాలలో యీ భేదాలన్నీ వున్నాయి. వీటిల్లో అత్యంత విశిష్టమైన అపురూపమైన చంపకం త్రిదళ చంపకం. ఇది యెప్పుడో ఒకప్పుడు యెక్కడో ఒకచోట గాని లభ్యంకానిది. సర్వే సర్వత్రా లభ్యమయ్యేది కాదు. అపూర్వంగా తొడిమతో సహా సుందరతరమైన త్రిదళచంపకంగా [redacted]భద్రకవి నిబంధించిన విశిష్ట విచిత్ర చిత్రరూప పద్యాన్ని (xxiii పుటలో) చూచి రసజ్ఞులైన మేధావంతులు ఆనందసంభరిత హృదయాంతరంగు లౌదురుగాక! ఈ "త్రిదళచంపక బంధ" నిర్మాతగా [redacted]భద్రకవి "మానితాధిక ప్రభావ భారవి" గా వెలుగొందా డనడంలో సందేహంలేదు.

మధురాతి మధురమై పదపదార్థ ప్రచలితమై విశిష్టభావ విశ్లేష బంధురమైన యీకృతిని చదివి రసజ్ఞులు ఆనందింతురు గాక !

ఆంధ్రప్రదేశ్ గవర్న మెంట్ ఓరియంటల్ మానిస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్ ద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురిస్తున్న అముద్రిత ప్రాచీన ఆంధ్ర కృతులలో ఇది నాలుగవది. తప్పులకుప్పగా ఉన్నయీ ఇందుమతీ పరిణయాన్ని ఎంతో శ్రమపడి డాక్టర్ వెంకటావధానిగారు పరిష్కరించారు. అందుకు వారికి మాకృతజ్ఞతలు.

అమూల్య ప్రాచీన గ్రంథాల ప్రచురణకై మన సంస్కృతీ సంపదల పునరుద్ధరణకై అత్యంత శ్రద్ధాభక్తులతో అవిరళాసక్తి చూపిస్తూ సారథ్యంవహిస్తున్న ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ముఖ్యమంత్రి గౌరవనీయులైన శ్రీ పి. వి. నరసింహారావు గారికి-విద్యాశాఖా కార్యదర్శి శ్రీ యస్. ఆర్. రామమూర్తి (I. A. S.) గారికి-ఉపకార్యదర్శి సహాయ కార్యదర్శులు శ్రీ డి. కామయ్య, శ్రీ ఐ. రఘునాథరావు గార్లకు మాకృతజ్ఞతలు. ప్రభుత్వం ప్రచురిస్తున్న యీ గ్రంథాలను ఓర్మితో శ్రద్ధతో సుందరతరంగా ముద్రిస్తున్న ఆంధ్రప్రదేశ టెక్స్టు బుక్ ప్రెస్ డైరక్టర్ శ్రీ యన్. నారాయణరావుగారికి అడుగడుగునా సహకరించి తోడ్పడుతున్న డిప్యూటీ డైరక్టర్ శ్రీ జి. రామకృష్ణారావుగారికి తదితర ఉద్యోగులకు మా హృదయపూర్వక అభినందనలు.

ఇట్లు

వాఙ్మయ మహోధ్యక్ష

వడ్లమూడి గోపాలకృష్ణయ్య

కళా-ప్రపూర్ణ

Joint Director
Andhra Pradesh Government
Oriental Manuscripts Library
and Research Institute,
Afzalgunj, Hyderabad.

హైద్రాబాదు
తెలుగు ఉగాది
16-3-1972

## పుష్పమాలికాబంధము :



కం. హరధరవరఫణిమణిఘృణి
వరతరధరభావభవయువతిభనిభతి భ
స్థిరతరశరమురహరశర
హరికవిహరిధరవరసురహారజ సుశయా!

(ఇందుమతీపరిణయము–4 ఆ–255 ప. 124 పు.)

చూడు తొలిపలుకు. xviii పుట.

# చతుర్దళ పద్మబంధము ?




వీరభావ భాసిసత్త్వ విద్భుజారి వారహా
హారవారి జారికీర్తి హారితా సుధీరసా
సారధీ సుతాఢ్య సూన చంపమాన దారకా
కారదాన మానితాధిక ప్రభావ భారవీః

(ఇందుమతీపరిణయము—4 ఆ—256 ప. 124 పు. )

చూడు తొలిపలుకు—పుటలు xviii-xix.

త్రిదళచంపకబంధము:



వీరభావ భాసిసత్త్వ విద్ఖుజారి వారహా
హారవారి జారికీర్తి హారితా సుధీరసా
సారధీ సుతాఢ్య సూన చంపమాన దారకా
కారదాన మానితాధిక ప్రభావ భారవీ:

(ఇందుమతీపరిణయము-4 ఆ-256 ప. 124 పు.)

చూడు తొలిపలుకు-పుటలు xviii-xix.

# ఉపోద్ఘాతము

చతురాశ్వాస పరిమితమైన యిందుమతీపరిణయమను నీ ప్రబంధమును రచించిన కవిపుంగవుఁడు తెనాలి రామభద్రుఁడు. ఆశ్వాసాంత గద్యములను బట్టి యితఁడు శ్రీరామభద్ర కరుణా కటాక్ష వీక్షణ సమాసాదిత సరసకవితా వైచిత్ర్య పాత్రుఁడనియు, సుప్రసిద్ధుఁడైన తెనాలి రామకృష్ణకవి కనుజుఁడైన శ్రీగిరి కవి సార్వభౌముని పౌత్రుఁడనియు, అభినవ రామకృష్ణకవి పుత్రుఁడనియు, తిమ్మమాంబా గర్భరత్నాకర రాకా కైరవ మిత్రుఁడనియు, కౌండిన్యస గోత్రపవిత్రుఁడనియుఁ దెలియుచున్నది. ఇతఁడు యాజ్ఞ వల్క్యనియోగి బ్రాహ్మణశాఖకుఁ జెందినవాఁడు. ఇతని తాతయైన శ్రీగిరి శ్రీశైల మాహాత్మ్యమును రచించెను. ఇతని తండ్రికూడఁ గవియే కాని అతఁడేగ్రంథములు రచించెనో తెలియదు. రామభద్రకవి రచన యీ యిందుమతీపరిణయ మొక్కటే లభించుచున్నది.

రామభద్రకవి యిందుమతీపరిణయమును పాలచూరి కృష్ణభూపాలుని కంకితము కావించెను. కృష్ణభూపాలుఁడీ ప్రబంధమును దన కంకితము చేయుమని యడుగు సందర్భమున రామభద్రుని తండ్రి తాతలను, అన్నను ఈ క్రింది సీస పద్యమున వర్ణించియున్నాఁడు.

ప్రౌఢి మీపెద తాత పాండురంగాది స
　　త్కృతులఁ జేసెను రామకృష్ణసుకవి
యనుజుఁడన్నప్ప మీపినతాత రచియించెఁ
　　బరఁగ సుదతీదా పరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీ విఖ్యాతి
　　శ్రీశైల మాహాత్మ్య కృతి యొసర్చెఁ
గడిమి మీ తండ్రి యిమ్మడి రామకృష్ణార్యుఁ
　　డనఁ గీర్తిగనె.సంస్కృతాంధ్రములను
వారలను మించె మీయన్న వీరరాఘ
　　వాఖ్యకవి సర్వ కవితా మహత్త్వమునను
నిన్ననూచాన సంతాను నెన్నఁదరమె
　　ప్రాజ్ఞ హృదయాబ్జరవి రామభద్రసుకవి.

దీనినిబట్టి రామభద్రకవి పినతాత అన్నయ సుదతీదా పరిణయమును రచించెననియు, నితని యన్న వీరరాఘవుఁడుకూడ గొప్పకవి యనియుఁ దెలియు చున్నది. ఈ రెండు విషయములను గద్యములందితఁడు పేర్కొనియుండ లేదు.

ఈ ప్రబంధమునందలి కృతిపతి వంశవర్ణనమునుబట్టి పాలచూరి కృష్ణ భూపాలుని వంశ వృక్షము నీ క్రింది విధముగా నిరూపింపవచ్చును.




పాలచూరి వంశమునఁ బుట్టిన పై వారినందఱిని కవి మహారాజులుగానే వర్ణించెను. కాని వారెవ్వరును గొప్ప రాజ్యమున కధిపతులైనవారుకారు. వారు దండనాయకులో మండలాధిపతులోయై యుండవచ్చును.

కృతిపతియైన కృష్ణమహీపతికి షడ్దర్శనీ పారగుఁడైన తిరుమల శ్రీనివాసాచార్యులు గురువుగా నుండెను. సాంబోపాఖ్యాన కర్తయైన రామరాజు రంగప రాజునకుఁగూడ నీ శ్రీనివాసాచార్యులే గురువు. బహుశః అతఁడొకరికి వార్ధకమునను మఱొకరికి యౌవనమునను గురుత్వము నిర్వహించి యుండునని శ్రీ చాగంటి

* కృష్ణక్షితీశునికిరువురు భార్యలు వెంకటమ్మ – లక్ష్మమ్మ

శేషయ్యగారి అభిప్రాయము. రామభద్రుని తాతయైన శ్రీగిరికవి క్రీ. శ. 16 వ శతాబ్ది పూర్వార్ధమున నివసించినట్లు తెలియుచున్నది. అతడు పాండురంగ మాహాత్మ్యకృతికర్తయైన రామకృష్ణునికి తమ్ముఁడు కదా! అతనికి మనుమఁడైన యేతత్కావ్యకర్త 16 వ శతాబ్ది యుత్తరార్ధమున జనించి 1580 వ సంవత్సరము ప్రాంతమున నిందుమతీపరిణయమును రచించియుండునని భావింపవచ్చును.

కవి కులగురువైన కాళిదాసు రఘువంశము నందలి పంచమసర్గమున వరతంతు శిష్యుఁడైన కౌత్సుఁడు గురుదక్షిణార్థమై ధనమును యాచింప విశ్వజిద్యాగమొనరించి తన వైభవమునంతను అర్థిసాత్కృత మొనరించి మృణ్మయ పాత్రశేషుఁడై యుండిన రఘుమహారాజును దర్శించుటయు, కుబేరునివలన నాతఁడు సువర్ణమును బొంది కౌత్సున కొసంగుటయు, కౌత్సుఁడు సంతోషించి యాతనికి పుత్త్రప్రాప్తియగుఁగాకయని వర మొసంగుటయు, నజుఁడాతని కుదయించి యౌవనము నొంది యిందుమతీస్వయంవరమున కరుగుచు మార్గమధ్యమున నర్మదాతీరమున శాపవశమున గజరూపము నొందిన ప్రియంవదుఁడను గంధర్వునకు శాపవిమోచనము కావించి యాతనివలన సమ్మోహనాస్త్రమును బొందుటయు వర్ణించెను. అట్లే షష్ఠసర్గమున నతఁడిందుమతీస్వయంవరమును వర్ణించెను. సప్తమ సర్గమున నజుఁడు తనపై దండెత్తిన రాజులనందఱి నోడించి యిందుమతితో నయోధ్యకరుదెంచుటను విపులముగా వర్ణించెను. రామభద్రకవి రఘువంశము నందలి యీ కథనే మూలముగా గ్రహించి యెడనెడఁగొన్ని యధికవర్ణనములను జేర్చి యీ ప్రబంధమును రచించెను.

రామభద్రకవి రఘువంశమునందలి శ్లోకములను యథాతథముగా ననువదించి యుండలేదు. కాని యందలి భావములను సన్నిహితముగా ననుసరించెను. అతఁడచ్చటచ్చట కొన్ని భావములను విడిచివైచుటయు, కొన్ని చోట్లఁబూర్వ ప్రబంధముల ననుసరించి నూత్నభావములను జేర్చుటయుఁగానిపించును. అతఁడు కాళిదాసుని భావముల ననుసరించిన విధానమును సూచించుటకై కొన్ని యుదాహరణముల నొసంగెదను.

సమృణ్మయే వీతహిరణ్మయత్వాత్పాత్రే నిధాయార్ఘ్యమనర్ఘశీలః
శ్రుతప్రకాశం యశసా ప్రకాశః ప్రత్యుజ్జగా మాతిథి మాతిథేయః
తమర్చయిత్వా విధివద్విధిజ్ఞః తపోధనం మానధనాగ్రయాయీ
విశాంప తిర్విష్టరభాజమారా త్కృతాంజలిః కృత్యవిది త్యువాచ [రఘు— 2. 3.]

వచ్చునమ్మౌని లోకవర్యు నవార్య సంభ్రమ మోదముల్
హెచ్చునచ్చపుభక్తితో నెదురేఁగి సర్వధనంబుమున్
వెచ్చపోవుట మృద్వికార నవీన పాత్రిక నర్ఘ్యమున్
దెచ్చి పూజలొనర్చి తోఁగొనితెచ్చి నెయ్యము మిఱఁగన్

అర్థాసనమున నంపహో
నిర్ధారణ పటిష్ఠు నమ్ముని శ్రేష్ఠుమహీ
బర్హిర్ముఖ వరుఁ డహిత ని
బర్హణుఁడానృపతి యునిచి పలుకుం బ్రేమన్ [ద్వితీ. 13, 14]

పై శ్లోకములకుఁ గ్రింది పద్యము లనువాదములు కాకపోయినను రెండింటఁ గల భావము మాత్రము సమానమే. మూలమునందలి విశేషణములు కొన్ని తెలుఁగున విడిచి వేయఁబడినవి. కొన్ని క్రొత్తగాఁ గల్పింపఁబడినవి. ఈ యను సరణము చతుర్థాశ్వాసమున మఱింత సన్నిహితతరముగాఁగనిపించును.

రతేర్గృహీ తానునయేన కామం ప్రత్యర్పిత స్వాంగమివేశ్వరేణ
కాకుత్థ్సమాలోకయతాం నృపాణాం మనో బభూవేందుమతీ నిరాశమ్ [రఘు ౬.౭]

రభసము చూపుశంకరు ఖరంబగు చూపునఁ బ్రాఁతమేనుపో
నభినవ మూర్తిదాల్చు మకరాంకునికై వడిఁ బొల్చునారఘు
ప్రభవుని సింహాసంహనన భావము రాజులు వీతతేజులై
యభిరతిఁజూచి యిందుమతి యందు నిరాశతఁ జెంది రందఱున్. [చతు॥]

శంకరుని సెగకంటి మంటచే మన్మథుఁడు భస్మసాత్కృతుఁడయ్యెను. రతి ప్రార్థింప శంకరుఁడాతని మరల జీవింపఁ జేసెను. మన్మథుని ప్రాఁతరూపముకంటెఁ గ్రొత్తరూపమెక్కువ సుందరముగానుండుట సహజము. రామభద్రుఁడు "రతేర్గృహీ తానునయేన" అను మూలశబ్దములను విడిచివైచినను ఆ భావమునే పద్యమున వెల్లడించెను. "రఘుప్రభవుని సింహాసంహనన భావము రాజులు వీతతేజులై" అను పద్యమునందలి పదముల మూలకములు. మిగిలినది చక్కని అనువాదము.

కశ్చిత్కరాభ్యాముపగూఢనాల మాలోల పత్రాభిహత ద్విరేఫమ్
రజోభి రంతః పరివేషబంధి లీలారవిందం భ్రమయాంచకార [రఘు ౬–౧౩]

ఇందుమతిని జూడఁగనే యొకరాజు లీలారవిందమును జేతఁద్రిప్ప మొదలిడెను. నీవు నన్ను వరించుచో నీ విధముగనే నన్నుఁ జేతఁ ద్రిప్పఁ జాలుదువని యాతని యాంతరమైన భావము. ఈ భావము నించుక మార్చి రామభద్రుఁడీ క్రింది పద్యమును వ్రాసెను.

భ్రమణ వశంబునం జెదరఁ బాఱిన రేకుల తాకునన్ మరం
దమహిత సౌరభ స్పృహాలనంటున నంటుచుఁ బాయుచున్మద
భ్రమరము లుగ్ర సంసృతి నిబద్ధులకైవడి ఖేదమోద సం
గము వహియింపఁగాఁ గరయుగంబున నొక్కఁడు త్రిప్పెఁ బద్మమున్ [చతు.26]

ఇందలి "ఉగ్రసంసృతినిబద్ధుల కై వడి ఖేద మోదసంగము వహియింపఁగా" ననునది 'అమూలకము, కల్పనము బాగుగనే యున్నది కాని సందర్భమున కంతయనుగుణముగాలేదు. పద్మమును' ద్రిప్పుట రెండింటను సమానమే.

విలాసినీ విభ్రమదంత పత్రమాపాండురం కేతక బర్హమన్యః
ప్రియానితంచోచితసన్ని వేశైర్విపాటయామాసయువా నఖాగ్రైః [రఘు.౬-౧౭]

ఈ శ్లోకముభావమును రామభద్రుఁడొక సీసపాదమున సంగ్రహముగా సూచించెను.

లీలఁగేదఁగిరేకు వాలారు కొనగోళ్ళఁ
బెక్కుభంగులఁ జెక్కె నొక్కరాజు [చతు. 25]

ఈ సీసమునందలి యితరపాదములందలి భావములకుఁ గూడ రఘువంశమున నాకరములున్నవి.

సునంద వర్ణించి చెప్పిన రాజులక్రమము మూలమునందును ఆంధ్ర కావ్యము నందును సమానముగా నున్నది. క్రమమేకాక వర్ణనముకూడఁ గొంచె మించు మించుగా సమానమే.

క్రియా ప్రబంధాదయ మధ్వరాగా మజస్రమాహూత సహస్రనేత్రః
శచ్యాశ్చిరం పాండుకపోల లంబాన్మందార శూన్యానలకాంశ్చకార
[రఘు౬-౨౩]

దండిని తండనారత కృతక్రతు భోగములన్నగారికిన్
బండువుగాఁగ నిచ్చలును బైనము కల్గఁగఁ జేసి కల్పకా
ఖండలతాంత శూన్యములుగా నొనరించెఁ బులోమనందనీ
పాండురగండ మండలుల పజ్జల వ్రేలెడు కుంతలంబులన్[చతు.39]

పై శ్లోకమునకుఁ బద్యమనువాదమే యనఁదగి యున్నది. ఈ విధముగా నందలు రాజుల వర్ణనములందును సంస్కృతాంధ్రకావ్యములందు సన్నిహితమైన సంవాదము కనవచ్చుచున్నది.

స్వసుర్విదర్భాధిపతేస్తదీయో లేభే ౨ంతరం చేతసి నోపదేశః
దివాకరా దర్శనబద్ధకోశే నక్షత్రనాథాంశు రివారవిందే [రఘు ౬-౬౬]

అనిపలుకు నాసునంద వాక్యమునకప్పు
డిందుమతి మది నవకాశమియ్యదయ్యె
వేవెలుంగుల దొరలేని వెచ్చమునుఁగు
తమ్మిశశికాంతి కెడయీక తనరు కరణి [చతు. 67]

సూర్యుఁడు లేనికతమున నరవిందము బద్ధకోశమయ్యెననియు నందుచేఁ జంద్ర కిరణమందుఁ జొచ్చుట కవకాశము లేకపోయెననియు మూలశ్లోకభావము. రామభద్రుఁడు కొంచెము మార్చి తమ్మి సూర్యుని వియోగమునఁ దపించుచు శశికాంతి కెడమీయలేదని రచించెను. మూలమున నొక సొగసున్నది; తెలుఁగున నింకొక సొగసున్నది. వియోగసంతప్తులు చంద్రకాంతిని సహింపరు. దానిని నివారింపఁ జూతురు. అట్లే తమ్మియు సూర్యవియోగమునఁ దాపమొందుచుఁ జంద్రకాంతి కెడమీయలేదని కవి భావము.

సంచారిణీ దీప శిఖేవ రాత్రే యం యంవ్యతీయాయ పతింవరాసా
నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే వివర్ణ భావం సస భూమి పాలః [రఘు ౬-౬౭]

కాళిదాసునికి దీపశిఖాకాళిదాసను ప్రఖ్యాతి చేకూర్చిన గొప్ప శ్లోకమిది. దీనిని రామభద్రుఁడిట్లు రూపొందించెను.

రేలు చలియించు దీపిక
పోలిక నలసతి ధరాధి పులఁగడవఁగఁద
త్పాలక .... .... .... ....
హేల వైవర్ణ్యమున వహించెం జాలన్. [చతు. 68]

ఇందలి మూఁడవ పాదమును గొంత సవరింపవలసి యున్నది. "తత్పాలక వర్గంబట్టము హేలన్" అని మార్చినచో మూలభావము కొంతవఱకైన వ్యక్తము కాఁజాలును. మూలమునసే యేరాజు నామె యతిక్రమించెనో యాయా రాజుల వైవర్ణ్యమును భజించెనని కలదు. తెలుఁగున ధరాధిపులఁ గడవఁగ అని రాజుల నందఱిని సూచించుబహువచన ముపయోగింపఁబడినది. అజుఁడు తప్ప మిగిలిన రాజులని యర్థము చేసికొనవలెను. ఇట్టి శ్లోకములందలి భావమును వ్యక్తము చేయుపట్టున నధికమైన శ్రద్ధ వహింపవలసి యున్నది.

ఇందుమతీ పరిణయము వ్రాత ప్రతులలో చతుర్థాశ్వాసములోని 60 వ పద్యము తరువాత "ఇట గ్రంథపాతమనుమితమని" సూచింపఁబడి యున్నది. నిజమున కిచ్చట గ్రంథపాతమేదియు లేదు. 60 వ పద్యము వఱకును శూరసేనాధిపుఁడైన సుషేణుని వర్ణనము కలదు. తరువాత సంస్కృతమున

నృపం తమావర్త మనోజ్ఞ నాభిః సావ్యత్యగా దన్యవదూర్భవిత్రీ
మహీధరం మార్గవశాదుపేతం స్రోతోవహా సాగరగామి నీవ [రఘు ౬-౫౨]

అను శ్లోకమున్నది. తెలుఁగు కావ్యమునందలి యీ క్రింది 61 వ పద్యము

అజభామిని గాఁదగునన
గజగామిని యతనిఁ జూడక చనియె మార్గ
వ్రజదవని ధర మెదుర్పఁగఁ
ద్యజియించి పయోధిఁ జెందనగు నది వోలెన్. [చతు. 61]

సరిగాఁ బై శ్లోకమున కనువాదమని చెప్పఁదగినది. అందుచే నిచ్చట గ్రంథ పాతములేదు. 62 వ పద్యము హేమాంగద నాముఁడైన కళింగాధిపుని పేర్కొను చున్నది. అతని గుణముల వర్ణనముకాని అది విని యిందుమతి యతిక్రమించి పోవుటకాని తెలుఁగు కావ్యమునఁగనవచ్చుట లేదు. రఘువంశమున హేమాంగ దుని వర్ణనము పంచ శ్లోకపరిమితమై యున్నది. అందుచే నా గ్రంథపాతము 62, 63 పద్యముల నడుమనున్నదని నిర్ణయింపవచ్చును.

అజుఁడిందుమతితో నయోధ్య కరుగుచుండ స్వయంవరాగతులై తిరస్కృతు లైన రాజు లాతని నెదిరించిరి. అప్పుడు కాళిదాసు

> తస్యా స్స రక్షార్థ మనల్పయోధ మాదిశ్య పిత్ర్యం సచివం కుమారః
> ప్రత్యగ్రహీ త్పార్థివవాహినీం తాం భాగీరథీం శోణ ఇవో త్తరంగః
> [రఘు ౬–౩౬]

అను శ్లోకము రచించెను. రామభద్రుఁడా భావమునే గ్రహించి

> — అపుడజరాజు భోజతనయామణిఁగావ సుహృద్వసుంధరా
> ధిపతుల నిల్పి యేపున నెదిర్చె నిరంతర గర్వ ధూర్వహో
> కుపిత మనస్కతానిరత ఘోర తరాహిత రాజవాహినిన్
> త్రిపథగ నుత్తరంగ పరిదీపిత శోణ నదంబుకైవడిన్ [చతు. 162]

అను పద్యమును రచించెను. ఇది సంస్కృతమున కనుసరణమే. కాళిదాసిందు మతిని రక్షించుటకై సచివుని నియోగించెనని వ్రాయ రామభద్రుఁడు సుహృద్వసు ధరాధిపుల నియోగించెనని వ్రాసెను. ఈ మార్పు మూలమునకేవిధముగను లాఘవము కలిగించుటలేదు.

ఈ విధముగా రామభద్రుఁడు 2, 3, 4 ఆశ్వాసములలో రఘువంశము నందలి పంచమ షష్ఠ సప్తమ సర్గము లందలి శ్లోకములను పెక్కింటి ననుసరించుటయో అనుకరించుటయో అనువదించుటయో కనవచ్చును. దానితోఁ దృప్తిపడక యాతఁడు తన కావ్యమున ప్రబంధ లక్షణములఁ బ్రవేశపెట్టుటకై కొన్ని నూత్న కల్పనలుకూడఁ గావించెను. రఘువంశమునందుఁ గానరాని యా కల్పనలలో ముఖ్యములైన వాని నిచ్చట సూచించెదను.

రామభద్రుఁడిందుమతీ పరిణయము నయోధ్యా పురవర్ణనతో నారంభించెను. అతఁడందలి కాసారములను, పరిఘను, సౌధములను, హర్మ్యములను, కోటను, చతురంగబలమును, చాతుర్వర్ణ్యమును, వారాంగనలను, పుష్పలావికలను, సస్యములను, శాలిగోపికలను ప్రబంధోచితముగా వర్ణించెను. రఘు మహారాజన పత్యతకుఁజింతించుచుండ నతని భార్య యాతనినోదార్చి వసిష్ఠునిభజించుచో నభీష్టసిద్ధియగునని తెల్పెను. రాజువసిష్ఠుని జూడనరుగుటకై సిద్ధపడుచుండ వసిష్ఠుఁడే యటకరుదెంచెను. రాజాతని నుచితరీతి గౌరవించి తన చింత నెఱిఁగించెను. వసిష్ఠుఁడు విశ్వజిద్యాగము చేయుమని యుపదేశించెను. రాజట్లే యాచరించెను. రఘువంశమున కాళిదాసు రఘు జైత్రయాత్రను విపులముగా వర్ణించి యనంతర

మాతఁడు విశ్వజిద్యాగము నొనరించెనని మాత్రము తెల్పియుండెను. అందాయాగ మాతని యనపత్యతానివారణమునకుఁ బరోక్ష కారణమే కాని ప్రత్యక్షకారణము కాదు.

ద్వితీయాశ్వాసము మొదట రఘువుకొల్వు తీర్చినవిధము వర్ణింపఁబడినది. ఇది రఘువంశమున లేదు. రఘువు కొల్వు తీర్చియున్న సమయముననే కౌత్సుఁడరుదెంచి యాతని దర్శించెను. రఘువంశమున రఘువు కౌత్సునిఁ గుశలప్రశ్న కావించుచు నాశ్రమమున సర్వము సక్రమముగానున్నదాయని ప్రశ్నించినట్లున్నది. ఇందుమతీ పరిణయమునకీ వృత్తాంతమంత ప్రధానమైనదికాకపోవుటచేఁ గవి దానిని జాల సంగ్రహించెను. కౌత్సాగమన మజ జననమునకు హేతువగుటచేనది మాత్రము సంక్షేపముగాఁ జెప్పఁబడినది. కౌత్సప్రపత్తి వరమునకు ఫలముగా రఘుని పట్టమహిషి గర్భము ధరించెను. రామభద్రుఁడామె గర్భ లక్షణములను మనఃపరిస్థితిని వర్ణించి యష్టాదశ వర్ణనలలో నొకదానికి స్థానము కల్పించెను. కాళిదాసు "రాజా పిలేభేసుత మాశుతస్మాదాలోక మర్కాదివ జీవలోకః" అని యొక్క వాక్యముతో నజ జననమును జెప్పివైచెను. రామభద్రుఁడజుని బాల్యమునుగూడ సంగ్రహముగా వర్ణించియుండెను.

ఇందుమతీస్వయంవరమునకు రమ్మని విదర్భ రాజాహ్వానములు పంపుటకు ముందు ద్వితీయాశ్వాసమున నిందుమతి సర్వాంగ వర్ణనము కావింపఁబడినది. రఘువంశమున నీవర్ణనములేదు. స్త్రీవర్ణన మష్టాదశ వర్ణనములలో నొకటి. అజుఁడు స్వయంవరమున కరుగుచు నర్మదాతీరమున ఋక్షవత్పర్వతమును గాంచెను. నయదేవుఁడను మంత్రి కుమారుఁడతని కా పర్వతమును వర్ణించి చెప్పెను. తృతీయాశ్వాసమున ప్రియంవదుఁడు గజాకారమును విడిచి గంధర్వ రూపము నొందినపిమ్మట నజుఁడడుగఁగాఁ గనకు శాపమొదవుటకుఁ గారణమును విపులముగా నెఱింగించెను. రఘువంశమున "మతంగ శాపాదవలేప మూలాదవాప్త వానస్మి మతంగజత్వ" మ్మని శాపవృత్తాంత మూరక సూచింపఁబడినది. రామభద్రుఁడు శాపమునకు హేతువైన ప్రియంవదుని అవలేపమును గూడ వివరించెను.

అజుఁడు విదర్భానగరము చేరుసమయమునకు వసంతర్తు వరుదెంచెను. అప్పుడిందుమతి చెలికత్తెలతో శృంగారవనమునకు వచ్చి పుష్పావచయము కావించి పిమ్మట జలక్రీడ నవరించెను. పిమ్మట వారుచితములైన దుస్తులు ధరించి వచ్చుచుండఁగా నా శృంగారవనముననే విశ్రమించి మంత్రి సుతుఁడెఱిఁగించుచున్న విదర్భానగర విశేషములు వినుచుండిన యజుఁడు వారిని గాంచెను. ఈ విధముగాఁ గవిస్వయంవరమునకు ముందే నాయికానాయకులకుఁ బరస్పర సందర్శనము కలిగించెను. తరువాత నజుఁడు తనకు నిర్దేశింపఁబడిన శిబిరమునకేగి విరహబాధ ననుభవించుచుండెను ఈ సందర్భముననే సూర్యాస్తమయ, సంధ్యాంధకార, తారకా, చంద్రోదయాదులను, నాయికా విరహతాప శీతలోపచార, మదన, చంద్ర, మలయ మారుత, శుకపిక వసంతాద్యుపాలంభములును గావింపఁబడినవి. అనంతరము తెల్లవాఱుటయు ప్రాతస్ సూర్యోదయములు వర్ణితములైనవి. కవి తృతీయాశ్వాసమున నీవిధముగాఁ బ్రబంధోచితములైన పెక్కు వర్ణనల కవకాశము కల్పించుకొనెను. రఘు వంశమున నీ సందర్భమున కాళిదాసీ వర్ణనలను జేసియుండలేదు.

చతుర్థాశ్వాసమున స్వయంవర మందిరమునకు రాకపూర్వము నాయికయైన యిందుమతి స్నాన వేషాలంకారాదులు వర్ణింపఁబడినవి. సునంద స్వయంవరాగతులైన రాజుల గుణగణములు వర్ణించి చెప్పుచుండ నిందుమతి వారి నందఱిని గడచి యజుని చెంతకరుదెంచెను. ఈ సందర్భమునఁ గవి నాయికా నాయకుల చూపులను భావ గంభీరముగా వర్ణించి యుండెను. స్వయంవరానంతరము రాజమార్గమున నరుదెంచు నజునిగాంచి నగరాంగనలు పారవశ్యమున నొనరించిన వివిధ చేష్టా విశేషములను, గాళిదాసు చక్కఁగా వర్ణించెను. రామభద్రుఁ డీసందర్భమునఁ గాక యజుఁ డిందుమతితో నయోధ్య చొచ్చు సందర్భమున, నచ్చటి స్త్రీ లజునిగాంచి కావించిన వివిధ చేష్టలు వర్ణించియుండెను. వివాహమునకు ముందు నాయికా నాయకులు స్నాన మొనరించిన విధము నతఁడు విపులముగా వర్ణించెను. కాళిదాసు వివాహమునకు సంబంధించిన వైదిక క్రియలు కొన్ని రఘువంశమునఁ బేర్కొనెను. రామభద్రుఁడు తన నాఁడు ప్రచారమున నుండిన లౌకిక వైదిక వైవాహిక క్రియల నన్నిటిని సమగ్రముగాఁ దెల్పి యుండెను. ఇందుమతికిఁ దల్లి గావించిన యుపదేశము రఘువంశమున లేదు.

అజుఁడును ఇందుమతియు నయోధ్యకరుదెంచిన పిమ్మట స్త్రీలు వారిని స్నానము చేయించి హారతు లొసంగిరి. పడుకటిల్లు యథోచితముగాఁ గైసేయఁబడెను. చెలు లిందుమతి నజుని కడఁజేర్చి యరిగిరి. తరువాత నా దంపతులు శృంగార విహారము లొనరించిరి. తెలుఁగు కావ్యము తండ్రి అజుని యువరాజుగాఁ జేయనెంచి రాజధర్మము లుపదేశించుటతో ముగియుచున్నది. ఈ విధముగా రామభద్రుఁడు ప్రధాన కథాభాగము నంతను రఘువంశమునుండియే గ్రహించినను ఎడనెడ నందులేని వర్ణనములను జొప్పించి తన కావ్యమును సర్వాంగ సంపన్నమైన ప్రబంధముగాఁ దీర్చిదిద్దెను.

ఇందుమతీ స్వయంవరము నందలి ప్రధానరసము శృంగారము. దీనికను గుణముగనే కవి ద్వితీయాశ్వాసమున నిందుమతి సర్వాంగ వర్ణనమును, తృతీయాశ్వాసమున పుష్పాపచయ జలక్రీడా విహారములను, నాయికా నాయక పరస్పర సందర్శన విరహ తాపములను, చంద్రమన్మథాద్యుపాలంభములను, చతుర్థాశ్వాసమున స్వయంవరాగత రాజకుమారుల శృంగార చేష్టలను, గావ్యాంతమున సంభోగ శృంగారమును వర్ణించి యుండెను. చతుర్థాశ్వాసమునందలి 229–235 వఱకుఁగల పద్యములు సంభోగ శృంగారాత్మకములయ్యును అసభ్యతాకాకరములు కాక యౌచిత్యభాసురములుగా నున్నవి. మొత్తముమీఁద నీకవి శృంగారరస వర్ణనమునఁ గొంత నిగ్రహము ప్రదర్శించెననియే చెప్పవలయును. ఈ కావ్యమున వీరరౌద్ర కరుణాద్భుత రసము లంగములుగా నున్నవి. చతుర్థాశ్వాసమున నిందుమతి తమ్మువరింపక యజుని వరించెనను నీసుచే నితర రాజులందఱు నొక్కుమ్మడి అజునిదాఁకి యతనితో యుద్ధ మొనర్చిరి. ఈ సందర్భమున నజుఁడు ప్రదర్శించిన పరాక్రమ మప్రతిమానమైనది. అతఁడుసమర్థుఁడయ్యు నారాజులను జంపక ప్రియంవదుం డాదరమున నొసంగిన సమ్మోహనాస్త్రము సాహాయ్యమున మూర్ఛితులను గావించి విడుచుట యతని ధీరోదాత్తతను బ్రకటించుచున్నది. "సంకులంబగునట్టి సమర ధరణి నుజ్జులు ప్రేవులు మాంసాస్థి కేశముల్ తతకపాలములు రక్తస్రవంతు

లెల్లెడ ఘోరమై యేనుఁగు ల్వీనుఁగులుగ" (4-178) ఇత్యాది వర్ణనము బీభత్సమున కిమ్మై యున్నది. జయలాభానంతర మజుఁడిందుమతిని జేరి యామెకు రాజలోకమును వర్ణించిచెప్పు సందర్భమున వీరశృంగారముల కలయిక గోచరించుచున్నది. "వీర శృంగార రసములు వెల్లి విఱియ నిందుమతిఁజేరి ధాత్రీ పురందరుం"డని కవియు నీవిషయమును సూచించినాఁడు. ప్రథమాశ్వాసమున రఘువస పత్యూత కళమున నుమ్మలించుట కరుణ రసమున కాకరమై యున్నది. రఘువు దండెత్తి వచ్చు చున్నాఁడని చారులచే విని కుబేరుఁడతని కోశాగారమున బంగారువాన కురియించుటయు, రఘుబాణచ్ఛిన్నకుంభమై యేనుఁగుగంధర్వాకారమును బొందుటయు నద్భుతరసావహాములై యింపు నింపుచున్నవి. ప్రియంవదుఁడు తన శాపమునకుఁ గారణము నెఱింగించుచు జల విహారమును వర్ణించు సందర్భమునఁ గూడ శృంగార రసము గోచరించుచున్నది. ఈ విధముగాఁ బ్రబంధమునఁ గవి ప్రధానమైన శృంగారమునేకాక యంగములైన వీరాద్భుతాదులనుగూడ నౌచిత్య శోభితములుగాఁ బోషించియున్నాఁడు.

కవి యీ కావ్యమున నాయా సందర్భములందుచితములైన వర్ణనల నెట్లు ప్రవేశపెట్టియుండెనో యిదివఱకుఁ దెల్పఁబడినది. ఈ కవి వర్ణన ప్రియుఁడు. ఇతని వర్ణనలలోఁ బ్రౌత్తఁదన మంతగా లేకపోయినను అవి సంప్రదాయానుసారులును గొండొకచో నుదాత్తభావ బంధురములునై యింపునింపుచున్నవి. ప్రథమాశ్వాసమున నతఁడు కృతిపతి వంశమునందలి వీరులనందఱిని భక్త్యాదరములతో వర్ణించి యుండెను. కృతిపతియైన కృష్ణభూపతి దానరూపపరాక్రమాదుల వర్ణించుపట్ల నతఁడెంతో అభినివేశము ప్రదర్శించి యుండెను. "సంతత నవనీత చౌర్యపారంపరీ కర్మ తత్త్వమ్మునఁ గన్నకొదవ" (1—65) అను సీసము తిమ్మన పారిజాతాపహారణమున శ్రీకృష్ణదేవరాయలఁ బోల్చుచుఁ జెప్పిన పద్యమును దలఁపించుచున్నది. "వరగారుత్మతకూట ఝూటరుచి" (1—95) అను పద్యమయోధ్యాపురమునందలి హర్మ్యముల యౌన్నత్వముతోపాటందలి మృగేక్షణల యౌదార్యౌన్నత్యమునుగూడఁ జాటుచున్నది. "తముఁజూచు విటుల చిత్తముల బాగునసాగు సొగసు నిద్దపువాలుఁ జూపులమర" (1—106) అను పద్యము హారునైన మరునైన మరులుగొలుపఁజాలి విహరించు నయోధ్యాపురస్థిత వారవిలాసినుల సౌందర్యశోభను జక్కగా వివరించుచున్నది. పుష్పలావికలను వర్ణించు (108) వ పద్య మితరప్రబంధములందువలె శృంగారపుఁ బచ్చితనమున కెడమీక మిక్కిలి సరసముగా నున్నది. "జిలిబిలి మాటలన్ బ్రియము సేయుచు" (1—123) అను పద్యము స్వభావోక్తి శోభితమై రఘుమహారాజునకు సంతానాభావముచేఁ గలిగిన యావేదనను జక్కగా వెల్లడి చేయుచున్నది. సాధారణముగా ననపత్యతా దుఃఖము స్త్రీలయందెక్కువగా నుండునట్లు వర్ణింపఁబడుచుండును. ఇచ్చట కవి యా దుఃఖము రఘువు ద్వారముననే వెల్లడించి భార్య యాతని ననునయించినట్లు ప్రదర్శించెను.

అన్నువ మోమునఁ దెలుపున్
జన్నుంగవ మొనల నీల సమమగు నలుపున్
నెన్నడుమునఁబెను బలుపున్
గన్నియమైనాఁడు నాఁటఁ గానఁగనయ్యెన్॥ [2—45]

అని గర్భవతియైన పట్టమహిషిని వర్ణించు పద్యము సహజమై యామె యంగములఁగలిగిన పరివర్తనమును ప్రకటించుచు నత్యంత హృద్యముగా నున్నది. ఇందుమతి యంగముల వర్ణించు సందర్భమునఁగవి కవి సమయములను బాటించుచునే యామె సౌందర్యాతిశయము నతినిపుణముగాఁ ప్రదర్శించెను.

చెలికుచములు దళములువడి
బలసి మొనలు దీఱి గుడుసువడి యొండొకటిన్
గెలుచుమది సంధిపుట్టక
నిలిచెఁ బరస్పరము నరులనెఱఁ దుల్యములై [2–72]

అనుపద్యమున దళములువడి, బలసి, మొనలుదీఱి, ఒండొకటిన్ గెలుచుమది, సంధిపుట్టక అను పదములు కుచముల యన్యోన్య వైరిత్వమును జక్కఁగాఁ జాటుచున్నవి. (2–78, 79) పద్యము లిందుమతి యప్రతిమాన సౌందర్యమును నిపుణముగా వ్యక్తీకరించుచున్నవి.

ద్వితీయాశ్వాసమున నయదేవుఁడు రాజకుమారునకు ఋతుపత్పర్వతమును వర్ణించి చెప్పుట వసుచరిత్ర ద్వితీయాశ్వాసమున వయస్యుఁడు కావించిన పర్వత వర్ణనమును స్మృతికిఁ దార్చుచున్నది. తృతీయాశ్వాసమందలి వన్యద్వీపవర్ణనము (3–10) దానికిని కాటుకకొండకును గల సంపూర్ణసామ్యమును జక్కఁగాఁ ప్రదర్శించుచున్నది. ప్రియంవదుఁడు స్త్రీలతోఁగూడి మతంగుని కొలంకునఁ గావించిన జలవిహారవర్ణనమున నంగనల యంగములను సలిల ప్లవన సాధనములుగా నిరూపించిన విధమతిమనోహరముగా నున్నది.

ఊదికొని యా కొలంబెల్ల మోదమెసఁగ
నీది కడగంటిఁగాని యా యింతులందు
బద్ధమై పౌనరుక్త్య ప్రవృద్ధమైన
సాంద్రమోహాబ్ధి తెగనీఁదఁ జాలరైతి॥ [3. 21]

అను నెత్తుగీతి యా గంధర్వుని యవలేపమును లెస్సగాఁ ప్రకటించుచున్నది. "గొనబైన పదకాంతి కుంకుమ పూఁతగా వరరత్నకాంతి చిత్తరువుగాఁగ" (3–37) అను సీసమున నిందుమతి రూపమహిమ యుద్యాన రమకుఁ దగు గృహాలంకృతిగా నుండెనని తెల్పి కవి యా గృహాలంకరణ సాధనము లామె యవయవముల కాంతిచే నెట్లు సిద్ధించెనో రమ్యముగాఁ జెప్పియున్నాఁడు. పుష్పాపచయజలక్రీడా, వర్ణనము లన్యప్రబంధముల యందలివానినే పోలియున్నను సుందరములుగా నున్నవి. ఇచ్చటి రగడ శబ్దాలంకార పూరితమై కవికి శబ్ద ప్రయోగమునఁగల కౌశలమును జాటుచున్నది. తృతీయాశ్వాసమందలి 91 వ పద్యమున గాఢాంధ కారమును సూర్యుని యపకీర్తివలె నున్నట్లు వర్ణింపఁబడినది. ఇందాయపకీర్తి కిఁ గారణములనినుని నుగ్రప్రభునితోఁ బోల్చుచుఁగవి చక్కఁగాఁ ప్రదర్శించియున్నాఁడు. "దండి లోఁకముల పై దండెత్తి చనుదెంచు శంబరాంతకు సితచ్ఛత్రమనఁగ" (3–102)

అను చంద్రవర్ణనము నందలి యుత్ప్రేక్షలు రమ్యములుగా నున్నవి. చంద్రమదన మలయ పవనాదులయుపాలంభములందలి భావములు కవి భావనాశక్తికిని భావ గాంభీర్యమునకును దార్కాణములుగా నున్నవి.

చతుర్థాశ్వాసము కాళిదాసుని రఘువంశమునందలి పెక్కు భావములను బుడికి పుచ్చుకొని యున్నది. స్వయంవరాగత రాజులయుం దరువాత వారజునితో నొనరించిన యుద్ధము యొక్కయు వర్ణనములు రఘువంశమునందలి వాని కను కరణములే. ఇందుమతి స్వయంవర మందిరమున కరుదెంచినపుడు రాజకుమారులు ప్రసారించిన చూపులను, దరువాత నజేందుమతుల చూపులను గవి చాల మనో హారముగా వర్ణించియున్నాడు. హృదయగతమైన యనురాగమునకుఁజూపులే సూచకము లౌటచే వాని కధిక ప్రాధాన్య మొసంగుట యెంతయు నౌచిత్య భాసురమై యున్నది. వివాహ కార్యకలాపమును వర్ణించునప్పుడు కవి చాల శ్రద్ధ వహించెను. అచ్చటచ్చటి సందర్భమున వైదిక లౌకిక సంప్రదాయములను దేశీయా చారములను ఒక్కటికూడ విడువకుండ సమగ్రముగా వర్ణించెను. విదర్భరాజు చెల్లెలి కరణ మొసంగుట, తల్లికూతునకు హితోపదేశ మొనరించుట కవి సహజముగను సంప్రదాయ సిద్ధముగను వర్ణించెను. కావ్యాంతమున వర్ణితమైన నాయికా నాయక సమాగమము సరసమును నౌచిత్యవంతమునై యొప్పారుచున్నది. రఘువు కుమారుని కుపదేశించిన రాజధర్మ మీ కాలమునఁగూడఁ బాలకులందఱును వల్లించి యనుక్షణము కార్యరూపము నొందింపవలసినదిగా నున్నది. ఈ విధముగా రామ భద్రుఁడే వర్ణనముచేసినను దానిని సర్వాంగ సుందరమును, సహజమును, వర్ణ్య స్వరూప సమ్యక్ప్రదర్శకమును, విశదమును గావించి పాఠక హృదయముల కింతింతనరాని యానందమునందిచ్చి యున్నాఁడు.

రామభద్రుడు కావ్యారంభ పద్యమున విష్ణువు పాలచూరి కృష్ణ భూపాలుని బ్రోచుఁగాతమని యాశీర్వచనమును బ్రకటించినాఁడు. ఆ విష్ణువు వక్షమున లక్ష్మి కెంపులతాళివలె నిరంతరము ప్రకాశించుచుండుననుటచే గావ్యమున బ్రధానరసము శృంగారమని వ్యక్తమగుచున్నది. మూఁడవ పద్యము శివపార్వతుల వివాహమును వర్ణించుచుండుటచేఁ గావ్యమునందలి యిందుమతీకల్యాణము సూచితమగుచున్నది. రామభద్రుఁడు సంస్కృత కవులను స్తుతించిన యనంతరము కవిత్రయమువారిని, సోమభాస్కరులను, పోతనశ్రీనాథులను, సూరనపెద్దనలను, తాతయైన రామ కృష్ణుని అన్నయను బేర్కొని యున్నాఁడు. గ్రంథాన్వేషణతత్పరులైన యార్వాచీన కవుల నతఁడు సాహితీ ద్రోహులుగాఁ భావించి నిరసించి యున్నాఁడు.

ఈ ప్రబంధమునందలి పాత్రలలో నాయికానాయకులైన యజేందుమతులును గంధవతీ రఘువులును, విదర్భాధిపతి తజ్జననులును, సునందయుఁ బేర్కొనఁదగినవారు కవి యజుని పరాక్రమమును, సౌందర్యమును, దయాదార్యములను, సరసత్వమును జక్కగా వర్ణించియున్నాఁడు. కావ్యాంతమునందలి నాయికానాయక సమాగమ దృశ్యమునుబట్టి యిందుమతి ముగ్ధానాయికిగాఁ గానవచ్చుచున్నది. విదర్భాధిపతి సోదరియందుఁ బ్రేమగలవాఁడుఁ; ఔచిత్యజ్ఞుఁడు అతని తల్లి యిందుమతికిఁ గావించిన యుపదేశము సర్వకన్యా శిరోధార్యమై యలరారుచున్నది. సునంద స్వయంవరా

గత రాజకుమారుల నుచితరీతిని వేదించి తన కార్యమును జక్కగా నెఱవేర్చినది. రఘువు కావ్యాంతమున నజుని కుపదేశించిన రాజధర్మ విశేషములతని ధర్మశీలమును ప్రజానురాగమును వ్యక్తము చేయుచున్నవి. ప్రియంవదుఁడు కృతజ్ఞుఁడు. అజుఁడు తనకుఁ గావించినమేలు తలంచి యాతనికి సమ్మోహనాస్త్రము నుపదేశించుట యిందుకుఁ దార్కాణము.

ప్రకటిత శబ్దబంధ రసభావ కవిత్వ విశేషవాసనా
ధిక మతిమంతులై వెలయు ధీరకవీశ్వరకోటికిన్ సమ
ర్పకముగ మాధురీగతిఁ బ్రబంధ మొనర్చిన నొప్పుఁగాక నే
రక యొనరించు కావ్యము ధరం బరిహాసకరంబుకాదొకో॥ [1–16]

అను పద్యము రామభద్రునికిఁ గవితారచన యెడఁగల యభిప్రాయమును వెల్లడిచేయుచున్నది. ఇతని రచన ధారాశుద్ధిశోభితమును, నిర్దుష్టమును, సంప్రదాయానుసారియు, రసవంతమునై యలరారుచున్నది. ఇతనికి శబ్దార్థాలంకారములందు మక్కువ యెక్కువ. ఇతని రచనలో ఉత్ప్రేక్ష, ఉపమ, రూపకము, అర్థాంతరన్యాసము, శ్లేష, అతిశయోక్తిమున్నగు నలంకారములు హెచ్చుగాఁ గనిపించును. ఆయబ్జపాణివేణిక (2–64) ప్రకటతరమైన నెమ్మోము రాజ రాజ వైభవముఁ దాల్ప (2–67) నాతోడఁగనఁ జూడుమీ (3–40) మున్నగు పద్యము లితని శ్లేషాలంకారప్రీతికి నిదర్శనములు. ఇతఁడు శబ్దాలంకారములను వాడిన పద్యములనేకములున్నవి. "పథికజన స్వాంతపాటన కుంతంబు" (3–33) "పెనుదంట కొనగంటఁ గనుఁగొంట మానుమప్పొదరింట నవలంటఁ బోవలేదె" (3–43) మున్నగు పద్యములితని శబ్దాలంకార ప్రయోగప్రౌఢికిని వసుచరిత్రమీఁది గౌరవమునకును దృష్టాంతములు. చతుర్థాశ్వాసమునందలి "లలితముకుందనీల శ్రీలఁదనివోండు" (73) అను సీసమున నిందుమతి గాత్రము నవనిధాన ఖనితోఁ బోల్చఁబడినది. కవి యా యుపమానము సార్థకమగునట్లుగా నందు నవరత్నముల నామనుల నిమిడ్చి యున్నాఁడు. ఇతని రచనలో సంస్కృతపదముల ప్రయోగమే హెచ్చు. ఎడనెడ నితఁడుదీర్ఘములైన సమాసములను గూడ వాడియున్నాఁడు. అక్కడక్కడ నీతఁడు ప్రయోగించిన కిచకొట్టించు, పింపుణుల్గురియు మున్నగు తెలుఁగు ధాతువులు రమ్యములుగానున్నవి. చతుర్థాశ్వాసము నంతమున నితఁడు నాగాది బంధపద్యములను రచించియున్నాఁడు. కావ్యమున నీతఁడు వృత్తవైవిధ్య మంతగాఁ జూపియుండలేదు. ఇతఁడు రెండు మూఁడుచోట్ల దీర్ఘవచనములను వ్రాసి యుండెను. అవి శబ్దార్థాలంకారమయములై మిక్కిలి ప్రౌఢముగా నున్నవి.

ఇందుమతీపరిణయ లిఖితప్రతులను గూర్చి యొకమాట. స్టేటు ఆర్కైవ్సు వారొక్క ప్రతిని మాత్రమే నాకొసంగినారు. అందు వ్రాఁత సరిగాలేదు. దోషము లనేకములున్నవి. తరువాత శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావుగారి యొద్ద మరొక ప్రతికలదని యెరింగి వారినడుగంగా వారు దయతో నాప్రతి నొసంగిరి. అందలి వ్రాఁత స్పష్టముగా నున్నది. అందు మేల్తరములైన పాఠములుకూడఁ బెక్కు లభించినవి. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. పైరెండు

ప్రతులలోఁగూడఁ గొన్ని లుప్తభాగములున్నవి. వానిని నేనట్లే యుంచితిని. వాని వలన కథాక్రమమున కెక్కడను భంగము కలుగలేదు. పైరెండు ప్రతులు పరిశీలించిన పిమ్మటఁగూడ నర్థముకాని భాగములు (పద్యములు) సుమారు పదివఱకు మిగిలి పోయినవి. వానిని నేను యథేచ్ఛముగా సవరింప నవకాశమున్నది. కాని నేనట్టి పనికి సాహసింపలేదు. భావికాలమునఁ బ్రత్యంతరములు లభించుచో వాని సాయమున నెడనెడ నిల్చిపోయిన దోషములను, లోపములను సవరించుకొనవచ్చును. వీలైనంతవఱకు వర్ణక్రమదోషములను, యతిప్రాసలనుబట్టి శబ్దదోషములను సవరించితిని. ఈ సవరింపులు చేయనిచోఁ గావ్యమును సుఖముగాఁ బఠించుటకే యవకాశముండెడిదికాదు.

రసవంతమైన యీప్రబంధమును బరిష్కరించి ముద్రింపవలెనని తలంచి దయతో నాపని నాకొప్పగించినవారప్పుడు స్టేట్ ఆర్కైవ్సు డైరెక్టరుగానుండిన రసజ్ఞులు పరిశోధనా పరాయణులు శ్రీ సీతాపతిరావుగారు. పరిష్కరణమున నాకెన్నో విధముల సాయము కావించి ముద్రణమును సాగించినవారు మిత్రులు, వాఙ్మయమహోధ్యతులు, కళాప్రపూర్ణులు, స్టేట్ ఆర్కైవ్సు లోని ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మానిస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్ సంయుక్త సంచాలకులు శ్రీ పడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు. వారికిని ఈ గ్రంథ పరిష్కరణకార్యమున నాకుఁ దోడ్పడిన యితర మిత్ర విద్వద్బృందమునకును వినయపూర్వకములు, హార్దములునైన కృతజ్ఞతావందనము లర్పించుచున్నాను. అముద్రితములైన యితరగ్రంథములను గూడఁ గ్రమక్రమముగా ముద్రితములు కావించి యాంధ్రభాషాపోషకపూర్వాలంకారములు సవరింప నాంధ్ర ప్రభుత్వమువారిని బ్రార్థించుచు విరమించుచున్నాను.

హైదరాబాదు — దివాకర్ల వేంకటావధాని.

27-2-1972

# ఇందుమతీపరిణయము

## ప్రథమాశ్వాసము

ఉ. శ్రీలలితాంగి వక్షమునఁ జెన్నుగఁ గెంపులతాళి లీల నే
వేళఁ బొసంగ రంగలరు వేంకట భూమి ధరాధినేత యా
నీల ఘనాఘన ప్రతిమ నిర్మల దేహుఁడు శౌరి నిత్యమున్
బాలచురీకులాబ్ధి హిమభానునిఁ గృష్ణనృపాలుఁ బ్రోవుతన్. 1

గీ. పద్మవర సుమకర, మహాపద్మగృహ, ము
కుందసుందరి, కూర్మాంఘ్రి, కుందరదన,
నీలకచ, శంఖగళ, లక్ష్మి నిధులతోడఁ
దిమ్మవిభు కృష్ణునింట వర్తిల్లుఁ గాత. 2

మ. సరసీజాసనుఁ డాదిసూక్తులు గుణించన్, మౌనిరాట్కన్యకల్
సరసం బాడఁగఁ, దాళి గట్టునెడ భూషారత్నముల్ వొంగఁగా
తరయౌ శైలజఁ జూచి నవ్వెడు సుధాధామార్ధ జూటుండు పా
ల్చురి తిమ్మాధిపుఁ గృష్ణభూవరున కిచ్చున్ శాశ్వతైశ్వర్యముల్. 3

సీ. ధవళ తరస్మేర తరుణ ముఖాంభోజ
ధవ లసదాత్మీయ తను విభాగ
తారకాంచిత దృగ్వితాన యౌ హరిణాక్షి
తారకారిని గన్న ధన్యచరిత
చంద్రకీవర ఫింఛసదృశ మోహనవేణి
చంద్రమశ్శకల భూషావిశేష
మేనఁ గాదంబినుల్ మెఱయించు విరిబోఁడి
మేనకాత్మజనాఁగ మించు తరుణి
తే. గీ. భిల్లపతిఁ గూడి యటులు శోభిల్లు సాధ్వి
సర్వమంగళ మంగళాచార మహిత
పాలచురి కృష్ణమేదినీపతిబిడౌజుఁ
దనదు కారుణ్య రసరూఢి మనుచుఁగాత. 4

ఉ. ఊఱటఁ జెంది పాల్కడలి యూర్ములఁ దేలెడు పాపసెజ్జ ని
ద్రారతిఁ దండ్రి హాయిమని తాఁబవళింపఁ బ్రపంచ సర్గసం
ధారమణీయతాయతి నుదారత మించిన దాత ధాత పా
ల్చూరి విహారిఁ గృష్ణవిభు సుస్థిరుఁ జేయుఁ జిరాయురున్నతిన్. 5

సీ. అవని నాదబ్రహ్మ మౌతానె తనయట్లు
వీణియఁ బలికించు జాణ యనఁగఁ
గడలిరాయని కూఁతు కన్నుసన్న మెలంగఁ
బ్రోడయై తగుపెద్దకోడలనఁగ
సహజాకృతులఁ జతుష్షష్టికళ ల్గొల్వఁ
గొలువుండు రాజసగుణ యనంగ
రసభావ భావుక రసనాగ్ర మండప
స్థలులపై నాడు నర్తకి యనంగఁ
తే. గీ. దాన సారసధారాసమానమాన
నీయ సారస్వతోదార నిబిడకీర్తి
మూర్తియైనట్లు మెఱయు నమోఘవాణి
వాణి పాల్చూరి కృష్ణభూవరుని మనుచు. 6

మ. అనుగుందల్లి నిజాంకపీఠమున నెయ్యంబొప్పఁ గూర్చుండి యొ
య్యన చన్ద్రావుచుఁ దాతభాగమగు నంసాగ్రంబునన్ జేర్చి య
ల్లనఁదుండంబు నిగిడ్చి మౌళిజలమెల్లన్ బీల్చి పాదాభిషే
చన మోదద్వయిఁ గూర్చు విఘ్నపతి నంచల్లీలఁ గీర్తించెదన్. 7

సీ. వేత్ర మింత గదల్ప సూత్ర మౌర యనంగ
నీరేడు జగము లట్టిట్టుఁ దిరుగు
హుమ్మన నుఱ్ఱూఁత లూఁగు నజాండాళి
స్థావర జంగమాత్మకము గాఁగఁ
గరుణావలోకనాకర్షణ విద్య యౌ
సకల దిక్పాలకనికరమునకు
సముఖాయటన్న నెచ్చట నిల్చునో యక్ష
గంధర్వ కిన్నర గణముక్రందు
తే. గీ. జాగ్రదీ దృగ్విధాత్మీయ సముచితైక
నిగ్రహానుగ్రహాదిక[1] నిఖిల సుగుణ
హేలల నటించు సూత్రవతీశ్వరుండు
కూర్మి నిష్టార్థసమితిఁ జేకూర్చుఁగాత. 8

1. నిగ్రహానుగ్రహాదిమ.

ఉ. తోడనె బ్రహ్మవేత్తయన దూరగుమేనును[1] వర్ణముఖ్యతం
గూడఁగఁ జేసెఁదొల్లి శతకోటి ప్రవిస్తరమైన కావ్యమున్
వేడుకనే ఋషీంద్రుఁడు భువిన్ గవిరాజికి సత్కవిత్వమున్
బ్రోడతనంబుఁ గీర్తియును బొల్పుగ నేనతనిన్ నుతించెదన్. 9

కం. వేదము లీరెండుగఁ దాఁ
బాదుకొలిపి చిక్కుఁదీర్చి పంచమవేదం
బాదరణఁజేసె నాఘను
వేదవ్యాసున్ భజింతు విద్యాభ్యాసున్. 10

సీ. రఘువంశకర్తయై రంజిల్లు కవిరాజు
నెమ్మి పేరు వహించు నమ్మనీషి
మార్గణ భవ్యనామముఁదాల్చు ధీశాలి
ననఘతపోనాముఁ డైనవాని
నర్థసమగ్రతాఖ్యాతిఁ గాంచిన ధన్యు
బుద్ధ[2]శుభప్రౌఢిఁ బొదలు బుధుని
వైరసేని చరిత్ర వర్ణించుకోవిదు
హరుకల్మి పేరఁ బేరైనపుణ్యు

తే. గీ. సాహితీసార సామ్రాజ్య సార్వభౌము
లనఁగ మఱియును గలుగు విఖ్యాతయశులఁ
గావ్యనాటక లసదలంకార కృతులఁ
గృతుల వినుతింపఁ గలఁడె వాగీశుఁడైన. 11

ఉ. భారతభారతిం దెనుఁగుఁ బాళికిఁ[3] జేసిన సత్కవీంద్రులన్
ధీరుల సోమభాస్కరుల ధీనిధి బమ్మెరపోతనార్యు శృం
గార మనోజ్ఞ నైషధ వికస్వరతాకరుఁడైన శ్రీవరున్
సూరవరాజుఁ బెద్దనఁగ శోభిలు పెద్దన నెంతు నెంతయున్. 12

ఉ. మామక నవ్యకావ్యము సమంచిత మాధురి సాధురీతిగా
యామకృత ప్రబంధ రచనాయత పాక చతుర్విధైక వా
ర్తా మహిమోజ్జ్వలాఢ్య కవితా ఘనతామహు మత్పితామహున్
రామయ రామకృష్ణ కవిరాజుఁ దలంచి నుతించి మ్రొక్కెదన్ 13

తే. గీ. తదను సంభవమణిని సుదక్షిణాప
రిణయముఖ కావ్యరచనాధురీణు నంధ్ర
కవికదంబములోనఁ బ్రఖ్యాతిఁగన్న
యన్నప కవీంద్రు ధీసాంద్రు నభినుతింతు. 14

---

1. యనుదూరగుమేనికి. 2. సిద్ధ. 3. వారికి.

ఉ. ఊహలుసేతు రెందయిన నొచ్చె మొకించుక లేదె యంచు ని
ర్మోహమనస్కులై మదిని రోసము నీసునె పూన్తు రార్యసం
దోహము ఖాతి రీతి రసధోరణిఁ జూతురె యా సరస్వతీ
ద్రోహులు వారిఁ బేరుకొన దోసము రాజసభాంతరంబులన్. 15

చ. ప్రకటిత శబ్దబంధ రసభావ కవిత్వ విశేషవాసనా
ధికమతిమంతులై వెలయు ధీరకవీశ్వర కోటికిన్ సమ
ర్పకముగ మాధురీగతిఁ బ్రబంధ మొనర్చిన నొప్పుఁగాక నే
రక యొనరించు కావ్యము ధరం బరిహాసకరంబు గాదొకో. 16

వ. అని యిష్టదేవతా నమస్కృతియు సుకవి పురస్కృతియుఁ గావించి యేనొక్క మహాప్రబంధంబు రసగంధగంధిలంబుగా రచియించు సమయమ్మున. 17

సీ. తన ధరాభరణ సంధాబంధురోన్నతి
 చక్రీశ్వరునకు విశ్రాంతి యొసఁగఁ
దన మహాభానుసంతాన భానుశ్రేణి
 దర్పితాహితమదధ్వాంత మడఁపఁ
దనయశశ్చంద్రికల్ దశదిశాపూర్ణతఁ
 గవిచకోరముల యాకండ్లు దీర్పఁ
దన నిరంతర దానధార లంభోధికి
 నిత్యకల్యాణముల్ నిగుడఁజేయఁ
తే. గీ. ప్రబలు జనులెల్ల నుతిసేయఁ బంటవంశ
కలశవారాశి విస్ఫుటీకరణరమ్య
పార్వికాంభోజ వనవైరి పాలచూరి
తిమ్మనృపచంద్రు కృష్ణధాత్రీ విభుండు. 18

వ. వెండియు ద్రుహిణాండకరండ మండనాయమాన మానిత సాంద్ర చంద్ర చంద్రికా పిచండిల డిండీర పుండరీక శ్రీఖండ ఖండేందు ధర కుండలీంద్ర శరకాండ నిజకీర్తి లతాంత గంధిల హరిత్కాంతా కచాభోగుండును, భోగ్యభాగ్య సుశీలుండును, నాసీరసంచరత్తురంగ ఖురపుట పాటిత భోట లాట వరాట కోంకణ పేంకణ చోళ మాళవ నేపాళ పాంచాళ గౌళ బంగాళ భూపాల కిరీటకూట చిరత్న రత్న నికరుండును, రాయవేశ్యాభుజంగ బిరుదప్రకరుండును, వేంకటేశ్వర

కరుణాకటాక్షవీక్షాసాదిత సకలసామ్రాజ్య ధౌరేయుండును, కేశాది రాయుండును, వాసరకరబింబాడంబర విడంబి నిజభుజాదండమండిత ప్రతాపాటోప తాపిత[1], ప్రతిపక్షభూపాల సాహసిక వాహినీ మండలుండును, జగనొబ్బగండాంక నృపాఖండలుండును, మండలాగ్రజాగ్రత్ప్రభాంధీభూత పరివర్ధిత రాజశేఖర శేఖర మకుట రత్నరాజినీ రాజిత విరాజిత పదాంబుజోద్వేలుండును, గాయగోవాళ బిరుదాఖ్యలుండును, భోజరాజరారజ్యమాన నానాకళావిశాలుండును, గుర్జరీ ధట్టవిభాళుండును, నలనహుషనాభాగ భగీరథప్రముఖ పురాతనధరాతలాధినాథ యాథసరసస్ధుణ ప్రకాండ ధుర్యుండును, మీసరగండాంక వర్యుండును, కామినీజన మనోవంచనా పంచబాణుండును, విద్వజ్జనావనధురీణుండును, నిరంతరాచరితనానావిధానూన దానధారాసమేధితనదీకళత్రుండును, తీపనూరి గోత్రపవిత్రుండును,చిత్రచరిత్రుండును, తిమ్మభూపాల రత్నాకర రాకాచంద్రుండును నగు కృష్ణధరణీదేవేంద్రుం డొక్కనాఁడు దుర్మంత్రి మంత్ర తంత్ర భేదన గరిష్ఠ నీతివిద్యాధురంధర యుగంధరసమాన ప్రధానులును, మాననీయాపార శౌర్యధౌరంధర్య ధైర్యోద్భట భటపటల జటిల చటుల సేనానాయకులును, వీణావాదన ప్రవీణతాతృణీకృతవాణీకులగు వైణికులును, బాణమయూర మల్హణ బిల్హణ ప్రముఖ ముఖరితకవితాహంకారధిక్కారకృచ్చతుర్విధ కవిత్వ తత్త్వ ప్రబంధ నిబంధన బంధుర కవి సింధుర సందోహంబును, హృదయానంద సంధాయక గాయకబృందంబును, పురందర పురసుందరీ సౌందర్య కందళిత లలిత బిబ్బోకవతీ వతంస చయంబును, అనుజ తనుజ గురుబాంధవాశ్రిత సామంత మిత్రజనంబులును బరివేష్టింపఁ గాంచన ప్రభాంచిత సభామధ్య రత్నాసనమ్మున సుఖాసీనుండై సౌవిదల్లక సాహోనినాదమ్ములును, వందిజన కీర్తనంబులునుం జెలంగఁ బేరోలగమ్మండి. 19

మ. నను శ్రీరామ పదాంబుజాత యుగళీ నందద్ద్విరేఫాయమా
న నిజస్వాంతుఁ దెనాలివంశమణి సన్మానంబు మీఱంగ ర
మ్మని కారుణ్య సమగ్రతన్ బిలిచి భోజాధీశధీశాలి యి
ట్లనియెన్ బూర్వకృతిప్రసంగమున నత్యానంద సంధాయియై. 20

తే. గీ. రామభద్రకవీంద్ర ! నీరచనఁ దనరు
ధీనుతంబైన యిందుమతీ పరిణయ
మంకితంబుగ మాకు ని మ్మనఘమైన
కృతినిగా కెందు తెకతేర కీర్తి కలదె. 21

1. పాటిత

సీ. ప్రౌఢి మీపెదతాత పాండురంగాది స
త్కృతులఁ జేసెను రామకృష్ణ సుకవి
యనుజుఁ డన్నప్ప మీ పినతాత రచియించెఁ
బరఁగ సుదక్షిణా పరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీ విఖ్యాతి
శ్రీశైల మాహాత్మ్యకృతి యొనర్చెఁ
గడిమి మీ తండ్రి యిమ్మడి రామకృ ష్ణార్యుఁ
డనఁ గీర్తిఁగనె సంస్కృ తాంధ్రములను
తే. గీ. వారలను మించె మీయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వకవితా మహత్త్వమునను
నిన్ననూచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞహృ దయాబ్జరవి రామభద్రసుకవి. 22

వ. అని వినయంబు మీర ఘనసార తాంబూలంబు జాంబూనద పాత్రంబున మణిరమణీయ కర్ణభూషణ విచిత్ర చిత్రాంబరాది ప్రశస్తవస్తు ప్రదాన పురస్సరంబుగా నొసంగిన నామోదమాన మానసుండనై కృతిపతి వంశావతారం బభివర్ణించెద. 23

సీ. నిండు చీఁకటి దిండి నిగ్గులగ్గల మీను
చూపులఁ జలివేఁడిఁ జూపువాఁడు
తనుడాయ[1] వేయంచులను మించు కత్తిరే
ద్రిమ్మరిమూఁక హరించువాఁడు
మిసిమి మీఁగడపాల మేనుగాంచిన కల్మి
యొయ్యారి పేరెద నొప్పువాఁడు
మగని యోఁదల మెట్టి మట్టెఱుంగని యాఁడు
బుడుతఁ గాంచిన తమ్మియడుగువాఁడు
తే. గీ. వలపు నలువగు నామంబువాఁడు చెవుల
మొసలి వాపోఁగుగవ[2] మినమినల వాఁడు
జాళువాపట్టు మెయిఁదాల్పఁజాలువాఁడు
వెల్లదీవేలు కరి మేను వేల్పుఱేఁడు 24

తే. గీ. ఆరమాజాని పదసీమ నవతరిల్లి
త్రిజగతీజన సుకృత వర్ధిత నిజాంగ
దురిత గణభంగ గంగ సైఁదోడుగాఁగ
సద్గుణఖ్యాతి నాలవజాతి దనరు. 25

---

1. తనునయ. 2 వా పోంగళుల.

ఉ. అట్టి చతుర్థ గోత్రమున నంబుధినేతకుఁ జంద్రుఁ డోలిమైఁ
బుట్టు విధంబునన్ భువన పుంజము రంజిలి పొంగ సత్కళా
ధట్టమునన్ బుధాబ్ధి జనతానయనోత్పల మోదహేతువై
పుట్టెను రామభూవిభుఁడు ప్రోడలు మండలనాధుఁడౌననన్. 26

సీ. కౌశికానుగతినె కళల పెక్కువఁ గాంచె
 స్త్రీవధోద్యోగంబుఁజేసెఁ గాని
తాఁజిరంతన ధర్మ మోజయే చెలువంగ
 నతనుగుణస్ఫూర్తి ననుసరించి
లోకైకవిఖ్యాతి చేకూరుననె కాదె
 వనులఁ బుణ్యజనాళిఁ దునుమఁ జనుట
యల విభీషణుఁ బిల్చి యిలఁతేనిఁ జేయుటె
 సత్యసంపన్నతా సరణి కెఱుక
తే. గీ. వరతపోనిష్ఠఁదాఁ జేయవలె నటన్న
నియమమే పూర్వదేవేశు నిధన మొందఁ
జేయుటని రాముఁదెగడు నూర్జితగుణాప్తిఁ
బాలచరి రామ మేదినీబాలశౌరి. 27

ఉ. అవ్వనరాశివేష్టిత ధరాధిపచక్రి కుమారరత్న మా
చెవ్వవిభుండు కేళిమెయి చేఁగరవాల్ ఝళిపించినంతనే
నవ్వుచువచ్చు యక్షసుతు నాఁటికి[1] మ్రొక్కఁగఁజేయు రంభమే
ల్చివ్వకుఁజేరు వైరులకుఁ జేకుఱునే యిటువంటి పుణ్యముల్. 28

కం. ఆరామవిభుని చెవ్వ
క్ష్మారమణునికీర్తి యెంత జంత దలంపన్
శారద నొఁదల మొట్టున్
సౌరకరిఁజెంపఁగొట్టు శశినెద మెట్టున్. 29

కం. ఆ చెవ్వవిభు కుమారుఁడు
యాచక ఖేచరుఁడు వైభవాఖండలుఁడై
భూచక్రమేలె శౌర్య
ప్రాచుర్యనిరూఢి లింగపార్థివుఁ డెలమిన్. 30

---

1. నాతికి.

ఉ. పువ్వుల వింటిదంట యొఱపున్ దరవుఁ నెఱసోయగమ్ముచేఁ
గవ్వడి నెవ్వడిఁ గెలువఁగాంచు నవక్రపరాక్రమంబుచేఁ
గవ్వపు గట్టుగుట్టు కలఁగఁ జెలఁగుఁ దగు ధైర్యరీతిచేఁ
జెవ్వమహీంద్రు లింగనృపశేఖరు నెన్నఁదరంబె యేరికిన్. 31

క. ఆ పాలచూరి లింగ
క్ష్మాపాలకమణికి వైరిగజగణ సృణికిన్
దీపిత తత ప్రతాప
శ్రీ పుష్కరమణికి నెల్లనృపతి జనించెన్. 32

సీ. భద్రతేజమ్మునఁ బ్రబలి జిష్ణు బలంబుఁ
దఱిమి తత్కీర్తి సుధన్ హరించు
వివిధధారల మీఱి విద్విష ద్విపినాట
ఘన రసాటవరాంగకములు చించుఁ
బెక్కుచాయల మించి భీషణాహితభోగి
రాజవిగ్రహము లుగ్రత నగల్చు
శితముఖోత్కర్షావిజృంభితంబై విష
ధ్యాలయ శబర చోరా[1]శి నడఁచు
తే. గీ. నహహ దుర్వార గర్వధూర్వహ విరోధి
గణ ఘనాఘన పవమాన కలితఖేల
పాలచురి యెల్ల ధారుణీపాల పాణి
భరిత తరవారి భీకరగరుడమూర్తి. 33

తే. గీ. ఎల్లబంధులు రంజిల్ల నెల్లభూమి
పాలుఁ డాతండు జంగల బసవ[2] విభుని
తనయ భావమ్మ వరియించె వనజనాభుఁ
డా మహాలక్ష్మిఁ బరిణయం బైనకరణి 34

మ. ఒకచో నిశ్చలమానసాంబురుహ యై యుండంగఁ దానేరదో
క్కొకచోఁ జిన్నెలఁ జూపుఁ జూచు జను లాహో మేలుమేలంచురా
నొకచో బంధులు జాతినీతి గలదే యూహింపఁగా లచ్చికం
చకలంకస్థితి భావమాంబ నగు నెల్లాధీశు సద్భార్యయై. 35

1. భోగాళి. 2. బడస.

మహాస్రగ్ధర: ఘనుఁ డా యెల్లక్షితీశాగ్రణి విలసిత రేఖానిరూఢిన్ నదీరా
ట్తనుజాతారత్నమోనాఁ దగు వరశుభ సంధాత్రి భావాంబయందున్
దనయున్ గాంచెన్ సమంచద్ధరణి హరిణనేత్రా మణీధుర్యతోద్య
ద్ఘన బాహాఖడ్గ తేజో ధరిత తపన సంకాశుఁ గృష్ణక్షితీశున్. 36

ఉ. ఓపికగల్గి బాల్యమున నుండియు గోత్రము నుద్ధరించు బ
ల్వాఁపు స[1]మాశ్రితవ్రజ వివర్ధనయత్నము ధర్మజాత సం
స్థాపన కార్యమున్ గని పొసంగిన పాల్చురి కృష్ణభూవిభుం
డే పగిదిన్ ధరిత్రి గణియించినఁ గృష్ణుఁడ మాటలేటికిన్. 37

సీ. విమతు లాతనిమ్రోల వీఁగి పాఱుటె కాని
విఱు గెఱుంగఁడు రణోర్వీస్థలమున
సుదతు లాతనిచెల్వుఁ జూచి చొక్కుటెకాని
చూడండు పరకాంత సోయగంబు
సుజనౌఘ మతని సంస్తుతులు సేయుటె కాని
యాత్మస్తుతుల కాతఁ డనధికారి
కోరినట్లతఁ డర్థికోటి కిచ్చుటె కాని
తాను గోరఁడు పదార్థముఁ బరార్థ
తే. గీ. మనఁగఁ గర్ణాటలాట చోళాంధ్ర పాండ్య
చేదికేరళ శకపారసిక నృపాల
సభల నుతిఁగాంచె నెల్లభూజాని సుతుఁడు
కీర్తితోదారగుణ హారి కృష్ణశౌరి. 38

ఉ. కీలిటువంటి వింత నృపకేసరి పాల్చురి కృష్ణమేదినీ
పాలకుఁడాజిరంగమునఁ బాణిఁ గృపాణముఁబూన విద్విష
జ్జాల విలోల జీవధన సంతతికన్నను మున్నుమున్నుగా
వ్రాలుఁ దదంగనాంగగత రత్నవిరాజిత భూషణావళుల్. 39

వ. అతండు. 40

ఉ. మండలనాథ సాంద్రమణి మండనశస్త్ర సమస్త మస్తకో
త్ఖండన చండతాండవ విధాన పిచండిల మండలాగ్రుఁడౌ
కొండపలీ విభుండు రణకోవిదుఁడై తగు వెంగళక్షమా
ఖండలు కూర్మిపుత్రిక జగన్నుత మానవతీశిరోమణిన్. 41

---

1. బల్వేపు

కం. వేంకటమఁ బెండ్లి యయ్యెన్
శంకరుఁ డగజన్ వరించు సౌశీల్యమునన్
బొంకముగఁ గృష్ణవిభుఁడా
పంకజనేత్రన్ నుతింప ఫణిపతి వశమే. 42

కం. ఆ కృష్ణవిభుని రెండవ
కోకస్తని లక్ష్మమాంబ కులశీలగుణా
స్తోకత నిచ్చలుఁ దెగడున్
శ్రీకాంతుని కాంతనజుని చిగురుంబోఁడిన్ 43

మ. కులశీలమ్ముల వన్నెవాసు లొనరం గోపంబు నా[1]నెట్టిదో
చలమేలాగున నుండునో యనుచు నిచ్చల్ సజ్జనుల్ మెచ్చఁగా
నిలవేల్పుల్ తగువేల్పులంచుఁ బ్రియుఁడే యీశుండు నాపాలికం
చలరున్ బాల్చురి లక్ష్మమాంబ హితనిత్యానంద సంధాత్రియై. 44

కం. ధీరమతి కృష్ణభూపతి
హారిగుణకదంబ వేంకటాంబవలన గం
భీర వితరణునిఁ దిమ్మమ
హీరమణునిఁ గనియె వార్ధి హిమకరు వోలెన్. 45

తే. గీ. నెమ్మి మీఱంగ మఱియు లక్ష్మమ్మవలన
నెల్లభూజాని వరదధాత్రీశ చంద్రు
నార[2]నేంద్రునిఁ దిరుకామ భూరమణునిఁ
గనియె హరినాల్గు వర్ణము ల్గనినరీతి. 46

కం. వారలలో నగ్రజుఁడై
ధారుణి విలసిల్లుఁ దిమ్మధరణీవిభుఁడున్
హారక్షీర స్ఫార
శ్రీరమ్య విశాలకీర్తి జిత సిత కరుఁడై. 47

సీ. గడిమన్నె దొరలఁబోఁ గదిమి తత్పురములే
యగ్రహారములుగా నలవరించె
నవలి దేశాధీశులనుచు కప్పములెల్లఁ
గొల్లగా యాచకకోటి కొసఁగె

1. నాఁకె. 2. నారణే.

స్థలదుర్గ జలదుర్గ శైలదుర్గంబులు
సాధించి యం దాప్తచయమునుంచె
విఱిగి[1] ఝ[2]ల్లనఁ బాఱు విమతుల వీపుల[3]
కరఖడ్గమున జయాంకముల నునిచెఁ
తే. గీ. దనదు మీసరగండ విఖ్యాతినామ
బిరుదమున కన్ని బిరుదులు కిఱుదు సేసెఁ
బాలచరి కృష్ణధారుణీ పాలసుతుఁడు
భవ్యగుణహారి తిమ్మభూపాలశౌరి. 48

సీ. విమతుల కోటలే విభుని లగ్గల ముమ్మ
రమ్మున కిసుకల బొమ్మరిండ్లు
గడిమన్నె సీమలే గండరగండని
కడిఁది ధాటికిఁ దమకము బయళ్లు
ప్రతి భటాంగంబులే పటువిక్రమాకరు
మహితాసి కనఁటి కంబములగములు
పరరాజదళములే ప్రాభవోదీర్ణుని
గాటంపు మొనలకు లేటికదుపు
తే. గీ. లతఁడు పొగడొందు రాయవేశ్యాభుజంగ
గాయగోవాళ జగనొబ్బగండ ముఖ్య
బహుళ బిరుదాంక సముదయభాసురుండు
పాలచరి కృష్ణవిభు తిమ్మపార్థివుండు. 49

ఉ. ధారుణి నప్పు లిచ్చుకొని దాఁచుక మూలనిధాన బృందముల్
వేఱొక పూటకాపుఁ దవిలించుక[4]పత్రము వెంట జట్టిగా
నేరికిఁ గోమటీవులుగనిచ్చు[5] వదాన్యుల నెంచనేల పా
ల్చూరి విహారి తిమ్మనృప సోముఁడు బ్రోవఁగ నర్థి కోటికిన్. 50

సీ. బల్లిదుఁడై ధాత్రిఁ బరిపంథికోటుల
నెల్లనసిం జీరె నెల్లశౌరి
యరుదయా![6]యన బంధువరుల నాశ్రితులను
వరదయారతిఁ బ్రోచె వరదవిభుఁడు
నార్తితన్ బేరుకోనాలించు రక్షిత
వారణేంద్రుఁడనంగ నారనేంద్రుఁ
డే మానవతియైన నేమితన్ గామింపఁ
గామించుభువిఁ దిరుకామవిభుఁడు

---

1. బెదరి. 2. మెల్లన. 3. కెంపుల. 4. దరువించుక. 5. వారికి...వచ్చు. 6. యరుగనా.

తే. గీ. నల చతుర్విధ పురుషార్థములును బోలెఁ
బాలచూరి వరాన్వయాభరణు లగుచుఁ
గలిగి రారూఢి లక్ష్మమ్మ గర్భమునను
లీల మోదాబ్ధిఁ గృష్ణేంద్రుఁ డోలలాడ. 51

వ. వారిలోన. 52

సీ. జాగరూకతఁ జక్ర సంరక్షణాపేక్ష
కంజాత వికచతాకర చతురుఁడు[1]
సౌహార్దమున వినిశ్చల దయాశీలత
ధాత్రిఁ బారావార తల్లజుండు
శాశ్వతోజ్జ్వలభూతి సర్వజ్ఞతాప్తిని
ర్గంధి త్రైక్షవకాండ కార్ముకుండు
దానకళారూఢిఁ దతకళా విశ్రాంతి
రోహిణీ గేహినీ మోహదుండు
తే. గీ. తేజమునను గభీరత ధీరశౌర్య
శోభనాకారముల వారి సూటి మించు
పాలచరి కృష్ణధారుణీపాలు కూర్మి
నందనుఁడు పెదనారాయణ ప్రభుండు. 53

వ. అంత. 54

ఉ. తిమ్మనృపాలుఁ డాతఁ డగధీరుఁ డుదారతఁ బద్దెపూడి వం
శమ్మున కాద్యుఁడై సకల సద్గుణరత్న పయోంబురాశి యై
నెమ్మిఁజెలంగు నెల్లి ధరణీపతి పుత్రిక పద్మనేత్రనున్
గొమ్మలమిన్న లక్ష్మమను గూరిమినుద్వహమయ్యె నెంతయున్. 55

క. ఆ లక్ష్మమాంబవలనన్
బాలచరికులమ్ము మిగులఁ బావన మగుచున్
బోలింపఁ బాలుపొంగిన
లీల సముచ్ఛ్రయత వర్ధిలియెఁ బ్రజలెన్నన్.[2] 56

తే. గీ. ఆ పతివ్రత యన్నపూర్ణాంబ యనఁగ
లీల దీనుల రక్షింప దైలువారు
కూర్మి యెట్టిదోకాని యాకొన్నవారి
మోముఁ జూడదు కన్నతల్లేమొ యనఁగ. 57

1. కరుండు. 2. లెల్లన్.

సీ. శీతలాబ్జానన జీవితేశ్వరుభక్తి
సీతలాగునఁ గొల్చు చిగురుఁబోఁడి
సత్యవతీ సామ్య సహధర్మచారిణి
సత్యవతి యగు నిశ్చలహృదబ్జ
తమ యంతిపురము కాంతలకెల్ల నెచ్చెలి
దమయంతి విఖ్యాతిఁ దనరు గరిత
యనసూయ బుద్ధి యేరాండ్రఁ బ్రోవఁగనేర్చు
ననసూయ యనఁగఁ జెన్నలరు సాధ్వి
తే. గీ. మానమే భూషణము వర్తమాన సతులు
దాన దాక్షిణ్య సుగుణ సంతానములను
సాటియే యనఁ దిమ్మ భూజాని కరుణ
లలన లక్ష్మమ్మ మను నాదిలక్ష్మిఁబోలె. 58

క. ఆ దంపతులకుఁ గలిగిరి
శ్రీదయితాంశమున రామకృష్ణులన శ్రితా
హ్లాదుఁడు కృష్ణమహీపతి
యాదిమనృపవిభుఁడు నారనావని విభుఁడున్. 59

క. వారలలోపలఁ గృష్ణ
క్ష్మారమణుఁడు మంతుకెక్కె కర్ణాటీవ
క్షోరుహఘన ఘనసార
త్సారయశః కాంతి ధవళిత దిగంతరుఁడై. 60

సీ. శ్రీకర బాంధవానీక రక్షాది కా
స్తోక రమ్యగుణ రత్నాకరుండు
గాయకాఖిల కవినాయకాప్త సుధీని
కాయ కాంక్షాళి ప్రదాయకుండు
సర్వ సర్వంసహా ఖర్వ ధూర్వహతాతి
నిర్వాహ నిందిత శర్వశరుఁడు
గంధాంధ పరిపంధి సింధురాసురగర
కంధర ద్వ్యాహాసి బంధురుండు
తే. గీ. నవనయోగ్యప్రఖాలనద్భవనరాజి
గేహళీశంఖ మర్దళ కాహళీద్ధ
రవ హరిద్దంతినిభ గజనివహ హయుఁడు
విష్ణువిభవుండు పొల్చురి కృష్ణవిభుఁడు. 61

సీ. పసిఁడి తీవెనఖాను పని పరుంజు విభాళి
పటుసటాజాలంబు భాతిఁ దనర
రవలబ్రలవళి యారవ విధాప్రథ మించి
వేఁటాడి గుండియల్ ప్రీలఁజేయ
శశిరేక ఙోకయౌనిశితధారఁ జెలంగు
నలుగు దంష్ట్రాభీల మగుచు నలుగ
ఝళిపించు నెడమించుసాంద్ర ప్రకాశంబు
ప్రవిచలజ్జిహ్వా విభ్రమముఁ దెలుపఁ
తే. గీ. బాలచరి కృష్ణ ధారుణీ పాల చంద్ర
హౌనకేసరి తమివేఁటలాడు నెపుడు
సంగరోర్వీ మహావనస్థలుల యందుఁ
బరబలానీక కుంభికుంభములకుఱికి. 62

ఉ. దీనుల మిత్రబాంధవసుధీ నివహమ్ముల భృత్యకోటులన్
బూని సమగ్రసాదరతఁ బ్రోచు నభీష్ట ఫలప్రదాయియై
ధీనుతకీర్తి పాలచరి తిమ్మని కృష్ణవిభుండు సత్తనం
తానములం బ్రసిద్ధిఁగను ధాత్రిఁబునఃపున రాత్మమోదియై[1]. 63

సీ. అగ్రహారము లెన్నియైనను జేసి భూ
దేవతాతతిఁ బ్రోచె తీవిఁదనర
బహుతర గోపుర ప్రాకార యుతముగా
నిల దేవతాప్రతిష్ఠలు ఘటించె
వడుగులు పెండ్లిండ్లు వలయు గోదానముల్
చేసె దానము లెల్లఁజేసె మఱియు
వరతటాకములు త్రోవలనో[2]లితోఁపులు
ప్రపలు నెయ్యేడలను గృప నొనర్చెఁ
తే. గీ. గృతులు గైకొని సత్కీర్తి నతిశయిల్లెఁ
బ్రజల ముంగొంగు పసిఁడియై ప్రభుత మించె
విద్యమాన నృపాళిలో వేరుసాటి
పాలచరితిమ్మవిభు కృష్ణపార్థివునకు.

1. రంతమోదియై. 2. సాలి.

సీ. సంతత నవనీత చౌర్య పారంపరీ
కర్మతత్త్వమ్మునఁ గన్నకొదవ
ఘోషయోషా సమాశ్లేష సక్తమనీష
ధరఁ బ్రవర్తించిన వరుసఁదనము
బ్రాహ్మణీదత్తాన్న పారణాదరణసం
పన్నమై యడరి పైకొన్ననింద
యంధకప్రకర నిరంతర సామ్రాజ్య
గురుతరంబై యాముకొన్న రట్టు
తే. గీ. పరిహరించఁగఁ దలఁచి గోపాలకృష్ణుఁ
డఖిల సద్గుణముల వెలయంగఁ బాల్చు
రీకుల పయోంబురాశి సుధాకరుఁడగు
తిమ్మవిభుకృష్ణుఁడై ధరిత్రినిఁజెలంగె. 65

సీ. ఒదిగి మూలలఁజేరి మదభరం బెల్లను
ప్రీలి దిగ్దంతులు కేలు మోడ్చె
వనములఁ దనదు జీవన మెల్లఁగడుపుచు
మొగతీసి కమఠంబు ముచ్చముణిఁగె
పెక్కుధాతువులఁదారొక్కతీరై గిరుల్
ఱెక్క లల్లాడక ఱిచ్చవడియె
పవనమానుచు గూఢపదవృత్తిచేఁ బైటఁ
జరియింపలేకహి శిరసువంచె
తే. గీ. స్థిరనిరంకుశ వృత్తిలోఁ జేవమెఱయు-
నపరుషస్థితి కడు తిన్ననైన కడఁక[1]
దలరి పాల్చురి కృష్ణధరాధినేత
తన భుజాదండమున ధరిత్రిని ధరింప. 66

సీ. మాలికా డోలికా .........
కేళికాలోల మరాళకాంతిఁ
దరుణామరాగమతల్లికావల్లికా
మల్లికాసుమగుచ్ఛ మంజుదీప్తిఁ
బాండురాంభోరుహ మండలాఖండలా
ఖండలావణ్య వేదండసుషమ
నిందుకాంత ప్రతానేందిరా మందిరా
నందిరా...... జితశంఖ నవ్యలక్ష్మిఁ

1. నడక.

తే. గీ. దెగడు జగడించు నగుఁగొంచెముగ ఘటించు
దారుణా[1] యోధనాంగణ స్ఫారవైరి
వీర వరగర్వ గాఢాంధకార హార
లోలతా భాస్కరత్ప్రతాపాలవాల
పాలచురి కృష్ణ ధారుణీ పాలకీర్తి. 67

మ. గుణరత్నాకరుఁ డాకరంబు దయకున్ గుందేందు మందారవా
రణదంతద్యుతికీర్తి సంగరకళారామావతారుండు దో
ర్మణితేజోనిధి సర్వబంధుజనతామాన్యుండు కృష్ణప్రభుం
డణిమాద్యష్ట విభూతి నిర్జిత ధనాధ్యక్షుండు భూమండలిన్. 68

ఉ. విష్ణుపదాంబుజోజ్జ్వల నవీన మరంద రసప్రపాన వ
ర్ధిష్ణు మధువ్రతోత్తమ శిరీష సమప్రతిమాన మానసున్
వైష్ణవ ధర్మలోలు ననివారిత శౌర్యునిఁ బాలచూరి మా
కృష్ణవిభున్ నుతింపఁగలరే సురదేశిక శేషు లేనియున్. 69

తే. గీ. తిరుమల శ్రీనివాసాఖ్య దేశికునకుఁ
బ్రబల షడ్దర్శనైక పారంగతునకు
శ్రీవరాకారునకుఁ బ్రియశిష్యుఁడగుచు
భక్తి చిగురొత్తఁ గృష్ణభూపాలుఁడలరు. 70

ఉ. దానయశంబులన్ బ్రబల ధైర్య గభీర పరాక్రమంబులన్
ధీనుత సత్యధర్మముల దీనజనావన సత్కృపారతిన్
శ్రీనిధియైన కొండపలి సింధుసుధానిధి మాచభూవిభుం
డానతరత్నరాజి మకుటాంచిత పాదుఁడు భూపమాత్రుఁడే. 71

క. ఆ మనుజాధిపవర్యుఁడు
హైమలతాతన్వి పేరమాంబయు నోముల్
నోమికను కృష్ణమాంబను
భామామణిఁ గృష్ణవిభుఁడు పరిణయ మయ్యెన్. 72

సీ. సతులలో సౌభాగ్యవతులలో నిజబంధు
తతులలో విఖ్యాతిఁదనరు ప్రౌఢ
దానంబు ప్రియుని సన్మానంబు ఘనమైన
మానంబు గలయట్టి మాన్యచరిత

1. రామణి.

సేవించివేల్పుగా భావించి పరిచర్య
గావించి ధవుఁగూర్మిఁగాంచు తరుణి
కలిమిచేఁ బ్రాణేశుఁ జెలిమిచే శీలంబు
బలిమిచేఁ బొగడొందు పరమసాధ్వి
తే. గీ. భూరి సంతాన నిశ్చల భోగ భాగ్య
వస్తుసామగ్రి మనునిండు గేస్తురాలు
వరుని యర్ధాంగలక్ష్మియై వన్నె మీఱెఁ
గృష్ణభూపాలుపాల్చూరి కృష్ణమాంబ. 73

శా. పాతివ్రత్యము జన్మభూమి యమృతప్రాయంబు పల్కుల్ల నా
శ్రీతోనుద్ది ప్రభుత్వ సంపదల దాక్షిణ్యాలవాలంబువి
ఖ్యాతిం దామరతంపరై సుతసుతాహ్లాదమ్ముల స్మీ ఋస్త్రీ
జాతిం బాల్చురి కృష్ణమాంబ కెన భూచక్రంబునన్ గల్గునే. 74

శా. బంగారంబు మణుల్కలాపములుగా భావింపఁ డాత్మజ్ఞయశ
స్సాంగత్యంబున కాదికారణము లౌ సత్యక్షమా ధర్మముల్
రంగంచున్ మదినెంచు చందమున శ్రీరంగాధిపున్ గొల్చుమే
ల్జంగాలాన్వయ ముమ్మభూవిభుఁడచాంచల్యైక భక్తిస్పృహన్. 75

క. ఆ మహిపతి యక్కాంబా
సీమంతిని వలనఁ గనిన చెలి నలమేలున్
సేమమునఁ దాను రెండవ
భామినిఁగాఁ గృష్ణవిభుఁడు పరిణయమయ్యెన్. 76

సీ. శ్రీ సమృద్ధి వహించి చెలఁగుగోత్రముకీర్తి
పాటీరరూపమై పరిణమించి
సామితమ్మి కొలంకు సరసరాయంచయై
విహరింపఁదగునట్టి రహి వహించి
బంగారుబొమ్మగాఁ బ్రాణేశుఁ డెదఁబూన్ప
నఖిల సత్కీర్తుల నతిశయిల్లి
విబుధాంగనలు చేరి వేయివిధమ్ముల[1]
నమ్మ సాక్షాల్లక్ష్మి వనుచునెన్న
తే. గీ. వరకృపాలక్ష్మిచేఁ గొల్చువారిఁ బ్రోఁచి[2]
మదికి నెనయైన చూడ్కులఁ బొదలియలరు
పాలచురికృష్ణమేదినీ పాలమౌళి
లలన యలమేల మంగమ్మ యలరుబొమ్మ. 77

---

1. వేవేలు విధముల. 2. బ్రోచు.

వ. అతని యనుజుండు. 78

సీ. ధారాధరశ్రేణి దానగుణంబెల్ల
గేయంబు[1]గా కొకతోయమయ్యెఁ
జక్కెర విలుకాని సౌందర్యమెల్లను
దిలకింత మన రూపు దెలియదయ్యెఁ
బార్థుసంగర కళాపాండిత్యమెల్ల నే
పాటియౌనన నాటపాటలయ్యె
ప్రోదినీపతి గభీరత్వంబు నిలువెల్లఁ
జర్చసేయఁగఁ జాల చవుకయయ్యె

తే. గీ. నెవరిఁ బ్రతిపోల్పఁగావచ్చునితనినుగుణ
బృందము లమందములు[3] ధాత్రియందు లేరు[2]
సాటియనమించెఁ[4] దిమ్మభూజాని సుతుఁడు
పాలచరి నారనేంద్రుఁ డపారయశుఁడు. 79

సీ. ఈతని సౌందర్య మిందిరాసుతుగెల్వ
దీప్తి యాతనిమామ ధిక్కరించె
నీతని శౌర్యమంబాతనూజుని గెల్వ
ధైర్య మాతని తాతఁదలఁప దయ్యె
నీతని సత్త్వవిఖ్యాతి భీముని గెల్వ
సత్య మాతని యన్న చౌకఁజేసె
నీతని దానసమృద్ధి కర్ణునిగెల్వ
తేజమాతనితండ్రి దీలుపఱిచె

తే. గీ. ననుచు ననుచు ముదమ్మున నఖిలజనులు
వినుతిఁ గావింతు రెవ్వని విశదగుణము
లతఁడు దగు తిమ్మభూప గర్భాబ్ధితార
కాప్రభు నిభుండు నారాయణ ప్రభుండు. 80

సీ. జగనొబ్బగండ డిచ్ఛండహూమి[5] సయింప
కలగుండువడు శత్రు కటకపంక్తి
కాళాదిరాయుని గడిబిళ్లు విన్నంత
తటతట గుండియల్ తల్లడించు

1. నేయంబు. 2. లు బృందములు. 3. వేరు. 4. యనిపించె. 5. ని చండ హూమి.

గాయగోవాళుండు కాహళుల్ వట్టింప
ధూర్తులచెవు లట్టె తూంట్లువోవు
[1]పట్టించ గుజ్జరి ధట్టి విభాళుండు
నిండిన పరసేన నిలువ కవియు
తే. గీ. రాజవేశ్యాభుజంగుఁడు రాజసమున
వాజినెక్కిన పరభూమి వలసదీయు
నట్టిచో నెవ్వఁ డెదిరించు నాహవమునఁ
బాలచరి నారనేంద్రునిఁ బ్రతిఘటించి. 81

శా. బారున్ బారును దారసంబయినచో బంట్రౌతు ధర్మంబు వి
స్ఫారంబై నటియింప లేనగవుతో బల్లెంబుచేఁ బూనియు
న్నారా వీరులటంచుఁ దిమ్మవిభుమా నారాయణేంద్రుండు రాఁ
జేరున్ వైరుల రాజ్యలక్ష్మి విజయశ్రీ మున్నుగా నవ్విభున్. 82

శా. క్షీరాంభోధి గభీరుఁడై హరిసుత[2] శ్రీ సంభవాకారుఁడై
సారోగ్రాహవ శూరుఁడై సితయశస్సాంద్ర ప్రభావారుఁడై[3]
శ్రీరారాజ దగారుఁడై శుభతనూ శృంగారుఁడై ధాత్రిఁ బా
ల్చూరీ నారనధీరుఁ డర్థితతిఁ బ్రోచున్ సద్గుణాధారుఁడై. 83

కం. ఇటువంటి యనుఁగుఁ దమ్ముఁడు
స్ఫుట మతి నారాయణాఖ్య భూపతి గొలువన్
కుటిలతర లోభివేశ్యా
విటుఁడగు పాల్చూరి కృష్ణవిభుమణి వెలయున్. 84

## షష్ఠ్యంతములు

కం. ఏతాదృగుణ రత్న
వ్రాతాంభోనిధికి సుకవి వర సేవధికిన్
స్ఫీతయశశ్రీ విదళిత
ధాతృసతీహారనారద సుధానిధికిన్. 85

కం. ద్యుత్యాదిత్యోన్నతికిని
నిత్యకృతి స్తుత్యమతికి నిషధమహీరా
ట్సత్యావతి సూత్యాకృతి
కత్యాదృతి పుషిత సకల యాచక తతికిన్. 86

---

1. ధట్టించ. 2. హరినుత. 3. ప్రభావాకుఁడై.

కం. సింధురవి తనయ కల్పక
కంధర దానభవకీర్తి కరవిజితమరు
త్సింధుర[1]గర కంధరశర
బంధురతర పాండుర ప్రభానికరునకున్. 87

కం. అక్షీణ శౌర్యగిర్య
ధ్యక్ష సుతాపతికి హితజనాహిత సమ్య
గ్రక్షా శిక్షాపేక్షా
దీక్షా దక్షాతి మతికి దీపిత మతికిన్. 88

కం. ప్రణుత కళాదిమ ఫణికిన్
రణరంగస్థిత విరోధిరాట్కరి సృణికిన్
గణనీయ భావిజిత దిన
మణికిన్ పాల్చూరి కృష్ణమహి వరమణికిన్. 89

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన యిందుమతీ
పరిణయంబను మహాప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన. 90

కథాప్రారంభము

సీ. రాజీవకల్హార రాజీవసతి బంభ
రాజీవకాసార రాజితంబు
రాగాధి కాంభోజ రాగాధికృతబంధు
రాగాధివాస రమ్యస్థలంబు
నాళీక శరశాత నాళీకలలితాంగ
నాళీకనద్గణి కాలయంబు
సంతాన భూమీజ సంతాన వరభూజ
సంతాన సంతతాంచ ద్వనాళి
తే. గీ. యతులవాతూల చలకేత నాగ్రబద్ధ
ఘంటికారావ తోషిత గాంగపులిన
వాలుకాదేవతార్చాతిలోల హృదయ
దైవత కదంబమగు నయోధ్యాపురంబు. 91

1. త్సుందర.

సీ. చిలువ పట్టపురాజు తలకులంబులలోఁతు
పాఁ తె[1]ఱుంగఁగఁజాలుఁ బరిఘచేత
దిక్పాలనగర పంక్తికిఁ బొలిమేరకం
బములైన బలుకొత్తడములచేతఁ
జరియించు సోమభాస్కరుల తేరులకింత
నందిచ్చు కొమ్మల చాలుచేత
నమరేంద్ర పురవాటి కపరపక్ష మడంచు
ధళధళ ధవళ సౌధములచేతఁ
తే. గీ. జుక్కలకు వీధు లొనరించు టెక్కియములఁ
గములఁ జూపట్టు మణిగోపురములచేత
నల ధనాధీశు కలిమి నెంతనఁగఁ జాలి
వరతరం[2]బయి యొప్పు నప్పురవరంబు. 92

మ. అమరావాసము మీఱి తత్పురము హర్మ్యంబుల్ విరాజిల్లన
భ్రమదేభేంద్రము శైలజాలమని దీర్ఘక్రూరతోదంత దం
తములన్ గ్రుమ్మఁగ[3] డాయఁబోయి యచటన్ భాసిల్లు హారైన కృ
త్రిమ సింహంబులఁజూచి పాయునతిభీతిన్ దేవత ల్చూడఁగన్. 93

మ. పురహీరోపలసౌధయూధ శిఖరంబుల్ దాఁకి కాల్కుంటఁగాఁ
దురగానీకము పుట్టుగుంటు[4]గని తోడ్తోఁజూ[5]వ నొక్కింత సే
పురథం బచ్చట నిల్పి వానిబలు నేపుల్[6] పద్మినీ బాంధవుం
డరయంగా నగువేళ యేది యది మధ్యాహ్నంబుఁ జేసెన్ గడున్. 94

మ. వరగారుత్మతకూట ఝూటరుచి దూర్వాశంకఁ గావింపఁద
త్పరతన్ గంధర సాచు నైందవ మృగీపాకంబు నీక్షించి త
త్పుర సౌధాగ్ర చరన్మృగేక్షణలు విందుల్గూర్తు రాత్మీయభా
స్వర కర్ణాగ్రతమాల పల్లవములన్ సంబంధి భావంబునన్. 95

ఉ. ఆపురిఁజంద్రకాంతమయహర్మ్యము లంతికభాగ సంచర
ద్రూపవతీ ముఖేందు నవరోచుల జాలునఁ జాలువారఁదా
రావథ నిమ్నగోర్మి నికరంబుల మీఱెడు కేళిహీరసం
స్థాపిత కూటకోటిఁగని సారసశంకఁ దొలంగుఁ గ్రమ్మరన్. 96

1. పాలె. 2. తపంబయి. 3. గ్రమ్మఁగ. 4. బొటుగంటు. 5. బావన్.
6. చానిబలునప్పుల్.

చ. కులనగకోటి కూటములకున్ వెలియై రవిబండికంటి కొం
తలగల కాలమున్ బడుచు దవ్వుల నొంటిఁ దరంబు గాదుగా
నిలువఁగ నంచునెంచి ధరణి న్నడు చక్కికి వచ్చియున్నయ
వ్వలయ వసుంధరా ధరము వైఖరిఁ దత్పురికోట మీటగున్. 97

మ. సవిద్ధారామ సుగంధబంధ మరుదాశన్ భోగిలోకేక్షణ
శ్రవముల్ దత్పరిఘాచలోపరి లసద్రత్నాంక మూర్ధంబులై
నివసింపఙ్ సహనాళకంజకలికానీకేచ్ఛవాః కేళిఁదే లువధూటుల్
పెకలింపఁ బూనుదురు గేలుల్ సేసి ప్రౌఢల్ నగన్. 98

మ. స్ఫుటదానాంబుర్ఝర ప్రవాహములు సంపూర్ణంబులై పర్వఁగాఁ
గటకంబు ల్విలసిల్లఁ బాదపటిమన్ గన్పట్టి బల్కొప్పను
త్కట మౌనున్నతియున్ బొనంగఁ గడు సౌందర్యంబు[1] మీఱంగ నా
క్కట ప్రోవౌ నడగొండలో యనఁదగున్ గంధద్విపంబుల్ పురిన్. 99

మ. ధరణిన్ వర్ణపదక్రమంబుల విచిత్రత్వంబు దీపింప సు
స్థిర శిక్షాప్రభృతి స్ఫుటాంగ మహిమంబెన్నొంది ధారాళమై
పురి వాహాళి సమిత్ప్రయుక్తి ననయంబున్ మీఱి సల్లక్షణా
కరమై వేద విలాసమున్ నెఱపుచున్ గన్పట్టు నాప్రోలునన్. 100

శా. శాంతస్వాంతులు సభ్యసమ్మత సదాచారుల్ చతుర్వేద వే
దాంతాఖ్యాన కళాచతుర్ముఖు లనూనాగ్ని ప్రధా[2]కర్మఠుల్
సాంతాశ్రాంత కృతాధ్వర ప్రకట దీక్షాధ్యక్షు లక్షుద్ర ధీ
మంతుల్ సాధు వచస్కులప్పురి ధరామర్త్యుల్ సుపర్వోపముల్. 101

చ. తలకొను బల్గభీరత నుదారత ధీరత నిద్ధశూరతన్
గలఁగని వాహినీశు లెదఁ గందని రాజులు పక్షపాతముల్
గలుగని భూభృదింద్రు లరగాని కళానిధి మౌళు లప్పురిన్
మెలఁగు సుధాకరాంబురుహ మిత్రకులోద్భవులైన రాసుతుల్. 102

కం. తన సకునికి బికిరంబఁట
తన కెక్కుఁగనైన నొక్క తట్టువ లేదా
ధనదుఁడల రాజరాజఁట
యనుచుఁ గుబేరుని హసింతు రచటికిరాటుల్. 103

1. సౌద్ధత్యంబు. 2. ప్రశా.

కం. హలగత పరవిభవో[1]న్నతి
నలఘుతరామోద మంది హరిసంసేవా
విలసిత భావం బలరఁగ
బలభద్రులు శూద్రు[2]లచటఁ బరగుదు రెపుడున్. 104

సీ. పురివిచ్చదే కేకి వరపింఛ మొప్పుల
కుప్పలౌ కొప్పుల కప్పు వలన
వెలవెల్లనైపోదె విధుబింబ మొఱపుల
గీముతౌ మోముల గోమువలన
కాఁకఁ జెందవె హేమకలశముల్ మిన్నల
తిన్నెలౌ చన్నుల చెన్నువలన
చలన మొందదె మించు జమ్మేటి తేటల
మేటులౌ మేనుల నీటువలన
తే. గీ. నీరసముగాదె పవడంపుఁదీరు మీఱు
తావి బలుదీవి యగు మోవి ఠీవి వలన
ననఁగ వర్తింతు రవ్యరోజనమనోజ్ఞ
భాసురాంగులు చంద్రికాహాస లచట. 105

సీ తముఁజూచు[3]విటుల చిత్తముల బాగున[4]సాగు
సొగసు నిద్దపువాలుఁ[5] జూపులమర
మోహాబ్ధి నీఁదు కాముకుల కాధారకుం
భములునా బటువు గుబ్బలు సెలంగ
కలయికలో మేలుఁగనుభుజంగుల తాల్మి
వడువున[6] నిరుపేదనడుము లడర
తవిలి మెలంగు పల్లవుల కాంక్షలు వోలె
గమకపుఁ బిఱుదు పొంకంబు లెసఁగ
తే. గీ. రతుల నతులితబంధ సంగతులఁ జతుర
మతుల[7] హరునైన మరునైన మరులు గొలుపఁ
జాలి విహరింతు రచట నుద్వేల లీలఁ
జారులావణ్య రసవతుల్ వారసతులు. 106

సీ. ఘనసార విస్ఫుర ద్ఘనసార కలితంబు
రత్నలాంఛిత నవరత్నయుతము
సుమనోభినంద్యైక సుమన స్స్రగాఢ్యంబు
మోదకృత్కుంకుమామోదసీమ

---

1. పరవలితో 2. శార్యు. 3. జూచి. 4. సొగ. 5. కేళ్ళుఁ. 6 నడుపు. 7. మాత్రు.

కల్యాణకరశుద్ధ కల్యాణ విలసితం
బంశు కర్బుర దుకూలాంశుకంబు
గంధసారస్యవద్గంధ సారాంకంబు
రాజార్హ భూషా విరాజమాన
తే. గీ. మనమ విస్మృమర మాననీయానవద్య
హృద్యవస్తు సమృద్ధిచే నింపు నింపు
నాపణశ్రేణి యాశాంతనార్ఘ్య వృద్ధిఁ
దనరు నలుఁగడ నా రాజధానియందు. 107

సీ. కాంతునొక్కనిఁ జేరి కైకాన్కగా నిచ్చెఁ
గన్నెగేదఁగి పూలు కన్నె యొకతె
వెలనెచ్చుగాఁజెప్పి విటున కిచ్చె నొకర్తు
కమ్మ పువ్వులబంతి కొమ్మటంచు
వలపుఁ గుల్కునటంచు వన్నెకాని కొసంగె
తిలకంబులను సఖీతిలక మొకతె
సొగసువేడుక నిచ్చె సొగసుకానికిఁ దావి
మించు జాజుల నొక్కమించుబోఁడి
తే. గీ. భావ మలరించు నెత్తావితావులంచుఁ
బొగడుకొంచును విటునకుఁ బొగడపువులు
చెలువములు గుల్క నొసఁగెను జెలువ యొకతె
పూవులమ్ముచు నెప్పుడు పురమునందు. 108

లయగ్రాహి: నందనము చందమునఁ గందగిన తోఁపుగమి
నందమగు మావులవడిం దొరఁగు పండ్లం
దంద నిగుడించు రస బృందములు గాల్వలుగఁ
జెందిబలుపూఁ బొదలఁ జిందు మకరంద
స్యందలహరీ తతుల నంది తెలిగొజ్జఁగుల
మందగతిఁజింద పెనుపొందు హిమవారిన్
జెందినదులై జనుల కెందును ముదం బెనఁగఁ
బొందుపడి సస్యసమితిం దనరఁ బ్రోచున్. 109

శా. తాయిన్ బాటలు పాడ నన్యకలకంఠభ్రాంతిచేఁ గోయిలల్
డాయన్ బూని యదల్ప హస్తములు లీలన్ జాచుచోఁ బల్లవ
శ్రీ యంచున్ గడుఁజేరచెంతఁ దఱుచై చెల్వొందు చెంగల్వలన్
బ్రేయంబూను విముగ్ధ భావమున వానిన్ శాలిగోప్యోఘముల్. 110

మ. చరియించుఁ బురవీథులందు సరసీ సంజాత కంజాతవి
స్ఫురదామోదితగంధ వాహకలభంబుల్ భృంగ ఝుంకారఝూం
కరణంబుల్ మధుశీకరోన్నతిఁ జెలంగన్ హాళిఁగేళీవనాం
తరముఁ వెల్వడి పువ్వుధూళి మెయినిండన్ మందయానంబునన్.111

కం. గోపురసౌధోన్నతి జిత
గోపురము ధరాంగనాతి గురుపాదలస
న్నూపురము కలిమి పొలఁతికిఁ
గాపుర మాపురము తరమె గణన యొనర్పన్. 112

వ. అప్పురమున కధీశ్వరుండు. 113

సీ. శ్రీసతి నిత్యసుస్థితి[1] కాట పట్టైన
వసుభర్త యేరాజు వంశకర్త
యమరలోక త్రాత యర్ధాసనస్థాత
యఖిల దిగ్జేత యేయధిపుతాత
యక్షరాణ్ణిధిలక్ష్మి నాకర్షణము సేయు
తత మంత్ర మేశూరు దండయాత్ర
అఖియాతిలోక పద్మాకర శ్రేణికి
గజకులం బేధన్వి భుజబలంబు
తే. గీ. పరగు నాతండు సకలదిగ్భాగవర్తి
కీర్తి కలశాంబురాశి గాంగేయ జలజ
కోరక కదంబ కాయిత సార సార
సాండ భాండ పరంపరుండా సముద్ర
రాజ్యపాలన వీలానిరఘుఁడు రఘుఁడు. 114

మ. కిచకొట్టించె నతండు చండసమరక్రీడా సమాఢౌకమా
న చమత్కారత తాత ముక్త నవగన్ధర్వావ హారక్రియా
ప్రచురోత్సాహముఁ బాయఁజేసి యల జంభద్వేషి నిర్మోహుయై
శచియాగామి పురందరార్పిత కరాబ్జ గ్రాహ మూహింపఁగన్. 115

మ. అవితాశేష బుధేంద్ర మండలుఁ డతం డారీతి దేవేంద్రుచే
నవనాశ్వంబును దేరఁ దజ్జనకుఁ డిచ్చన్మెచ్చి దీక్షించినా
అవజన్నంబును జేయునప్పు డొదవెన్ హర్షప్రదాన్యోన్య వీ
క్షవలచ్చంద్ర బృహస్పతి ప్రియల శిక్షాహబాతి దేవాళిలోన్. 116

1. పక్వ–స్థితియా.

ఉ. ఆ రఘురాజు రాజ్య భరణాభ్యుదయంబు వహించి జైత్రయా
త్రారభటీ పటిష్ఠులు మహాష్టదిశా వసుధాధి నాయకుల్
పోరికి డాయ నాత్మశరపుంఖము కర్ణముఁజేరి వేఁడఁగా
వారలఁగాచి పంచె జయవారిజగేహఁ బరిగ్రహింపుచున్. 117

ఉ. అంతట సింధుదేశవిభుఁడైన జలంధరుఁడన్ వసుంధరా
కాంతుని పట్టియై తగిన గంధవతీ శుభనామధేయ సీ
మంతినిఁ బెండ్లియాడి రతిమన్మథు లేకతఁజెంది చూడ న
య్యింతినిఁ గూడి సౌఖ్యము వహించుచు నుండియు నప్రమత్తతన్. 118

సీ. తనుఁ గొల్వని విరోధితతికి లోకాలోక
శిఖరాటవులు చెఱచెట్లుగాఁగఁ
దనవితీర్ణ్యర్పితార్థ గణనా నిర్ణయం
బునకుఁ జుక్కలు చుక్కబొట్లుగాఁగఁ
దనకీర్తిరమకు మందాకినీ సైకత
ప్రకరస్థలము లాటపట్లుగాఁగఁ
దన సద్గుణౌఘ కీర్తనకు వైయచ్చర
పాఠకోత్తము లోడబట్లుగాఁగ
తే. గీ. నతులతర విక్రమ క్రమోన్నతుఁ డతండు
భద్ర రాజ్యాంగ నాసంగ పటిమఁ బ్రబలి
సర్వ సర్వంసహా నాథసమితిలోన
మేలుబంతిగ సామ్రాజ్య మేలుచుండె. 119

కం. తనయులు లేమికిఁ బొగిలెడి
మనమున నతఁడొక్కనాఁడు మణిగణఘృణిమో
హనగుణకరకేళి గృహా
వని నుబుసుంబోక గంధవతి కిట్లనియెన్. 120

శా. దంభోళిన్ నిరసించి దుర్దమిత దోర్దర్పంబుచే నొక్కటన్
జంభారాతి నెదిర్చి యోర్చి చతురాశావర్తి ధూర్తాళి దో
స్తంభ స్తంభన మాచరించి వివిధార్థశ్రేణిఁ గైకొంటి నో
యంభోజాక్షి సుతుండు లేమి నిది సాంద్రానందముం జేయునే. 121

చ. సకల సువస్తువుల్ గలిగి చాల నలంకృత మయ్యు రత్నదీ
పకళిక లేని మందిరము బాగు వహించె నయో నయోర్జిత
ప్రకట మదీయ బాహుబల పాటవ సంభృత సర్వ శత్రురా
జకుల కరప్రదాన ఘనసంపద సూనుఁడు లేక యుండుటన్. 122

చ. జిలిబిలి మాటలన్ బ్రియము సేయుచు డాయుచు మేనరాయుచున్
కలకలకేరి నవ్వి పొడఁగాంచుచుఁ బొంచుచుఁ గౌఁగిలింపుచున్
గలగల నందియల్ మొరయఁగా నడయాడుచు ముద్దువేడుచున్
మెలఁగెడి పట్టి నంసమున నెమ్మదిఁ జేర్చుట యెన్నఁడో చెలీ. 123

కం. నందన వదన నిరీక్షా
నందనమునన్ జెందు సుఖము నవనిధులు గృహా
లింద మహినున్నయపుడున్
చందనగంధీ! పొసంగఁ జాలదు సుమ్మీ. 124

మ. కళకున్ ముత్తెపురావిరేకజిగి సాకన్[1] జాలు లేనవ్వుడా[2]
ల్గలనిద్దా మగజాల చెక్కడపు చొక్కాటంపు[3] బల్మద్దికా
యలునుం జెక్కుల చక్కిగంతు లిడఁ బాదాబ్జమ్ములన్ బైడియం
దెలు ఘల్ ఘల్లన నాడు ముద్దుఁ గొమరున్ వీక్షించు టెంకెన్నఁడో. 125

కం. ఇల నాల్గు చెఱఁగు లందును
గల రాజులు కరము లియ్యఁగా వెలసిన నా
కలిమి యిది సుతులు గలుగమి
జలజాక్షి! యెన్నలేని సస్యము గాదే! 126

కం. అని తలఁచుచుఁ జింతింపుచు
ననితరరతమతి నృపాలకాగ్రణి పలుకన్
దన యాత్మలోన సతియున్
దన యాసంభవ భవోగ్రతాపం బడరన్. 127

చ. తన హృదయేశుఁ జూచి వనితామణి యిట్లను నింతమాత్రకున్
జనవరచంద్ర యేటికి విచారముచేఁ బొగులం బురాకృతం
బనుభవనీయ మైన మనయన్వయ దేశికుఁడైన యావసి
ష్ఠుని భజియించినం గలుగునుమ్మ కరమ్ము మనోభిలాషముల్. 128

చ. అతనికి నేతదన్వయ నృపావన యత్నమయత్న పూర్వక
వ్రతము మహీశ తొల్లి సురవల్లభు కొల్వున మాటవచ్చినన్
సతమగు బత్తితో మన త్రిశంకు తనూజుని సత్యవాక్యమ
ప్రతిహత మంచు నచ్చటి నృపాలుర ముందర నిల్పనాడఁడే. 129

1. సోకన్. 2. లేనవ్వుడా. 3. చేకట్లొప్ప.

ఉ. ఆముని హైహయాన్వయ భయంకర బాహుబలాఢ్యుఁడైన యా
రాముని గండగొడ్డలి నరాతిదమౌ తన బ్రహ్మదండ వి
ద్యా మహిమం దరించి తపనాన్వయ మంతము నొందనీక బో
ధామహుఁడా మహాత్ముఁడె కదా దయఁగాచె జగం బెఱుంగఁగన్. 130

క. ఆమౌని కరుణఁగాదా
యీ మనువంశంబు నృపతు లెల్లరు విభవో
ద్దామ పరాక్రమ జయసం
ధా మహిమన్ గీర్తిఁగనుట నాఁడున్ నేఁడున్. 131

కం. అని గంధవతీసతి పలి
కిన పలుకులు చెవుల కింపుఁ గెరలింప మనం
బున వనట మాని జనపతి
మునిదర్శన గమనకాంక్ష ముదమొదవింపన్. 132

కం. ఉన్నంత జటిలపటలీ
సన్నుత సమధిక సమాధి సౌష్ఠవబల సం
పన్నిష్ఠుండు వసిష్ఠుం
డన్నరపతిచంద్రుఁజేర నరుదెంచుటయున్. 133

కం. అత్యంత భక్తియుక్తిన్
బ్రత్యుత్థానంబుసేసి బహుభంగుల న
య్యత్యగ్రణిఁ బూజింపుచుఁ
బ్రత్యగ్ర సువర్ణ పీఠిపై నిడి తానున్. 134

తే. గీ. ఆ సమీపమున హిరణ్మయాసనమున
మౌనికుల చంద్రునాజ్ఞ నాసీనుఁ డగుచుఁ
గరము వినయంబు భయము నక్కఱయుఁదోపఁ
గరములు మొగిడ్చి నందనాకాంక్ష ననియె. 135

పంచచామరము : జటాధరేశ్వరా భవద్విసారి సారవత్కృపా
కటాక్ష రక్షితాక్షర ప్రగాఢ శక్తియుక్తిచేఁ
బటు ప్రతాప దీపితారి పార్థివుల్ కరంబులు
త్కటంబుగాఁగనిచ్చి కొల్వఁగాంచితిన్ మహోన్నతిన్. 136

ఉ. ఏ పరచింత లేక రిపులేపఱఁ జెండితి నింక నీకృపన్
దాపసయూథనాథ పరితాపసనాథుఁడఁగాక యీయెడన్
రూపసుధాకరుఁ మదనురూప గుణాకరు సత్కుమారు నా
చూపుల దాప మార్పు .... .... .... .... .... .... .... 137

చామరము : నావుడుఁ మనంబునఁ ఘనంబుగాఁగ నాదరం
బావహిల్లఁగా నిమీలితాక్షి పద్మయుగ్ముఁడై 138

... ... ... ... ... ...
... ... ... ... ... ...

ఉ. ద్యాగము సేసి సాంగముగ దక్షిణ లార్యులకిచ్చి విశ్వజి
ద్యాగము సేయు 139

వ. సకల దేశాధినాయకుల పేర వరలేఖల నంపుటయును 140

మ. వివిధోపాయనపాణులై సకల పృథ్వీనాథు లేతెంచి భా
ర్గవ తేజుఁ రఘురాజుఁగాంచి వినుతుల్ గావించి యానప్రతం
తువిధానాను గుణమ్ముగా నమిత వస్తువ్రాత మర్పించి క
క్ష వినిక్షిప్త కరాగ్రులై యుభయ పార్శ్వక్షోణులన్ నిల్చినన్. 141

క. వారల సముచితగతులన్
గారా మొనరించి యెంచి కాంతాయుతుఁడై
యారిపు జైత్రుఁడు సవన1
ప్రారంభం బాగమోక్త పద్ధతి నెలమిన్. 142

వ. కావించి స్థండిల చషాలకుంభ ధమనీ ధవిత్ర మృద్దారు యూపశస్త్ర స్రుక్స్రువాది యజ్ఞోపకరణశోభితంబులును, సమిత్కుశ పలాశ క్షీరాజ్య దధిపశుపురోడాశాది సమ్మితంబుగా బ్రహ్మాధ్వర్యూద్గాతృ హోత్రగ్నీధ్రాది ఋత్విక్సహాయుండై ప్రణుత దక్షిణజ్వాలా భీలంబులగు నాహవనీయ గార్హపత్య దక్షిణాగ్నులయందు యథోక్త ప్రకారంబున స్వాహాకారోదారంబుగా హవ్యంబువేల్చి షడ్రసోపేత సకల సామగ్రీ సంపన్నంబులగు నన్నంబులు పెట్టించి సదక్షిణాకంబును సాంగోపాంగంబునుగా నమ్మఖంబు నిర్వర్తించి జాయాసమేతుండై యవభృథ స్నానం బాచరించి సుఖంబుల ననుభవించుచుండె. 143

---

1. సత్ర.

## ఆశ్వాసాంతము

శా. విద్వల్లక్షణ దక్షదక్ష పరభూ విభ్రాజి శౌర్యక్షతా
సద్వృత్తి ప్రతిపక్ష పక్షభృ ది నాశ్వశ్రీ పదాకోచ్చరుసం
పద్వైశాల్య నలాక్షి లాక్షణిక విశ్వ స్తోత్ర జాతాంశు సం
సద్వత్కీర్తివలక్ష లక్ష గుణపుంజ క్షీర పాథోనిధీ. 144

కం. చంచుమల చూరకారో
దంచిత బిరుదాంకః గర్వితాహిత కరిరా
ట్పంచాననః నారీజన
పంచాయుధః తిమ్మభూమిపాల తనూజా ! 145

పృథ్వీవృత్తము : నిరంతర రమావమానిత నతీశ యశాధిరా
ట్పురందర ధరవ్రజ స్ఫుట సితాబ్జ రాజద్యశో
ధురంధర ధరప్రభూ ద్ధురధృతి ద్యురత్న ప్రభా
పరంపర పరక్షమాపతి మదేభ పంచాననా. 146

గద్య : ఇది శ్రీరామభద్ర కరుణాకటాక్ష వీక్షణ సమాసాదిత సరస కవితా వైచిత్రీపాత్ర తెనాలి రామకృష్ణకవిరాజానుజ శ్రీగిరి కవిసార్వభౌమ పౌత్ర యభినవ రామకృష్ణ సత్కవిపుత్ర తిమ్మమాంబా గర్భరత్నా కర రాకాకైరవ మిత్ర కౌండిన్యసగోత్ర పవిత్ర సకల సుకవి వినుత సాహితీ విద్యా సమున్నిద్ర రామభద్రకవి ప్రణీతంబైన యిందుమతీ పరిణయంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము

కం. శ్రీలలనా వల్లభపద
నాళీక నిరంతరార్హణా కృతిలోలా
లోలాక్షీ సముదయపాం
చాలా పాల్వ్చారి కృష్ణజగతీపాలా ! 1

తే. గీ. అవధరింపుము మఱునాఁడు హరితహరికు
లాంబురాశి సుధాకరుండైన రఘువు
ఖానుఁ డుదయాచలమునఁ గన్పట్టువేళ
మేలుకని వందిమాగధపాలి పొగడ. 2

కం. అలివేణి యొకతె వలపులు
గులికెడు మణిశాతకుంభ కుంభముపన్నీ
రెలమిన్ శయపల్లవ పుట
ముల నింపఁగ నతఁడు రచిత ముఖ మార్జనుఁడై. 3

తే. గీ. కాల్యకరణీయములు దీర్చి కమ్మతమ్మి
తంతు విద్దు నెమ్మోముతిలక మలర
నంతిపురికేఁగి భోజనానంతరమున
రమణి యయె బోగతరము నేర్పఱచియనుప. 4

సీ. అసలు కుంకుమపూఁత నందచందములుగా
పైఁదీర్చు కస్తూరిపట్టె లలర
యరవిరి విరవాది సరులు పొంకించిన
సిక బురుసారుమాల్ జిగి దొలంక
తారహారముల సందడిఁజేయ[1] రాచిల్క
పచ్చతాళికిఁ జిల్క పదువు గదియ
మేలైన విడికెంపు మేరువు కడియాల
కడియాలముగ రాగమవని గ్రమ్మ
హళిది చాయగ కంచుక యచటి చాయ
పుష్యరాగపుఁ బిడిబాకు పొసఁగఁజెక్క
చౌకటుల తెల్వి చెక్కులఁ జౌకళింపఁ
గొలువుసింగార మయి రాజకుంజరుండు. 5

1. చెల్లు.

కం. అందముగఁ బసిడి పావలు
చెందమ్మి పదములఁ దొడగి శింజా[1]రవముల్
గ్రందుకొన దిశల నేత్రా
నందముగాఁ బ్రజలు చూడ నగరు వెడలఁగన్. 6

కం. హరి గెలుచు కౌను లలరఁగ
హరిగెలు పట్టికొని కొంద ఱళినీలకచల్
పురుహూతుఁ డిలకు దిగిరా
శరదంబులు గదిసి వచ్చు సరవిం దనరన్. 7

సీ. చలువ పావడ వీచె సతియోర్తు ముఖచంద్ర
చంద్రిక నెనగొల్పు చందముగను
కైదండయొక్కఁ జక్కఁవచంటి నవరించెఁ
గరి కరమ్మున కిక్షుకాండ మనఁగ
చెంగల్వ కచ్చొకయంగన కాన్కఁగా
మరున కమ్ములపొది మాడ్కి నొసఁగె
కపురబాగము లిచ్చెఁ గాంతయొక్కతె దంత
ములనూడు కొనఁగు కెంపులో యనంగ
తే. గీ. రమణి యొక్కతె ధవళ పర్ణచ్ఛదముల
మడువు లొసఁగుచు వచ్చె [2]చేమలయునపుడు
కేళిగోరంట చికటారి కేలఁబూని
నగవు మురిపెంపు పొదలిక నగరువెడల. 8

సీ. రవలపాదుకల బల్ రవళి కక్ష్యాంతర
ప్రతిహారి తతుల నాయితపఱుపఁగఁ
గులుకు నిద్దపు డాలుగల పెద్ద చౌకట్లు
గండమండలములఁ దాండవింపఁ
దావికుంకుమ కావి దనరు వల్లియ వాటు
జిలుగుసేలు చెఱంగు జీరియాడఁ
బ్రతినతి ద్యోతకాంచిత కటాక్ష వ్యాప్తి
వందారు జనముపై నందడింప
తే. గీ. దేవర పరాకు జతను పాదావధాన
హస్త విలియంచుఁ గంచుకులంత నంత
హెచ్చరికఁదెల్ప నాస్థాన హేమపీఠిఁ
జేరి సమ్మోదమున సుఖాసీనుఁడగుచు. 9

1. శింఖా. 2. వే.

సీ. అవధారు దేవ పాండ్యవరాట కర్హాట
ఖోట కర్ణాణ భూభుజులు వీరు
చిత్రేశజియ్య కాశ్మీర కళింగాంగ
బంగాళ భూ ... ... ... ...
... ... ...
కంచుకుల్ విన్నవింప
నరసి వారల మ్రొక్కు లీయకొని తగిన
మన్ననలు చేసి యందఱ మరల ననిచి
... ... ... ... ... ...
... ... ... ... ... ... 10

కం. గురుబాంధవ విద్వత్కవి
పరిహాస కరేంద్రజాల బహురూపకఖే
కర వీరభటాదులు దను
గురువైఖరి బలసి కొలువఁ గొలువున్న యెడన్. 11

కం. మాత్సర్య రహిత యోగస
ముత్సాహ సమేధ మానసోపగత శ్రీ
వత్స విరాజద్వక్షుఁడు
కౌత్సుం డేతెంచెఁ దత్సకాశంబునకున్. 12

మత్తకోకిల. వచ్చు నమ్ముని లోకవర్యు నవార్యసంభ్రమ మోదముల్
హెచ్చ నచ్చపు భక్తితో నెదురేఁగి సర్వధనంబుమున్
వెచ్చపోవుట మృద్వికార నవీన పాత్రిక నర్ఘ్యమున్
దెచ్చి పూజలొనర్చి తోఁగొని తెచ్చి నెయ్యము మీఱఁగన్. 13

కం. అర్హాసనమున నంహో
నిర్హరణ పటిష్ఠు నమ్మునిశ్రేష్ఠు మహీ
బర్హిర్ముఖవరుఁడహితని
బర్హణుఁ డానృపతి యునిచి పలుకుం బ్రేమన్. 14

చ. అనఘ పవిత్ర మయ్యె భవదాగమనంబున మద్గృహంబు సొం
పెనయఁగనేఁ గృతార్థత వహించితి నాధుని కాఘహారియున్
ఘనతర భావిభవ్యగుణ కారణమై తగు తావకీన ద
ర్శనము శరీరి కబ్బుటలు ప్రాక్తన సత్కృతముల్ ఘటించుటల్. 15

వ. కావున మునీంద్రా మదీయ పురాకృత కర్మ ఫలంబులకు సమ్యక్ప్రచేలి మతాప్రదంబగు దోహదంబునుం బోలె నశేష దోషదోషాచర సుదర్శనంబును సకలశ్రేయస్సమాగమ నిదర్శనంబును నగు భవత్సందర్శనంబు సిద్ధించె. మందిరంబు పవిత్రీకృతమయ్యె. భవదాగమనంబునకుం గతం బెయ్యది ? విదీర్ణరవికిరణ శ్రమంబులగు నాశ్రమంబుల దేవపితృ దేవాతిథి సంతర్పణానుష్ఠాన నిదానంబులగు సమిత్కుశ కుసుమఫల పలాశజలాశయాదికంబులకు నెద్దియేనియు నవరోధంబు సంభవించదుగదా యనపుడు నమ్మహీకాంతునకు వరతంత్వంతేవాసి దరహాసభాసి తాననుండై యిట్లనియె. 16

కం. అలఘుభవదీయ బాహా
బలపాలిత మైన ధరణిభాగమ్మున నె
ట్టి లఘుతర వర్తికైనను
గలనైన నుపద్రవంబు గలుగునె తలఁపన్. 17

చ. విను మిపుడేను వచ్చుట సవిస్తర మౌనటు లోనృపా తపో
ధనమణి మద్గురుండు వరతంతు సమాహ్వయుఁ డెల్లనాఁడు న
న్ననుపమ వత్సలత్వమున నాదరణం బొనరించె నమ్మహా
త్ముని వలనన్ గ్రమంబునఁ జతుర్దశ విద్యల నభ్యసించినన్. 18

ఉ. భాషణ చేష్టితంబులను బాటిలు నేరమిసైఁచి యెంతశు
శ్రూషయొనర్తు నంతియ త్రిశుద్ధిగ మేరుపుగాఁగ నెంచుచున్
దోషము లంటనీక దయతో సకలంబును దెల్పి త్రాతయై
షోషణ చేసె నన్ను మునిపుంగవుఁ డాత్మజుఁ దండ్రియుం బలెన్. 19

కం. ఏ నమ్మహానుభావుని
మానససంశుద్ధి తాల్మి మహనీయ దయా
నూనత్వంబును గనుఁగొని
యానంద నిరుద్ధబుద్ధినై యిట్లంటిన్. 20

ఉ. ఓయమి సార్వభౌమ ! నను నుత్తమ శిష్యునిగాఁ గృతార్థుఁగాఁ
జేయుట కొక్క ప్రార్థనము చేకొనుఁ డీరలు నేర్పినట్టి వి
ద్యాయతి కెద్దియైన గురుదక్షిణఁ గోరుఁ డటన్న నయ్యుపా
ధ్యాయుఁడు కించిదంకురిత హాస విభాసికపోలుఁ డయ్యునున్. 21

శా. వత్సా! నీవలనం బ్రసక్త మగు సేవామాత్ర లాభంబునన్
మత్సంకల్ప మనల్ప మోదభరరమ్యం బయ్యె నీవెందు వి
ద్వత్సంఖాప్యుఁడ వౌటె చాలు మఱి విద్యాశుల్కమే నొల్లఁగిం
చిత్సందేహము లేదు చెందునె తపస్విశ్రేణి యర్థ స్పృహన్. 22

కం. అనినన్ను నివారించిన
ననుదినమును నుడుగ కేనునయ్యతివరుఁ బ్రా
ర్థన చేసినఁ గడు వేసరి
యనివారణ మద్వచః ప్రయాస కుపితుఁడై 23

కం. అదరిపడి యేను నేర్పిన
పదునాలుగు విద్యలకును బాల్పడు ధనమున్
బదునాలుగు కోట్లిమ్మని
కదిసిన మొగదీయ కేనుఁ గానిమ్మంటిన్. 24

కం. లోకాలోక పరీతధ
రాకటకములందు నున్న రాజులలోనన్
నా కాంక్షితంబుఁ దీర్పఁగ
నీకంటె నొరుండు లేఁడు నిజము యశస్వీ. 25

వ. అది యెట్లంటేని. 26

చ. కదనధరిత్రి శాత్రవుల గర్వము సర్వము మాన్చి యాత్మలన్
ముదమొదవింపఁ జాలిన యమోఘపు బల్మిని భక్తి నర్థికిన్
గొదుకక యెద్దియైన సమకూరుచు నీవులతీవులం జగ
ద్విదితులు భానువంశపృథివీపతు లందఱు నందు మిక్కిలిన్. 27

సీ. గురుధేను వరదాన గరిమ దిక్పాలుర
యంచితాంశముల జనించినాఁడ
వింద్రు సంతతివాని నిట్టటుగాఁ జేసి
పితృ యాగహయము రాఁబెనఁగినాఁడ
వెదిరి యాతనిచేతి హేతి తూలిక రీతి
గాఁ దజ్జయశ్రీలఁ గాంచినాఁడ
వఖిలదేశాధీశు లరిగాపులై పంపు
సేయఁ బూర్ణఖ్యాతిఁ జెందినాఁడ

తే. గీ. వద్భుతైతాదృశ ప్రభుత్వాఢ్యుఁడైన
యీవు మృత్పాత్రమున నర్ఘ్య మిచ్చుటాత్మ
విశ్వజిద్యాగ వితరణ విభవగుణస
మృద్ధి యెంతయు సూచించు టింతెకాక. 28

కం. మత్సంకల్పిత గురుకా
ర్యోత్సవ విఘ్నదముగా దనుత్తమ మగునే
తత్సంభావన కిత్తఱి
నుత్సాహము సేయు మనిన నుర్వీశుఁడనున్. 29

తే. గీ. అనఘ నాచేత నిటులు మీయంతవారు
పనిఁగొనుటె చాలు యుష్మత్కృపా పటుత్వ
మూఁతగా నేతదర్థ మింపొసఁగు ననుచు
నధిపుఁడును దత్క్రియోద్యుక్తుఁ డయ్యె నపుడు. 30

సీ. శ్రుతి సుఖావహమంజుగతి రణత్కింకిణీ
మాలికా సందోహమానితంబు
గాంగేయమయకేతుకాండాగ్రవారితా
దభ్రాభ్ర సంచర దభ్రచయము
దినరాజతేజః ప్రతిస్పర్ధి నవవిభో
న్నిద్ర రత్నచ్ఛటా ముద్రితంబు
పరసాధనా భేద్య శరశరాసనగదా
శాతనానాహేతి సంకులంబు
తే. గీ. సకల సేనావితాన సంస్థానయోగ్య
సమధికాయోధ నోల్లసజ్జయ పటిష్ఠ
సర్వతో నిర్నిరోధ నిష్యందమాన
మానితంబగు నొక్క విమాన మపుడు. 31

చ. గమన మహాసహాయ మయి కన్నుల పండువునై యరుంధతీ
రమణుని మంత్రశక్తి నభిరామగతిం గనుపట్టినం దమో
దమన కులావతంసుఁడు ముదంబుననెక్కి యనన్యరాజ దు
ర్దమమగు శంభుదిక్కునకుఁ బ్రాభవ మొప్పఁగ నుద్గమింపఁగన్. 32

తే. గీ. అపుడు యక్షాధినాథుఁ డనల్పబుద్ధి
వసుమతీ చక్రమునఁ బుట్టువార్తలెల్ల
నరసి చనుదేరఁబనుప నందందుఁ దిరుగు
నాప్తులగు గూఢచరులు రయంబు మెఱయ. 33

కం. డేగలు విడిపడినట్లతి
వేగంబున నెగసి గగనవీథికినై హ్రా
ద్వేగంబునఁ బవమానుని
వేగముఁ దెలుపుచును వచ్చి వినిపింపఁ దగన్. 34

కం. అలకాపతి యపుడు బలా
బలచింతన మాచరించి బలభేదను ము
న్నలయించిన జో దితఁడని
చలమేది తదీయ కార్య సంఘటనేచ్ఛన్. 35

కం. మునుమున్న బలియుతోడన్
బెనకువ గాదనుచుఁ దవులు పిఱికి తనముతోఁ
[1]గనక గిరిగ నాతనిపురిఁ
గనకపు వర్షంబుఁగురిసె గణనకు మీఱన్. 36

తే. గీ. అప్పు డయ్యర్థమెల్ల నర్థంబులైన
పేటికల నించి వివిధోష్ట్రకోటిమీఁద
నుంచి తెప్పించి తనకు నర్పించియున్న
నాయతీంద్రుఁడు సౌదక్షిణేయుఁజూచి. 37

ఆ. అతిబలాఢ్య యస్మదాచార్య వాంఛితం
బిట్లు సంఘటింప నెవ్వఁడోపు
నరిది మేలుచేసి తరసి ప్రత్యుపకార
మేతదుచిత మెద్ది యేనొనర్తు. 38

ఉ. సర్వశుభోదయమ్ముల నజస్రముఁ జెందిన నీకుఁజేయునా
శీర్వచనంబు వేఱొకటిఁ జెందిన లాభమె చెప్పుటల్ మహా[2]॥
ఖర్వుఁడు నీగురుండు నినుఁగన్న రహిన్ స్వగుణానురూపునిన్
శర్వసమానశౌర్యుఁ దనుసంభవు నొక్కనిఁగాంచు మున్నతిన్. 39

కం. అని యమ్మునివర్యుఁడు రఘు
జనపతి నాశీర్వదించి సద్రుచి భాస్వం
తుని యతిశాంతుని వరతం
తుని యాశ్రమమునకుఁ జనియె ద్రుతగమనుండై. 40

---

1. గనకగిరిగ.

తే. గీ. అంత వరతంతు వరశిష్య యమివరేణ్యు
వలన నయినట్టి దీవనవలన నిలన
జేయుఁడై యొప్పు సౌదక్షిణేయు తోయ
జాక్షి ధరియించె దౌహృదలక్షణంబు. 41

చ. గుసగుస నబ్బురంబువలె గుంపులుగూడి యనుంగు నెచ్చెలుల్
మునిముని నవ్వునివ్వటిల ముచ్చటలాడఁ బ్రియుండు నాత్మలో
ననదృశలీలఁ జాల ముద మందఁగఁ బెన్నిధిఁ గన్న పేదనా
లసితసితాయతాక్షి పొదలం దొడఁగెన్ ధృతగర్భ చిహ్నయై. 42

తే. గీ. నెల లొకటి రెండు చనునంత నిబిడమైన
యరుచి చిట్టుములుమియునయ్యతివమేను
సొరిది భావిఫలావాప్తి సూచకముగ
నలరు లురిలించు లతలీల ననుసరించె. 43

శా. ఈ గర్భార్భకుఁ డింతమీఁద మది నూహింపం బలాకార రే
ఖాగాంభీర్య సమృద్ధి నిండుమతిఁ దాఁ గైకొన్నఁదద్వైరి భూ
భాగాధీశులమోము లీకరణిఁ జూపట్టుంఖుమీయన్నయ
ట్లాగంధ ద్విపయాన యాననము తెల్లైపొల్పు మీటెన్ గడున్. 44

తే. గీ. చూడఁజూడంగ నత్యంత సూక్ష్మ మగుచు
నున్న లేఁగౌను నిజమహిమోన్నతులను
మీఱి బలియుడుఁ జూపోపమియును బోతె
నాతిచను మోములొయ్యన నలుపుఁ దాల్చె. 45

కం. అన్నువ మోమునఁ దెలుపుఁ
జన్నుంగవ మొనల నీలసమమగు నలుపున్
నెన్నడుమునఁ బెనుబలుపున్
గన్నియ మైనాఁడు నాఁట గానఁగ నయ్యెన్. 46

కం. కొమ్మలకు గర్భలాభజ
సమ్మోదమె తొడవు గాన జగతిన్ భరవా
హమ్ములని రోయుగతిఁబలు
సొమ్ములపై శరత మిగుల సుదతికిఁ దోఁచెన్. 47

శా. ఈరీతిన్ సుతగర్భ గౌరవముఁ దాహేలాగతిన్ దాల్చి యా
నారీరత్నము సారె బోంట్లు కనుసన్నన్ వేపనుల్ సేయ శృం
గారం బొప్పఁగఁ బైఁడి గద్దియపయిన్ గన్పట్టు భూజాని గ
న్నారం జూచుచు నోలలాడుఁ బలుమా ఱానందపాథోనిధిన్. 48

కం. భూమీశ్వరుఁడాగమవి
ద్భూమీసుర వరులచేతఁ బుంసవనంబున్
సీమంతముఁ జేయించెను
సీమంతినికిం బ్రమోదచిత్తుం డగుచున్. 49

మ. వికచాంభోరుహనేత్ర నా యెదుటఁ దా వ్రీడాభరాక్రాంతయై
యొకనాఁడున్ మదభీప్సితం బిదియటం చొక్కింతయుందెల్పదా
శుకవాణీమణి కోరికల్ దెలియుఁడంచున్ దత్సఖీకోటి న
ర్కకులాధీశుఁడు గారవించి యడుగుం గౌతూహలాయత్తుఁడై. 50

ఆ. వె. వనిత కప్డు సురతవాంఛ లేవడియైన
తీవి రిపుసతులకు లేవడయ్యె
గర్భ మబ్జముఖికిఁ గడుభారమైతోఁప
ప్రాణ మహితులకును భారమయ్యె. 51

శా. అంతన్ దద్రఘు రాజగేహిని సమగ్రాన్యోన్య మిత్రత్వసు
స్వాంతం బై గ్రహపంచకం బధిగతోచ్చస్థానమై యుండ న
శ్రాంతక్షేమదమైన వాసరమునన్ బ్రాహ్మీ ముహూర్తంబునన్
గాంతి గ్రస్త శశాంక మండలు సుతుం గాంచెం బ్రమోదంబునన్. 52

చ. కలువలవిందుఁ గన్గొని వికాసదభంగ తరంగ కోటుల
గ్గలముగఁ బొందు వార్ధిగతిఁ గన్నుల పండువుగాఁ గుమారకున్
గలయఁగఁ జూచి చూచి యధిక ప్రమదంబునఁ బొంగి పొంగి భూ
తలపతి యాచరించె నుచితక్రియలన్ సుతజన్మలబ్ధికిన్. 53

తే. గీ. పురుడులేని గుణము పూఁబోఁడి కొయ్యన
పురుడు వచ్చి రెలమిఁ బుణ్యసతులు
జాతకౌతుకమున జాతకర్మం బాత్మ
జాతునకు నొనర్చె జగతి విభుఁడు. 54

కం. అజనామ మిడియె నఖిల
ద్విజనాయకు లక్కుమారు దీవించిరి సా
ధుజనావన గుణరక్తిం
గుజనాహిత హరణశక్తిఁ గొమరగు ననుచున్. 55

ఉ. అల్లన నొక్కకేలునఁ బదాబ్జముఁ గుంచితలీలఁ బట్టి ఘల్
ఘల్లన నందియల్ మొరయఁ గౌతుక మొప్పఁగ నాలకింపుచున్
దల్లి మెలంగఁ జెంగటను దప్పక మోమటు చూచి కేరుచున్
గొల్లగఁ బింపినుల్ గురియుకుంతలముల్ నుదుటన్ నటింపఁగన్. 56

శా. లీలాకల్పిత చిత్రచిత్ర తరకేలీధామ మధ్యంబునన్
డాలుం జొంపము లీను మానికపుఁ దొట్లం బెట్టి జోకొట్టి యు
య్యాలో లాలి యటంచుఁ జేరి కలకంఠాహావకంఠధ్వనిన్
జోల ల్వాడుదు రొయ్య నొయ్యన సఖీచూడామణుల్ రాసుతున్. 57

కం. విద్దెము సేయుచు జిలిబిలి
ముద్దులచేఁ బ్రొద్దు పుచ్చుచుం జెలు లడుగన్
ముద్దిడుచు నక్కుమారకుఁ
డద్దిరనం దప్పటడుగు లందంద యిడున్. 58

సీ. అలకావళుల నంటి తళుకుముత్తెపు రావి
రేకు నెన్నుదుటిపైఁ జౌకళింప
నిద్దంపుఁ జెక్కుల నిగనిగల్ గొనుకెంపు
మద్దికాయల చెల్వు ముద్దుఁ గుల్క
రాణించు నునుమూలరాకట్టు నునుమింత
పులిగోరు గళమునఁ బొలుపు మిగుల
జిగిమించు నపరంజి చిఱుతగంటల చాలు
మొలనూలు కటిసీమ మురువుసూప
తే. గీ. లలిత కలహంస కలరవక్రమము బోఁవఁ
జరణముల నందియలమ్రోఁత సందడింపఁ
దల్లిదండ్రుల కనుపమోత్సాహ మెసఁగు
లీల నడయాడుచుండు నబ్బాలకుండు. 59

కం. బాలోచిత కృత్యంబుల
నోలింగొన్నాళ్ళు మెలఁగి యుపనీతుండై
చాలియతఁ డఖిలవిద్యా
జాలంబులు నభ్యసించె సమధిక మేధన్. 60

కం. చతురాననత్వ నిధి వా
క్పతి లోకేశ్వరుఁడు జలజభవ సమభిఖ్యా
న్వితుఁ డతిసత్త్వ నివాసుం
డితనికి నజనామ మెంత యెనయు నొసంగన్. 61

తే. గీ. అనుచు జనము లెంచికొన సమానవయస్క
నృపతిసుతులు మేనునీడ లట్లు
యంటి కొల్వ మెలఁగ నన్వయోచితలీల
నజుఁడు పూర్వ యౌవనాగమమున. 62

స్రగ్ధర. అవార్ధిక్షోణినాథుం డగు రఘువిభుఁ డత్యాదృతిన్ భూరి దాన
శ్రీవర్ధిష్ణు ప్రతాపస్థిరనయ వినయాక్షీణ గాంభీర్య చాతు
ర్యావానజ్ఞాన సత్త్వాయతభుజు నజునిన్ యౌవరాజ్యాభిషిక్తున్
గావింపం బెండ్లిసేయంగఁదలఁచి హృదయోత్కంఠ నత్యుద్యతుండై. 63

కం. ఇలలోపలఁ దజ్ఞ జనా
వలిచే సంబంధ బాంధవము గలచోటన్
గులశీల రూపరేఖా
విలసనములు గలుగు తరుణి వెదకించుతఱిన్. 64

మ. కనకక్ష్మాధర చాపహస్తు కనుకా[1]ఁకఁ జూపుగా లేని
మునికింగ్రమ్మరఁగాయసిద్ధి నిరతంబున్ బూని కల్పించుమో
హన మంత్ర ప్రచయాధి దేవతయనానా కాలమందావిద
ర్భ నరాధీశ్వరపుత్రి యిందుమతియన్ పద్మాక్షి యొప్పున్ రహిన్. 65

కం. ఆయబ్జపాణివేణిక
శ్రీయుత మాయూరపింఛశేఖరరమ్య
చ్ఛాయఁ దగి కృష్ణలీలా
త్యాయతమై తాండవించు నవసీస్థలిపై. 66

మ. ప్రకటాపూర్ణ వినిష్కళంకకళలన్ భాసిల్లు నెమ్మోము తీ
వికి మున్నోడి తదీయసంగతి సముద్వేల ప్రభాజాల దృ
గ్వికచేందీవర మైత్రిఁజేరి భువనావృత్తిన్ సగంబై తదీ
యకళాకాంక్ష వసించు చంద్రుఁడన బాలాఫాల మొప్పున్ రహిన్ 67

---

1. వే.

శా. అన్నారీమణి కన్బొమల్ మదన బాణాసస్థితిఁ జెందినఁ
గన్నుంగల్వలు తామనంగు శరముల్ గామాయటంచుఁ దదా
సన్నావాసులు గాఁగ నాసరికిఁదాఁ జాంపేయ మత్యంత సం
పన్నం బయ్యెడ సొచ్చి నిల్చెననఁ జూపట్టెఁ లసన్నాసయుఁ. 68

తే. గీ. ప్రకటతరమైన నెమ్మోము రాజరాజ
వైభవముఁదాల్పఁ దత్పార్శ్వవర్తియౌటఁ
గర్ణయుగళంబు శ్రీవరాక్షర నిరూఢిఁ
జెందకుండునె లసమాన సుందరదకు. 69

చ. ప్రకటతరారుణత్వ మధురత్వ మృదుత్వ సుగంధి భావమం
దొకటికిఁ గొన్నికొన్ని యనువొందని పంకజరాగ బంధుజీ
వకసిత బింబముల్ సవతువచ్చు నటంట యనంగతోక్తి యా
సకలగుణాభిరామమగు సారసలోచన తియ్యమోవికిఁ. 70

తే. గీ. మారుఁ డరుదుగ మేని బంగారమునకుఁ
బరిమళముఁదెచ్చి మంజులాగరపు వెలుకు
నంచు ఫలములు గల్పింప ముందొనర్చు
కోరకముల ట్లరదములన్నారి కలరు. 71

కం. స్మరశంఖం బది తప్పదు
తరుణీమణిగళము కాక తక్కినచోఁద
త్స్వరమా త్రాకర్ణనమున
నెఱుకఁదొరఁగి మోహమొదవు టెట్లందఱకుఁ. 72

కం. అలరుం గొమ్మకు దోర్యుగ
మలరుం గొమ్మల విలాస మచ్చుపడఁగను
జ్జ్వలతర కరపల్లవనఖ
సలలిత ఘనకోరకముల సమధిక మగుచుఁ. 73

కం. చెలికుచములు దళములు వడి
బలసి మొనలుదీఱి గుడుసు వడి యొండొకటిఁ
గెలుచు మది సంధి పుట్టక
నిలిచెఁ బరస్పరము నరులనెరి తుల్యములై. 74

తే. గీ. అమరుఁ గుచశైల మూలభాగములఁ బొడమి
లోఁతు పొక్కిలి డిగ్గియలోన డిగ్గఁ
జారులావణ్య రసధార జాడనిండఁ
జేరుశైవాల మనఁగ నూగారుసతికి. 75

సీ. ఘనమార్గమున మెలంగఁగ నేర్చు జక్కవ
కవఁదముఁబాసి పోఁగరముఁదఱుము
సరసస్థితిఁ దనర్చు జలజకోరకముల
నెక్కుడు నీటఁద్రోయించి మించుఁ
బొగడొందు మృదురీతి నెగడు పూబంతుల
నింపుతోఁబట్టి కట్టింపు చుండు
మిగుల సద్వృత్తంబులగు కందుకంబుల
తీవిఁ బల్మాఱు గొట్టింపుచుండు
తే. గీ. నౌరతముఁబోలఁ గోరెనో కోరలేదొ
యింతి సిబ్బెపు జిగిగుబ్బ లెంతచేసె
నౌను గర్కశలై తమలోనఁ దాము
రాయువా రన్యులకు నెగ్గుసేయు టరుదె. 76

తే. గీ. కంతుఁ డాకాంత మధ్య మానంత లీల
జగతి సాక్షాత్కరించి దర్శనపరులకు
సొంపు మీఱంగ నీవారశూక సదృశ
భావమటుఁజూపి నేత్రసాఫల్య మొసఁగు. 77

చ. వలనగు చక్రముల్ భ్రమలువట్టి చరించుట, రంభలుర్వరా
వలయము లోవలజ్జ దలలువంచుక మ్రగ్గుట, శాలిగర్భముల్
కలయఁగఁ బొల్లు వోవుటయు గట్టిగఁ దజ్జలజాయ తాక్షియు
జ్జ్వలపుఁ బిఱుందులన్ దొడల జంఘల నోటమి నొందుటంజుమీ. 78

తే. గీ. శంఖకుంద ప్రభల నసిచ్చటలఁజిమ్మి
కచ్ఛపశ్రీలఁ బైకొని కాంతచరణ
ములు మహాపద్మ పద్మలీలలను గ్రిందు
పఱుచు శృంగార రసనిధి ప్రభుత వెలయ. 79

సీ. కలువలకోరులఁ గన్నులఁ గావించి
కవదొనలుంచి జంఘలు ఘటించి
తన యస్తినాస్తిత్వమున నెన్నడుముఁజేసి
వలుద చన్నులు జక్కవల నొనర్చి
విజయశంఖము కంఠ విధముగాఁ గీలించి
మోవికెందలిరాకు తీవినుంచి
నిండుచందురుఁదెచ్చి నెమ్మొగంబున నిల్పి
భ్రమరపంక్తులఁగురుల్ పాదుకొల్పి
తే. గీ. యించు విలుకాఁడు లోకత్రయిన్ జయింప
నెలమిఁ దన సాధనంబులనెల్లఁ గూర్చి
రూఢ మంత్ర ప్రతిభ నొక్కరూపుఁజేసెఁ
గాక కాకున్నఁగలదె యీరేకసతికి. 80

సీ. ఆనఖంబుల నయంబట్టి పాదద్వయం
బాజానువులసౌరు లట్టియూరు
లాకటి ప్రాగ్భాగ మానితం బాభోగ
మా మధ్యమంబు తీరట్టియారు
నాచన్నుఁగవబింక మాకరంబుల పొంక
మాకపోలములగో మట్టిమోము
నారదమ్ములతళ్కు లాకన్నుఁ గవగుల్కు
లానెన్నుదుటి ఝొప్పనట్టి కొప్పు
తే. గీ. నట్టి రాయంచ నెన్నడ లట్టి యొడలు
నట్టి శృంగార సంచార మా యొయార
మట్టి మృదువాక్యముల చంద మట్టియంద
మబ్జభవుఁ డిందుమతియంద యనువుపఱిచె. 81

చ. ఇభవర రమ్యయాన యగు నిందుమతీ సుదతీలలామ యి
ట్లభినవయౌవనాధిగమనావసరంబున రా ష ణీ య క
ప్రభవ సువర్ణగాత్రి యయి పాణి పరిగ్రహ యోగ్యయౌట రా
గభరత భోజరాజనుజకాంక్ష నెఱింగి కృతప్రయత్నుఁడై. 82

కం. వినుత స్వయంవరోత్సవ
మొనరింప సమస్త దిక్తటోర్వీశులపే
రనుచితగతి శుభరేఖలు
మునుకొని యత్యంత వినయమునఁ బంపునెడన్. 83

శా. స్వస్తిశ్రీ మదమోఘ వజ్రసహిత స్వారాజ దోస్సారజి
ద్విస్తారక్రమ విక్రమాలఘు రఘూర్వీ భర్తకున్ భోజరా
జ్ఞస్తోత్రవ్యతనూభవోద్వహ విధానార్థంబు వృత్తేరఁగా
నస్తోకంబగు లేఖ శీఘ్రగతి మీయాత్మోద్భవుం బంపుఁడీ. 84

కం. అను శుభసూచక పత్రిక
ననురాగ మెలర్పఁబనుప నవనీశ్వరుఁడున్
దనయుని నవరూపరమా
తనయుని నిజసకల బలహిత ప్రకరముతోన్. 85

తే. గీ. సన్ముహూర్తమునఁ బ్రశస్తాగమోచిత
వాద్యఘోష మడర హృద్య లీల
రహి విదర్భపురికి రయమున జనకుఁడు
పనుచుటయును మోద మినుమడింప. 86

సీ. భాసురామ్నాయ విద్భూసు రాశీర్వాద
వారముల్ బిరుదు కైవారములును
శోభన గాయకస్తోమ నవీన స
ద్గేయముల్ స్తుతి వాఙ్నికాయములును
భేరికా మర్దళ భూరి కాహళ్యాది
వాద్యమ్ము లనవద్య పద్యములును
స్యందన భట వహ బృందనానావిధ
చారముల్ కరటి ఘీంకారములును
తే. గీ. వెలసె రాజన్య కోటీర విసర కషణ
గళితధుత రమ్య వసురజః కణగణప్ర
భావిభాసుర మగుచు నంబరము మెఱసె
విభవము చెలంగ నజరాజు వెడలునపుడు. 87

సీ. ఆలోలతర ఘంటికారావ మడరన
త్యంకుశాఘాతంబు లగుచుఁ ద్రోచి
నడుచు మదోద్వేగ నాగేంద్ర రథ
నంబు సైరింప కాశ్వికచయ మదల్చి

తరటుఁజేసినఁ గిన్క దైవార నిజఖురా
హతులచే నవని బిట్టదువఁబఱచు
నుత్తమాశ్వంబుల మొత్తంబులకు నెడ
మిచ్చుటకై రయంబెసఁగఁ దొలఁగు
తే. గీ. నరదములు తండ తండంబు లగుచు నెంచఁ
గ్రందుకొని సందడింపను గాల్బలంబు
పుడమి రాపట్టికిరుగడ నడచె నపుడు
ధరణి జవ్వాడ సకలదిక్తటము లదువ. 88

తే. గీ. ఇటులు సేనానివెంట నుత్కట రయమున
దివిజవాహిని నడచిన తెఱఁగు మీఱ
బహుళరథ వాహగజ సముద్భటభళి
యడరి పార్శ్వద్వయంబున నడువ నెదుట. 89

చ. కనియె నృపాలచంద్రుఁడు నిగాఢ తటస్థల రూఢకేతకీ
కనక నమేరు పాటల వికస్వర కేసర కుంద మల్లికా
జనిత పటుస్ఫుట ప్రసవ సంఘసుగంధ మహాలఘుత్వఖా
గనిశసుశర్కరాతి మధురాంబు కలాపగ నర్మదాపగన్. 90

వ. కాంచి తదంచితస్థితికి హర్షించి. 91

కం. సాధునికర సన్మార్గో
ద్బోధిని నధికోగ్ర పాపపుంజరజస్సం
శోధిని నాథునిఁ గీర్తి
శ్రీధనుఁ డానృపతి చేరఁజేరం బోవన్. 92

మ. రమణీయాంబుజహస్త చాలనమునన్ రాఁ బిల్చి వాత్యాజవో
ద్గమితాంభః పరిశుద్ధ బిందువుల నర్ఘ్యంబిచ్చి యాత్మోర్మిజా
తమరు ద్వారకృతోపచారముల నధ్వశ్రాంతి వారించి యా
యమృతాంశూద్భవ మిత్ర వంశజున కిట్లర్పించె నాతిథ్యమున్. 93

కం. అంత న్మావంతుఁడు మద
దంతిన్ వేవేగ నాయతపఱిచితే ఘ్మా
కాంతసుతుఁడెక్కి కంచుకు
లెంతయు హెచ్చరికఁ దెల్ప హేలాగతులన్. 94

ఆ. వె. అన్నదీలలామ చెన్ను కన్నులకును
విందు సేయ మంద మందగతుల
నతుల తీర భూరుహచ్ఛాయఁ జనునాన్ను
పాలభవున కగ్రభాగమునను. 95

సీ. వాత్యాజవోపరివ్యాప్త సూనపరాగ
పటలి చిత్రచ్ఛత్ర భంగిఁ దనర
భవ్యసానుస్థ శీర్వస్ర వన్నిర్ఝరా
సారముల్ చామరచ్ఛాయనమర
కటక పల్లవిత ద్రుకాండముల్ కెంబట్టు
టాలవట్టంబుల లీల నెనఁగ
కమనీయ హరితాళ గైరికాదిస్ఫూర్తి
రత్న భూషాసమగ్రత నొసంగ
తే. గీ. వల్లరీవేత్ర చాలన ముల్లసిల్ల
నగమ కంచుకు లుద్వేల ఖగరుతముల
హెచ్చరికఁ దెల్పన చలరాజేంద్రులీల
నుట్టిపడ నిట్టియగు నొక్క గట్టుఁజేఁడు. 96

కం. కనుపట్టుటయుఁ దదాలో
కనపరుఁడగు తనన్నపాలు కాంక్ష నెఱిఁగియ
జ్జన విభునకు నయదేవుం
డను మంత్రికుమారుఁ డిట్టు లనియెన్ ప్రేమన్. 97

ఉ. తామరసాప్త వంశహిమధామ సుధామయధామ యిమ్మహా
భూమిధరంబు కూటగత భూరుహకోరక దృశ్యతారకా
స్తోమ సమున్నతత్వమునఁ జోద్యమొనర్చుటఁ జేసి ఋక్షవ
న్నామము దీని కర్థయుతనామ మటంద్రు జనంబు లెల్లెడన్. 98

కం. భూనాథచంద్ర యిగ్గిరి
నానా తరువల్లరీ వనాంతర కాసా
రానూనధాతు మణిఘృణి
సానుదరీ ఝరము లింపొనంగెడుఁ గంటే. 99

సీ. ఈరంపుఁ దావుల నెంచి జోరనకమ్మ
విరులతేనియవాన గురియుఁ బొదల
పొదలు కిన్నరవధూ మృదుగాన సరణితో
మధుపాంగనల పాట మాఱుమలయు
మలయానిల గత శ్రమతనులై తమిఁబునా
రతు లొనర్చు వియచ్చర ప్రవరుల
వరలనెయ్యముఁ బారవశ్యంబుఁ దమకంబు
ననువొంద లాలించు నప్సరసల
తే. గీ. రసలసితతత మణిత భరములగముల
గలసి విలసిల్లు శుకపిక కలరవముల
కలరవములను శ్రుతిసుఖగరిమ వినుచు
ధరణిధవమౌళి యీయద్రితట వనాళి. 100

కం. అతుల వనమాలికాసం
యుతముఖ్యతటీనట న్మయూరకలాపాం
కితము నవవేణునాదాం
చిత మిగ్గిరి కృష్ణమూర్తి జెలఁగెడుఁ గంటే. 101

సీ. గంధర్వగాన సంగతులకు ననిల పూ
రితకీచకమ్ములు శ్రుతులు గూర్ప
దివ్యలోక మృదంగ ధింధి మధ్వనికి బం
ధురనిర్ఝరధ్వనుల్ తోడుసూప
నట దప్సరోజననయనావళికి దృష్టి
పాత్రములై శిఖిప్రతతు లొలయ
బంధురగీత ప్రబంధ సద్భావంబు
ననిలకంపితశాఖ లభినయింప
తే. గీ. స్నిగ్ధశశికాంత మణికాంత శిఖరసీమ
రచ్చసేయుచుఁ జూచు సుర ప్రభులకు
నాట్య సాహాయ్య సామగ్రి ననువు కొల్పు
నరవరోత్తమ యీధరాధరవరంబు. 102

ఆ. స్వామి చూడు మువరి చమరీనిచయవాల
బృంద మిరుగెలంకు లందువ్రేల
లోల కర్ణచామరాలంకృతకరీంద్ర
ఘటలఁబోలె దీని గహ్వరములు. 103

చ. నికట చరన్మృగాంక తను సీతసుధారస సక్తి నాఁడు నాఁ
టికి నవకంబులై ముదిమి డింది యొకప్పుడు బీరువోక క్ర
మ్ముకచిగురాకు జొంపములఁ బువ్వులఁ బిందెలఁ గాయలన్ ఫలా
దికముల విఱ్ఱవీఁగు జగతీవర యిగ్గిరి కూటసాలముల్. 104

కం. సామోద్భవ నిజజనక
వ్యామోహిత జేరఁ జనఁ దదంఘ్రి ద్వయలా
క్షాముద్ర లంటెనన నిం
దామూలాగ్రముగ ధాతు లమరంగంటే. 105

కం. సింగంబు లిందు మదమా
తంగంబుల వెంటనంటి తత్కుంభంబుల్
భంగంబుఁ జేయ రాలిన
రంగగు ముత్యములు గలవు రాసుల కొలఁదుల్. 106

చ. తెలినెల జాలచోటుల మదించి కురంగము లంత నంతమం
దలు గొని యుండువాని పెనునాభులు వ్రేలినఁ గ్రమ్మరిల్లుచున్
వలపులసొంపుచే నితరవాసన లెల్లను మించి జోకల
ప్పలగుచుఁ బచ్చి కస్తురి యపారముగాఁ గల దిన్నగంబునన్. 107

ఉ. సింగము లుండలేని గుహ సిద్ధులు లేని తటంబు మానికం
పుంగని లేని తిన్నె పరిపూర్ణముదంబులు లేని తావు ది
వ్యాంగన లీగి యాడని లతాయతగేహము చందనద్రు పం
క్తింగనుపట్ట నట్టివని, ధీనిధి ! యెయ్యెడఁ గల్గదిగ్గిరిన్. 108

తే. గీ. అని తదీయ విశేషంబు లర్థాభంగి
మంత్రి తనయుండు దెల్ప సామజముడిగ్గి
సైన్యయుతముగ వనవస్తు చయ సమగ్ర
మైన సమధారుణీ స్థలియందు విడిసి. 109

వ. యథోచితగతిం బ్రవర్తిల్లుచుండె నంత. 110

శా. ధీరారామ వసంత సంతత మదాంధీభూత విద్వాణ్మరు
త్పారంపర్య హికాంత కాంత తమ వాక్పద్మావధూటీ నటీ
శ్రీరంగత్స్వ నిశాంత శాంతనవమాతృస్ఫూర్తి కీర్తి ప్రభా
గౌరాశేష దిశాంత శాంత గుణసంఘస్తేమ భీమాగ్రజా ! 111

క. బుధ వినుతసుగుణ సముదయ
మధుశాత్రవదయ యశోర మాప్రియ నైర్మ
ల్య ధురీణ హృదయ సంగ్రా
మ ధనంజయ మహిత విజయ మానిత విజయా! 112

తరల. కదనశూర ముదిత ధీర ఘనవిహార మాధవ
ప్రదర హార శరతుషార రజిత నారవాహ పా
రద పటీర భుజగవార రమణిహార శారదా
సదన నారదసిత సారస ఘనసార సదృశా! 113

గద్య. ఇది శ్రీరామభద్ర కరుణా కటాక్ష వీక్షణ సమాసాదిత సరసకవితా వైచిత్రీపాత్ర తెనాలిరామకృష్ణ కవిరాజానుజ శ్రీగిరి కవిసార్వభౌమ పౌత్ర యభినవ రామకృష్ణ సత్కవిపుత్ర తిమ్మమాంబాగర్భ రత్నాకర రాకాకైరవమిత్ర కౌండిన్యగోత్ర పవిత్ర సకలసుకవి వినుత సాహిత్య విద్యా సమున్నిద్ర రామభద్రకవి ప్రణీతంబైన యిందుమతీపరిణయం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

# తృతీయాశ్వాసము

కం. శ్రీ సారస నేత్రా నా
యాసాదిత వితత శాశ్వతైశ్వర్యశ్రే
ణీ సారస్వతవిభవ
శ్రీ సాంద్రా పాలచూరి కృష్ణనరేంద్రా ! 1

వ. అవధరింపుము. 2

ఉ. చల్లని చప్పరాల సరసంబుగఁ బుప్పొడి రాల నందమౌ
పల్లవిత ద్రుకోటులను బచ్చని పచ్చికయున్న చోటులన్
మల్లము లౌ గుడారులును మంచి నికుంజము లున్నదారులన్
దెల్లమిగాఁ బథిశ్రమము దీర మలంగఁగ సర్వసైనికుల్. 3

సీ. ఏకరంగి గుడార్లఁ బోకరంగిమ్ములఁ
బొలుపొందు బలుసరాతులఁ బొసంగె
నవరంజి గట్టు గుట్టరిది యేయను[1] గొప్ప
చప్పరమ్ములు మించె డెప్పరముగఁ
బలుకఁ బాఱిన తేఁకు పలకల గదియించు
దొంతి మిద్దియలు బంధురతఁ బ్రబలెఁ
బ్రహరిగోడల తీరు వస లేదనుచు మీఱి
దిట్టలౌ బల్లాడదట్టు లమరెఁ

తే. గీ. ప్రతిభట కుటీర రథగజ ప్రచయకేతు
పట చటత్కార కింకిణీ భద్రనాద
సమధికోద్భట సద్భట తుములరవము
లంబరము నంటు నా శిఖరంబునందు. 4

సీ. హేషారవంబు బిట్టెగయంగఁ జవికెల
ఘోట్టాణములు దెచ్చి కట్టువారు
మాపాలె మిది యది మీపాలె మని దొరల్
చేరి రాఁ బేరెముల్ వారువారు[2]
గిరులు బొర్లిన యట్ల ఘీంకారములతోడఁ
గరులు వెన్వెంటరాఁ గదలువారు
కంటికల్లె దరింపఁగాఁ గుఠారములచే
సరకు సేయక తరుల్ నఱకువారు

---

1. యంతయు. 2. రాపారముల్ పారువారు.

తే. గీ. నగుచుఁ గేకలు వేయుచుఁ బొగడికొనుచుఁ
దుడుము లందంద మొరయింపఁ దుడుము[1] లగుచుఁ
గ్రమ్మఁగా నీటియలు వాఁడికైదువులను
జిమ్ముచుఁ జరించువారు రోసమ్ము లడర. 5

చ. తమతమ బంధులన్ హితుల దందడిఁగానక యెల్ల పాలెముల్
నెమకుచు వచ్చి చల్లనగు నీడలఁజేరుచు మీరు చూడరా
ప్రముఖులు వారలంచుఁ దమరాణువవారల వేఁడు వారలున్[2]
సముఖముఁ గాచువారునయి సర్వజనుల్ జెనయన్ హళాహళిన్. 6

ఉ. సాదులు పీతఘోటక విషాదులు వీధులు గట్టి యొండొరుల్
సాదరవృత్తి నప్పుడు దెసన్[3] సముజాకల డించి తెచ్చి సు
స్వాదు జలంబులందు నిడి సారెకుఁ గందము లప్పళింపుచున్
స్వేదము దీరమైఁ దడవి సేదలు దీర్చిరి వాజికోటికిన్. 7

శా. గంధేభంబులు మావటుల్[4] గొలిపినన్ గాఢత్వరన్ వచ్చియా
సింధుప్రేయసి వారిఁ జేరి నిరతిన్ జేకొట్టులన్ గ్రోలి ము
న్మంథానాచల మబ్ధిఁ ద్రిమ్మరుగతిన్ బల్మాఱు నొండొండ ద
ర్పాంధత్వంబున వర్తిలన్ దొణఁగె మార్గాయాసమున్ బాయుచున్. 8

ఉ. ఆతఱి నద్భుతంబుగ ననర్గళ దుస్సహభంగిఁ బర్వు వ
న్యేతర గంధ సింధురసమిద్ధమదస్ఫుట (దాన) గంధవ
ద్వాతము సూడుక్[5] కైవడిఁ బదంపడి తన్నెసరేఁపఁ[6] దత్తటీ
జాతలతావృతోరు తరుషండము వెల్వడి క్రోధలిప్తమై. 9

సీ. ఘనదాన లహరి కోత్కటములౌ కటములు
సెలయేర్లతోడి సానుల హసింప
ఫూత్కార ఘోరమై పొలుచు నిట్టకరంబు
పెనుజిల్వ రూపంబు చినుగు వఱుపఁ
బృథుల విక్షేపణాఖిలమౌ వాలంబు
కాలదండాకృతి నేలుకొనఁగ
దరిఁ గ్రుమ్ము మొనదేరు దంతకుంతమ్ములు
హీరాయుధ స్ఫూర్తి నేవగింప

---

1. మొరయింపుతుడుములగుచు. 2. చారులున్. 3. సోదరవృత్తి...దివన్.
4. మావుతుల్. 5. నూతు. 6. తన్నెసరంస.

తే. గీ. కర్ణతాళ ద్వయంబు తెక్కెల విధమున
నుండ నడతెంచు కాటుక కొండఁబోలె
భీతి హేతుక నిర్ఘాత పాతజాత
నాద మడరఁగ నొక్క వన్యద్విపంబు. 10

కం. పన్నిన సేనాగజములు
కన్నిచ్చలయురక యురకఁగాఁ బలుయోధల్
వెన్నిచ్చి తలఁగ నదిపై
కొన్నంగని తత్పటుత్వ కుంఠనపరుఁడై. 11

ఉ. అగ్గలికన్[1] గృహీతధనుఁడై విశిఖం బరి వోసి డాసి లో
బెగ్గిల కీక్షణమ్ములకు భీతిదమై తనుడాయవచ్చునా
దిగ్గజతుల్య దంతిఁ గనితెంపున వన్యకరిన్ వధింప రా
దెగ్గని దాని కుంభమున నించుక నాటఁగ నేసె నేసినన్. 12

కం. ఆకరి వరంబు వన్యగ
జాకారము విడిచి యద్భుతావహలీలన్
గాకుత్థ్స విశిఖముఖహతి
భీకర మగు శాపమెల్లఁ బ్రిదిలిన పిదపన్. 13

సీ. ననిచి నల్గడలఁ గమ్మని వాసనలు గుల్కు
లలిత మందార మాల్యములతోడ
నొలివోక[2] యొమ్మున నొయ్యారము గడించు
భవ్యగంధాను లేపనము తోడ
పన్నిచెంగట పండు వెన్నెలల్ వెదచల్లు
కమనీయ ధవళాంశుకములతోడ
మీఱి కన్నుంగవ మిఱుమిట్లు గొనఁజేయు
వరదివ్య భూషణోత్కరము తోడ
తే. గీ. ధగధగత్తప్త జాంబూనదమునఁ దేలి
డంబు నవరించు మణివిమానంబు తోడ
ననదృశంబైన శృంగారరసము తోడ
నుర్వరానాథు నెదుట గంధర్వుఁ డయ్యె. 14

1. అగ్గలిలన్. 2. నోలిదా.

కం. అవ్విధముగఁ గనుపట్టిన
యవ్వైమానికునిఁ జూచి యద్భుతముదముల్
ముప్పిరునఁ బెనచికొని లో
నువ్విళ్లూరంగఁ దెలియ నూహించుతఱిన్. 15

ఉ. పర్వినవేడ్కతో నతఁడు భక్తి విధేయత లుప్పతిల్లఁగా
నుర్వరఁజాగి మ్రొక్కి యను, నోనృప! యేఁ బ్రియదర్శనాఖ్యఁగం
ధర్వపతి ప్రియాత్మజుఁడ నన్నుఁ బ్రియంవదుఁ డండ్రు భూజనుల్
పూర్వ మహోన్నతిన్ మరలఁ బొందితి నేఁటికి నీకతంబునన్. 16

కం. నావుడుఁ బ్రియ మొనరఁగ నర
దేవభవుం డతని బ్రతినతిక్రియచే సం
భావించి యిట్టి దురవ
స్థావశగతి కేదియో కతంబని యడుగన్. 17

శా. ఆకర్ణింపుము సావధానముగ నీయద్రీంద్ర కూటంబునన్
లోకస్తుత్యతపః ప్రభావలసమానుండౌ మతంగర్షియ
స్తోకైకాగ్రమతి ప్రభావనియ తాత్ముండై ప్రవర్తిల్లనే
నేకాలంబునలేని దర్పమున నయ్యేకాంతికిం జేరువన్. 18

ఉ. అచ్చరపువ్వుఁబోండ్లు తనుహాస విలోకన చేష్టితంబులన్
దచ్చన లాడుచున్ శ్రుతి హితంబుగఁ బాడుచుఁ బొత్తుగూడుచున్
బచ్చనివింటివాని వెడమాయకు లోకువసేయుచుండఁగా
నిచ్చలవచ్చి వచ్చి కడునింపగు నొక్కకొలంకుఁ గాంచితిన్. 19

వ. కాంచి యమ్మహామునీంద్రు ననుష్ఠాన నిధానంబగు కొలంకుఁ గలంకం బొరయించుటక్రించుదనం బనుశంకవొడమక చిడిముడిపాటునం బాటలగంధీసమేతుండనై యాయాసఖేదస్వేదనోదనార్థంబు తటాకవరంబు సొచ్చి. 20

సీ. ఒక ఘనస్తనభార యుదుటుబల్గుబ్బలు
కుంభప్లవములుగాఁ గొంతసేపు
ఒక లతాయత బాహుయుగళ కేలుందోయి
వింతరజ్జువులుగాఁ గొంతసేపు
ఒక విశాలనితంబ యొరపైన పిఱుఁదులు
గుత్తపుఁ బుట్లుగాఁ గొంతసేపు
ఒక వరోరుద్వంద్వ యొరపారు నూరులు
గొనబు దోనులుగాఁగఁ గొంతసేపు

తే. గీ. నూదికొనియా[1] కొలంకెల్ల మోద మొనఁగ
నీఁది కడఁగంటిఁగాని యాయింతులందు
బద్ధమై పౌనరుక్త్య ప్రవృద్ధమైన
సాంద్రమోహాబ్ధి తెగనీఁ[2]దఁ జాలనైతి. 21

ఉ. ఏమని తెల్పుదున్ రవికులేశ్వర ః నిర్మలమైన యట్టి యా
తామరసాకరంబు వనితాజనతాంగ విశీర్ణమౌ హరి
ద్రామృగ నాభిసాంకవ మదస్ఫుట చందన చర్చయంటియెం
తో మలినత్వమొందె ఖలుతో నొనఁగూడు నకల్మషున్ బలెన్. 22

ఉ. అప్పుడు తన్మధువ్రత రథాంగ మరాళచయంబు బోంట్ల బ
ల్కొప్పుల యొప్పులన్ బటువుగుబ్బల గబ్బులఁబోక[3] జోకలన్
జొప్పడనోడి పాఱుచునసూయఁ[4] దపస్విపరేణ్యుతోడుతన్
జెప్పఁగఁ బోవులీల రొదసేయుచు నల్లడలందు[5] రేఁగినన్. 23

కం. ఆ కలకలంబు విని ముని
లోకాగ్రణి యటకువచ్చి లోలతరంగ
వ్యాకీర్ణ నిశాకజ్జల
సౌకర్యవిరహితమైన జలజాకరమున్. 24

వ. కాంచి నన్నుఁజేర రావించి యాగ్రహించి "జాల్మా ; మామకీనానూన స్నానపానానుష్ఠాన విధానంబులకు నిధానంబగు నీసరోవరంబున కిట్లి సౌకర్యంబు గావించుట యుచితంబె ? మత్తత్వంబున మత్తకాశినీ సహితుండవై యిట్లెగ్గుఁ జేసితివి గాన కాననంబున మత్తగజంబవై చరియింతు గాక" యని శాపంబిచ్చి ప్రార్థితుండై యనుగ్రహించి క్రమ్మఱ నమ్మహర్షి యిట్లనియె. 25

శా. లోకానీక వివిక్తకీర్తి ధనుఁడుల్లోక ప్రభావాఢ్యుఁడి
క్ష్వాకుక్ష్మాపకులోత్తముండు రఘురాజన్యాత్మజాతుం డజుం
డేకాలంబునఁజేరి యాశుగముచే నేయంగలాఁ డప్పుడే
నీకున్ శాపముదీఱునంచు ననియెన్ నేఁడట్టులయ్యెన్ నృపా ః 26

1. ముంచికొని యెదఁగొలనెల్ల. 2. నెగనీఁద. 3. కబ్బులుకాక. 4. పాఱిన యసూయ. 5. జిందు.

తే. గీ. ఇట్టి యుపకృతిఁ గావించినట్టి నీకు
నేతదుచిత ప్రతిక్రియ యెద్ది సేయఁ
జాలని యతండనైన నాశక్తి కొలఁది
మేలుఁ గావింతుఁ గైకొమ్ము మిత్రవంశ. 27

కం. ఆహవము దొరకు నీకు
ద్వాహానంతరము నందు వైరిజయశ్రీ
దోహల మిది గైకొను స
మ్మోహన శరమంత్రరాజమున్ నృపముఖ్యా ! 28

చ. అనవిని నర్మదానదికి నప్పుడపోయి యతండు వార్చియ
త్యనుపమభక్తి మీఱఁగఁ బ్రియంవదుచే నుపదేశమందెఁ దం
త్రనియమ పూర్వకంబుగనుదఙ్ముఖుఁడై రిపుకోట్ల నిద్రచే
మునుఁగఁగ ... ... ... ... 29

కం. ... ... ...
... ... ... ... విద్యా
ఖర్వత సమంత్రమున్[1] గాం
ధర్వాస్త్రమునట్లు వడసి దక్షతవెలయన్. 30

కం. అతనిన్ వీడ్కొనుచు యథో
చిత పరిపాటిన్ సమస్త సేనాయుతుఁడై
క్షితినాయక సుతరత్నము
కతిపయ గతులన్ విదర్భకటకముఁ జేరెన్. 31

కం. చటులగతి వచ్చి యటఁద
త్పుటభేదన నికట మహితభూమీభాగ
స్ఫుట సుమనః పటలకులో
త్కట శృంగార వనవాటికన్ నిలుచు తఱిన్. 32

సీ. పథికజన స్వాంత పాటన కుంతంబు
తతమదీకృత పరభృత శకుంత
మతి రమ్యకుసుమ వాసిత కకుబంతంబు
ప్రకటిత కామనీయకని శాంత
మానందయుత శుకమానితోద్యంతంబు
దేదీప్యమానాంశు దివసకాంత
మత్యంత సంవర్ధితాంభోజ కుంతమ్ము
మాలతీజాలక శ్రీలతాంత

1. త్వరమ మంత్రమున్.

తే. గీ. మామహిత మల్లికావల్లికామతల్లి
కాసమాన ప్రసూనాధివాస సహిత
వితతమధు సంగశిశిరతా విలస దలస[1]
చలనభస్వంత మంత వసంత మలరె. 33

కం. ఆ సమయంబున నిందుమ
తీసతి నగరోపకంఠ దీపిత వనరా
జీసూనావచి చీషా
వ్యాసంగా సన్నమాన సాంభోరుహయై. 34

చ. తళుకుఁ బసిండి వ్రాఁతజిగి దార్కొను చేలము గట్టి, రత్నపున్
గళుకు మిటారపుంబని చౌకాటపు సొమ్ములువెట్టి, కూర్మిపై
దలికయిదండ వట్టి నునుదంతపుఁ బావలుమెట్టి, యందముల్
గులుకుచువచ్చె నచ్చెలువ కోరిక లీరిక లెత్తుచుండఁగన్. 35

సీ. నెఱిముంగురుల రంగు నిగిడి యంతంతకు
మెండుగా గండుతుమ్మెదల నీనఁ
జకచకల్ దొరయించు చికిలిచూపుల యొప్పు
బలుబేడిసల మిట్టి పడఁగజేయఁ
దళుకు మిన్కులు గుల్కు తెలిదంత కాంతులు
మొల్లమొగ్గల వెదచల్లుచుండఁ
గలువ సంగడికాని చెలువమ్ముగల ముద్దు
నెమ్మోము జిగి కళల్ గ్రుమ్మరింప
తే. గీ. మిసిమినిగ్గుల నలరారు మేనికాంతి
బలుతెఱంగుల[2] మెఱుఁగులబారు దీర్ప
సొలపుఁజెయ్వు లొయ్యారముల్ గులుకరింప
వనజదళనేత్ర శృంగార వనముఁజేరి. 36

సీ. గొనబైన పదకాంతి[3] కుంకుమ పూతగా
వరరత్నకాంతి చిత్తరువుగాఁగ
గుత్తంపు నఖదీప్తి ముత్తెంపు ముగ్గుగాఁ
గనుడాలు నునుమేలుకట్లుగాఁగ
జిగినొప్పు కొప్పు కప్పగరు ధూపంబుగాఁ
గొమరుచూపులు తోరణములుగాఁగ
తళుకుఁ జెక్కుల నిగ్గు నిలువు టద్దములుగాఁ
గరరుచుల్ గెంపులరాలుగాఁగఁ

---

1. మధుసగని శిరతానిల సదచలసఖ? 2. మరుంగుల. 3. మదిమిన్క.

తే. గీ. దనరు తనరూప మహిమ యుద్యాన రమకుఁ
దగు గృహాలంకృతి యొనర్ప నిగుడు వేడ్కఁ
జెలులు తనచుట్టుఁగొల్వ నత్తలిరుఁబోఁడి
నటన దీపించు రాయంచనడఁ జరింప. 37

శా. కొప్పుల్ విచ్చి జడల్ ఘటించి జిలుగుం గ్రొంబట్టు చీరల్ ప్రియం
బొప్పంగాఁ బిరుచుట్లు చుట్టి మదిలో నుప్పొంగు మోదాబ్ధులన్
దెప్పల్ దేలుచుఁ జంటికోకముడు లెంతే గట్టిగాఁ గట్టి తా
రాపూఁబోఁడులు క్రొవ్విరుల్ జిదుము నూహన్‌జేరి రుద్యద్గతిన్. 38

సీ. చిలుకసారెకు ముద్దుఁ జిలుక నేరుపుమీఱి
పలుకన ప్పొదరొప్పఁ బాడియగునె
నిలుకడల్ మాని యింపొలుకఁ బాడెడు తేటి
నలుకతోఁదఱిమి పువ్వంటఁ దగునె
బలుకడాని మెఱుంగు బెళుకఁ గ్రొవ్విరులిచ్చె
చులుకఁగా సంపంగిఁ జూడఁదగునె
వెలుకబాఱుచును బెట్టలుకఁగా నయ్యంచ
పలుక[1] బిగ్గరఁబట్టి యలమఁదగునె

తే. గీ. కళుకు నునునిగ్గుఁ జెక్కులఁ దళుకులొత్తి
తొలఁకు చెమటల బడలిక జళుకు లేక
తిలకతరు వెక్కి ననకొఱకులుకఁ దగునె
కలికిజిగి నొప్పు వెన్నెలమొలకలార. 39

శా. నాతోడంగనఁజూడుమీ మగువ పున్నాగంబుపై నెక్కితాఁ
బ్రీతిం గంఠరవం బెలర్ప నతనుక్రీడన్ విజృంభించుటల్
చాతీ యుక్తమె ప్రౌఢగాన నది పున్నాగంబుపై నెక్కి దాఁ
బ్రీతిం గంఠరవం బెలర్ప నతనుక్రీడన్ విజృంభించుటల్. 40

శా. నారీరత్నము లొక్కమొల్లపొదరింటన్ గోరకంబుల్ దళం
బై రాణించఁగఁగాంచి యొక్క మొగిఁగోయం బూనికం జారుణ
శ్రీరంజిల్లు కరద్యుతిం గిసలయశ్రేణీగతిం దోచినన్
దారాశ్చర్యముఁ బొందుచున్ మగిడి రుద్యన్మౌగ్ధ్య మేపారఁగన్. 41

తే. గీ. చెలువ చిగురొత్తు గుజ్జుమావులు దనర్చు
తళుకునెల ఱాలపాదు లింపలరఁ గంటె
చైత్రునకు నెత్త వనలక్ష్మి సంఘటించు
వరపు టారతి వెండి పళ్లెరము లనఁగ. 42

1. కిలుక; పిలుక.

సీ. [1]పెనుదంట కినుగంట కనుఁగొంట మానుమ
ప్పొదరింట ననలంటఁ బోవలేదె
తెలిమొల్ల విరులెల్ల చెలిగిల్లఁ గంటినే
నదికల్ల యని కల్లలాడఁ జనునె
తలిరెంత వలదంత బలుపంత మింత నీ
వలకాంత చెలిమింతయైనఁ దలఁతె
చలపట్టి కిలకొట్టి చెలిదిట్టి ననఁగోసి
విడుమిట్టిదన మిట్టిపడఁగఁ జనునె
తే. గీ. ముదిత యిటురాకు చివురాకు చిదుమఁబోకు
కలహ మగుమీకు మాకు నం చలరుబోఁడు
లలరు నెమ్మది నలరు లందంద కోసి
రంద మింపొందఁగా మందమంద గతుల. 43

ఉ. బాలిక కంటె చూత మదె బాగను క్రొవ్విరి గుత్తి గుబ్బలన్
వ్రాలెడు నా[2] లతాంగి ననురాగిణి మచ్చిక మీఱఁ గూడుటన్
జాలఁ జెమర్చెనో యనఁదనర్చె శుకీదలిత స్రవద్ఫలో
ద్వేల రసప్రవాహముల వెల్లువ లల్లన ముంచి మించఁగన్. 44

శా. మాలూరస్తనియోర్తు పొన్నవిరి గొమ్మన్ గ్రొవ్విరుల్ గోయఁగా
లీలం బాలిక లెత్తి శాఖయది హోళింబట్టి మేలంపుఁ జం
దాలం దారు తొలంగి ప్రేలు నల కాంతంగాంచి యుయ్యాలొజం
పాలో యంచు వచించినవ్వి రపుడాత్మన్ వేడ్క లుప్పొంగఁగన్. 45

లయగ్రాహి. మల్లె విరిగుత్తులను మొల్లవిరులందొరఁగి వెల్లువగు తేనియలనుల్ల
మలరన్గో
ల్లలుగఁ ద్రావుచును క్రేళ్లరికి దాటుచును త్రుళ్లునళిబృందముల
నల్లలితరావో
త్ఫుల్ల గరుదావలులఁ బెల్లొదవు తెమ్మెరలు చల్లగఁదను
శ్రమము లెల్ల నడఁపన్రా
గిల్లుచను గ్రొవ్విరులు గిల్లుచను బుప్పొడులు చల్లుచను నబ్జ
ముఖులుల్లసిలి యంతన్. 46

---

1. పెనుదంటి నినుగంటి కనుఁగొంటి మామన పొదరింట నీవెంటఁ బోవలేదె.
2. వ్రాలుత బాలతాంగి.

రగడ. చెలువ చెలువ మెనయ నీవు చేతనంట ననిచె మావి
యలని సొలసి పాటఁబాడ నలరెఁ బ్రేంకణంబు తీవి
భామ ప్రేమ నీవు పలుకఁ బ్రబలెఁ గోఁగు విరులునెన్న
నేమురా ముదంబు మీఱ నిపుడు నవ్వ ననిచెఁబొన్న
సారెసారె యెలమి కుసుమసమితి నమరు కురువకములు
చేరినారి నీవుకాంచ చెలఁగెఁ దిలక జాలకములు
నీవు తావు లలర నూర్చ నెగడె విరుల సింధువార
మావనావళుల నదల్చ నమరె విరుల కనక మౌర
నారిమీరి యుమియునపుడ ననిచెఁబొగడ లలరి చాల
నారుదూఱుగాఁగఁ దన్ననల యశోక మలరె విరుల
తరళ తరల సద్రసాల తరులఁ బెనఁగు తీవె చాలు
విరుల మరల నీక నేర్పు వెలయఁగోసి తారదోలు
విమల కమల సరసి తటుల [1]విరుల తరులనుందు మేని
శ్రమము శమమునొంద కుందరదన మాఱుమాటమాని
కుంద మంద మనుచుఁ బోకు కుసుమగంధి తేటిగుంపు
లందుఁ గ్రందుకొనుచు నిన్ను నంటనీక సొంపుఁ బెంపు
మాటిమాటి కిటులు బొండు మల్లెలకును మాటలేల
జోటిమేటి యామె మే[2]ను చుక్కరనినఁ దాళఁజాల
చాల జాలకముల గములు చాల కమల జాలకముల
పాళిఁజాలి వెదకెదేల బాల యాసరోవరముల
నింత వంతయేల కొమ్మయిటుఁ గదల్చికొనుము పూలు
కాంత యంత వలదవి వలిగాడ్పు వలన నిపుడె రాలు
తుంట వింటఁ దనరుదంట దొరకు బాఁకు మొగలిరేకు
నంట బంటుతనమువలవ దతివ వింటివా వరాకు
వారిజారివదన యుచటి వారి కలువ శంబరారి
నారిజాటి దళము లెడలినది హరింపఁదగదు చేరి
కలికి పలికి చిదుమలేక కలిక యలికచల్ చెలి హసింపఁ
నలికి నలికి తిరిగివచ్చి తారు దూఱుగాఁ దలంపఁ
గులుకు కులుకు నడలవచ్చెఁ గొమ్మతరులవిరులు గోయ
జళుకు పలుకులేల నవురునవురగుఁగదవానిడాయ
కీరవారశాలి కావి కీరవములుకడు చెలంగఁ

1. విటుల తటుల. 2. లేను.

చారు మారుతముల గముల చలువ వాసనలు మలంగ
కలసి మెలసి కలరవములు కలరవములు సరస మరయ
విలసదలస గతుల హంసవితతి పొదలయందు మొరయ
కొఱలు కుసుమపుంజ మచటఁ గోయరాక కొదకి వెతకి
తిరిగెదేల కోమలాంగి తెరువులే కయనుచు వలికి
ఎనిసి కుసుమ హరణ నిరతి నెదలఁదనిసి విడిచిచింత
మనసి జాస్త్రములన చేయమరునిపూజ నింతులంత. 47

సీ. స్ఫుటదున్నవాంబు జోత్కట మధూలీ ముహు
ర్ముహూరేధి తాంబు సంపూరితంబు
అట దురుద్విజగరుత్పటల జానిలధూత
సుమరజస్స్రగిత భాసురతటంబు
జటిలతుంగ తరంగ చటులఘుమం ఘుమో
ద్భటనినాద వ్యాప్త పరిసరంబు
పటునిజత్రోటికా పుటభిన్న బిసభక్ష
ణాసక్త చర సరసాన్వితంబు
తే. గీ. మధుర మధుపాన సంతత మత్తచిత్త
వృత్త మధుకర మధుకరీ చిత్తజాత
కేళికా కేళికా శాలికాలలామ
కలిత జలరుహ విసరంబు ఘనసరంబు. 48

వ. చూచి యప్పుడు. 49

కం. రాజీవ వికచకైరవ
రాజీ వసతిస్ఫురచ్ఛ రద్బంభరవా
రాజీవమైన సరసిన్
రాజీవాననలు దరిసి రాజితలీలన్. 50

సీ. లలివిరుల్ రాలిన లతలకై వడి మేను
లలరఁగా భూషణావళు లెడల్చి
యిసుకదిబ్బల మంచు లెసఁగినఁ గతికటి
వలనుగా వలిపె పావడలు గట్టి
గవుసెనల్ దివియు చొక్కపు వీణకాయల
క్రతిగ గుబ్బ లెలర్ప రవికలూడ్చి
తమ్ముల నడుచక్కిఁ దనరు తేఁటుల లీలఁ
గరముల నీలశృంగములు పూని

తే. గీ. వసుధఁ జరియించు వేల్పు జవ్వనులనంగ
లీల విడివడ్డ కంతుతేజీలనంగ
గరువ మందంబు సొగసు ముప్పిరికొనంగ
నంగనలు వారివిహరణాయత్త లగుచు. 51

శా. బారుల్ దీరి లతాంగు లొండొరు కరాబ్జంబుల్ కరంబూఁతలై
మీఱన్బట్టి భయంబుదట్టి కడుగంభీరస్థితిన్ బొల్చుత
న్నీరం బొయ్యనచొచ్చి హెచ్చి చనుబంటిన్ దంటలై నిల్చి దు
ర్వార ప్రక్రియ నీఁదులాడుచును తేవన్ వేడ్కఁ లుప్పొంగఁగన్. 52

క. తమ్ముల నేయుచుఁ జెలి[1]మొ
త్తమ్ములఁ బాయుచు సుభాషితమ్ములఁదగు పం
తమ్ముల డాయుచు నెమ్మదిఁ
గొమ్మలు విహరించి రపు డకుంఠతలీలన్ 53

సీ. తన బాహువులఁబోల దనులీల బిసకాండ
మగలించె మత్తేభయాన యొకతె
తన కన్నులను బోలదను రీతి నెత్తమ్మి
నలయించెఁ జంద్రికాహాస యొకతె
తన నెన్నడలఁ బోల దనుమాడ్కి రాయంచఁ
గదలించె జీమూతకబరి యొకతె
తన చన్నుఁగవఁ బోల దనుభంగిఁ జక్రవా
కాలిఁబోఁద్రోలె రాజాస్య యొకతె

తే. గీ. తనను చూపులఁబోల లేవనెడు పగిదిఁ
గదిమెఁ దేఁటులఁ జంపకగంధి యొకతె
వేడుకలఁగూడి సరసంబు లాడికొనుచుఁ
జేడె లతిమోదమున నీఁదులాడువేళ. 54

మ. జలజాతాక్షి యొకర్తు తన్ప్రియవయస్యల్ కైరవాంభోరుహం
బుల వేయం బెఱకేలఁదేల్చి తనచూపుల్ వ్రాలుచోట్లెల్ల ను
త్పల విభ్రాంతి నొనంగ నందమగుడం దావైచు బుద్ధిన్ కరం
బెలమిం జేరిచి రిత్తయైనఁ బరచెన్ హేలావతుల్ నవ్వఁగన్. 55

శా. పంకేజాత ముఖీతనూనిబిడ దీవ్యద్గంధ కస్తూరికా
పంక శ్రీమిళితాంబు పూరములఁ గన్పట్టెన్ గొలంకెంతయున్
శంకం బై సురనిమ్నగా రవిసుతా పుణ్యాంబు సంగక్రియా
శంకం జేయుచు నద్వితీయ విలస త్సౌరభ్య ధౌరేయమై. 56

1. జెల.

కం. వనజాక్షి యొకతె నిబ్బర
మున నీఁదన్ వేణివ్రాలిచె ముఖచంద్రుఁడు దా
మునుకొనిన భీతిఁబరవఁగ
కినుకన్ వెనుకొనిన సైంహికేయుని మాడ్కిన్. 57

ఉ. నాళయుతంబుగాఁగ నలినం బొకజవ్వని పెల్లగించి కెం
గేల ధరించి వేడ్కఁ దమకించుచు నెత్తుటయొప్పె నబ్జధా
రాళ నిరూఢికిన్ నిజకరద్యుతికిన్ బిసకాంతికిన్ భుజ
శ్రీలకుఁ దారతమ్యమల చేడెల వేఁడఁదలంచెనో యనన్. 58

లయగ్రాహి. రంగదురు భంగముల నంగతిఁ గలంగకమె
లంగిరి లతాంగులు వడిం గమలతుంగా
భంగుర కుడుంగముల చెంగటఁ జెలంగెడుర
ధాంగముల రంగము లభంగరుతి పొంగన్
నింగి కరుణన్ గొలని రంగు దరుగం గునువ
పుంగమి వెలుంగు లుడుగం గడు నడంగన్
బంగరు బెడంగడరు నంగలత లంగజుమె
ఱుంగుటని రంగు లొరయన్ గళ లెసంగన్. 59

సీ. మెఱుఁగు ముంగురుల తుమ్మెదల దిమ్మనదల్చి
కలికి కన్నుల బేడిసలఁ దెమల్చి
ముద్దు నెమ్మోము గోములఁ దామరలఁగెల్చి
భుజముల బిసకాండములు దెరల్చి
తళుకు గుబ్బల జక్కవల టెక్కు విదలించి
యారుచే శైవాల మదటడంచి
వళులపెంపునఁ దరంగలసొంపు లెడలించి
బెళుకునెన్నడల నంచల జయించి
తే. గీ. సరసి శృంగార మఖిలంబు సరసి యొరసి
మెరసి నిరసించి యల్లన మెఱుఁగుబోండ్లు
జలవిహారంబు చాలింపఁ దలఁచి నిలిచి
చెలువ లందఱు నందంద చేరఁబిలిచి. 60

కం. జలదేవతల తెఱంగున
జలజల మేఘముల పోల్కి చక్రచయంబుల్
జిలుకం గంకణములు చా
నలు కంకణకింకిణీ ఝణత్కారములన్. 61

ఉ. తీరముఁ జేరియందఱు నుదీర్ఘతమై తడివల్వె పావడల్
ధారుణివైచి యొండొరు నితంబకుచోరు నఖాంకపాళికన్
గోరికఁజూచి కేకిసలుగొట్టుచు తిట్టుచు నొట్లు పెట్టుచున్
చీరలు తాఱుమాఱులుగసిగ్గునఁ గట్టుచుఁ గేలిఁ బెట్టుచున్. 62

సీ. ఉదయరాగముగట్టు మొయ్యారి నీలిపా
వడమీఁద మేదుర వర్ణముగను
చలువఁగట్టుము నీవు సమదకోకిలవాణి
చెంగావి పావడజిగి దొలంకఁ
జిత్రముల్గట్టుఁడు చెలులు మీరందఱు
నెల మాదళపుఁ బావడలకు నుద్ది
మొలక పూవన్నెదెమ్ము చకోరలోచన
హాళిఁది పావడ మీఁది కదియలెస్స
తే. గీ. నెఱికలుమ్మెత పూవన నెరయవలదె
యబల పావడయేల హైమాంబరమున
కిదిగొ తొడుగుము రవికెనే నియ్యవలెనె
యనుచు వలువలుగట్టి రవ్వనజముఖులు. 63

కం. తిలకంబులు ముకురంబులుఁ
దిలకింపుచు దిద్ది పసిఁడితీవెలనగు మే
నుల నిండ నలఁది ఘుమ్మను
కలపంబులు ప్రసవకలితకబరీ భరలై. 64

ఉ. సొమ్ములు లీలఁదాల్చి పడుచు ల్కపురంపువిడెంబు లియ్యఁగాఁ
గొమ్మలు నవ్వుచున్ వలపుఁ గొమ్మలనం జెలువొంద వారిలో
సొమ్ములకెల్ల సొమ్మగుచు నూరెలమించి కడానిమేనిడాల్
గ్రమ్మఁ జెలంగె నిందుమతి కమ్మనిగేఁదఁగి రేకుకైవడిన్. 65

ఉ. అప్పుడు తద్వనాంతని కటాంచిత కుంజకుటీర సీమ డా
లుప్పతిలన్ దుషారకిరణోపల భాగవరాగళయ్య మే
యొప్పుగఁజేర్చి మంత్రిసుతుఁడూఱటగాఁగ విదర్భరాట్పురిన్
గప్పిన భూపబృందముల క్రందు స్వయంవర సంభ్రమంబులన్. 66

తే. గీ. చారు లెఱిఁగింప విన్నట్టి సరణి నొకఁడు
విన్నపము సేయుచుండ నవ్వేళఁజెలుల
కలకలమ్ములు విని తేరఁగానిదేమొ
యనుచు నజరాజు గజరాజ మనఁగ వెడలి. 67

శా. చూడన్ ఘల్లన నందియల్ మొరయ నెచ్చోనిండి పూఁదీవెచాల్
తోడన్ మాదిరియౌ తనూలతల నింతుల్ చెంత వర్తింపఁగా
నీడన్ నీడ తటిల్లతల్ మెలఁగునే యెవ్వారొ వీరచ్చరల్
వ్రీడన్ దాఁగెదరంచు వేగఁజని తావేర్వేఱ వీక్షింపఁగన్. 68

చ. పసిడి శలాకబోఁటియగు బాగున రత్నపుబొమ్మ వైఖరిన్
బ్రసవశరాసు మౌర్విఁగను పట్టెడు కల్వలకోరి లీలనా
బిసరుహపాణి యిందుమతి బింకపుఁ జన్నులమీఁది హారముల్
పొసఁగి పొసంగ కట్టునిటుఁ బొర్లుచు రానెడసందు గామినిన్. 69

కం. తత్తరమునఁ బయ్యెద చెఱ
గత్తఱి సవరించికొనుచు నక్కయిదేమో
చిత్తజుఁడువచ్చె నిచటికి
హత్తుగఁ బెఱవారు జేర నర్హత గలదే. 70

చ. పదపద మంచు నెచ్చెలి నృపాలునిఁ గ్రమ్మఱిచూచె నంతలోఁ
గదిసి ధరాతలేంద్రుఁడును గాంక్షసెలంగ లతాంగిఁజూచె ని
ట్లదన సమానురాగరస మత్తులనింకి కటాక్ష వీథులన్
బొదలఁగఁ జూచు చూపులవె పో గుదిగొన్న మనోజబాణముల్. 71

ఉ. అత్తఱిఁ జిత్తజాతుఁడపురా యని లెమ్మని వాజినూకిదా
మత్త మరాళయాన నల మానవనాథ కులావతంసమున్
జిత్తయుగంబు నొక్కపరిఁ జింపుక పారననేక బాణముల్
కుత్తుకబంటి కోపమునఁగో యని యార్చుచు నేసెఁ గాసిగన్. 72

కం. ఆలీల మదనుఁ డేయఁగ
గోలయు జవరాలు రాచకూఁతురు నగు న
బ్బాలారత్న మ్ముపవన
సాలావళిఁ జనుచు నిల్వసాగిన నచటన్. 73

సీ. అంతట విరిబోఁటు లక్కయిదేమి నీ
బిగువెల్ల మెల్లనె పిరిది కరిగె
మనసు నచ్చట నిల్చు మాడ్కిఁ గన్పట్టెదు
మేలు పరాధీనురాల వయితి
మరుమాట వల్కపు మామాట లాలించి
మరుమాట చాలించు మతమె కాని
యెల్లి స్వయంవర మిచ్చ వచ్చిన యేని
వరియింపరాదె యావసుమతీశు

తే. గీ. ననుచు దంతపుఁ బల్లకి నబల నునిచి
పురికిఁ దోడ్కొని పోయి రప్పుడు విభుండు
మోదభేదమ్ము లినుమడి ముమ్మడులుగ
మగువ మరలిన మార్గంబె మరుగఁ జూడ్కి. 74

కం. మరలింపలేక నిల్వఁగ
సరగున వినవచ్చె మరుని జ్యానినదంబుల్
తిరిపుఁగొని మొకరి తేటులు
విరువీకులు సేయసాగెఁ బ్రొఘురావములన్. 75

చ. మసలక వైళ మచ్చటను మంత్రి మదేభము నంకు శాహతిన్
వెస మరలించు బాగున నవీన సుధారస గుంభనంబులై
పొసఁగు ప్రమోద వాక్యముల భూపనయైక సుభాషితమ్ములన్
రసిక శిఖావతంస మగు రాకొమరున్ మరలించె వేడుకన్. 76

ఉ. ఈనరణిన్ వితాకుపడ నేటికి బోఁటిని జూచి యక్కటా
నీ సుకుమార రూపమును నీ నవయౌవనితా విలాసమున్
నీ సరసోక్తి చాతురియు నీ నిడువాల్గను దోయి సోయగం
బేసుదతిన్ భ్రమింప దవి యెల్లను జూచెదు జెపె భూవరా! 77

ఉ. ఆలలితాంగి యాకిసలయాధర యాస మదేభయాన యా
నీల ఘనాఘనోపమ వినీలంకచప్రచయాహివేణి నిన్
బాల వరించు నెంచదొక పార్థివనందను నందనాగ ధా
రాళ లతాంతసారమున రంజిలు తేఁటి ధరిత్రిఁ జేరునే. 78

చ. అని యిటు లూరడింప విభుఁ డప్పుని జవ్వని పై విరాళిలోఁ
గొనకొనియుండ దుండగపుఁగోయిల కోయని వెంటనంటఁగాఁ
జెనకఁగఁ గమ్మఁ దెమ్మెరలు చిల్కలు నల్కలు గ్రమ్మనెమ్మిదో
కొని శిబిరంబుఁ జేర్ప నృపకుంజరుఁ డున్నతి నుండు సంతటన్. 79

శా. ఆవృత్తాంతము చారసంఘము విదర్భాధీశుతోఁ దెల్పనెం
తో వేడ్కన్ జతురంగ సైన్యసహిత బంధుశ్రేణితో వచ్చితే
భావిస్ఫూర్తి జితాబ్జశాయకు నజక్ష్మాకాంతుఁ దో తెచ్చిర
మ్యావాసంబున నుండఁబంప నతఁ డుద్యత్ప్రాభవం బొప్పఁగన్. 80

మ. మరుదాలోకన సౌఖ్యకృన్నటన రంభా భాసిత ప్రాంగణో
ర్వరమై మోహన సత్కళాంకమయి దీవ్యచ్చిత్రరేఖాంకమై
భరితామోదర సోదయార్ద్రి సుమనోబాహుళ్య సంపన్నమై
యరయంగాఁ ద్రిదివంబుఁ బోలు నుపకార్యాద్వారవేది స్థలిన్. 81

మాలిని. నిలిచి సకలసేనానీకమున్ జోక మీఱన్
వలయు నెడల డించన్ వాహినీ నాథకోటిన్
బలువిడి జనుఁ డంచున్ బంచి పంకచాస్త్రరేఖో
జ్జ్వలుఁ డతఁ డుడిగంపున్ వామనేత్రలు భజింపన్ 82

వ. చని యుభయ పార్శ్వస్తంభ రంభాస్తంభాగ్ర తిర్య క్స్యందానిత మకరత చ్ఛాయాదాయాద కోమలపలాశ మాలికావేల్లిత ద్వారో దారంబును, ఘనసార గంధసార ప్రసవసార సితనీహార వారిపూర పరిషేచనరంగ త్ప్రాంగణంబును, నిస్తుల కస్తూరి కాకర్దమ గోముఖాభి రామసీమా సంసక్తముక్తామయ రంగవల్లికా సల్లలితంబును, విచిత్ర నేత్ర పట వితానోత్తాన మానిత కాయమ్మాన విరాజమానంబును, జాలాంతరాళ నిర్యత్కాలాగరు ధూపవాసనాటోప దీపితంబును, సముద్దామ వాసనాభి రామాలంకృతంబును నగు తద్భవనాంతరంబు సొచ్చి యథోచితగతిం బ్రవర్తిల్లుచుండె నంత. 83

కం. పెక్కు బలంబులు గొల్వఁగ
గ్రక్కున నేతెంచి యుచితగతి విడుదులలోఁ
దక్కిన దేశాధీశులు
నక్కడ నక్కడ వసించి రతిమోదమునన్. 84

చ. ఉదయముఁ జెందు టాదిగ వసూత్కర మెల్ల నతీతసత్త్వమై
కుదురుగఁ బద్మినీతతులకున్ హితమై చనె నంతఁ బైకొనెన్
ముదిమి యటంచు ముక్తిఁగనఁ బూనెనొనాఁగ విరక్తు భంగిఁదాఁ
గదిసెఁ గషాయితాం శుకవికస్వరుఁడై రవియంతశైలమున్. 85

కం. విపులాస్త రాహు వొయ్యన
కుపిత ... ... ... ... ... ... 86

చ. ... ... ... ... ... ... ...
... యోవిజృంభితగతిన్ తెలివేదుచు కాలశక్తిక
గ్గపుయినఁ జూడఁ జాల కలి కజ్జల రూషితనేత్ర బిందువుల్
గ్రమమున రాలఁగా నలరు గన్నులు మోడిచెఁ బద్మినీతతుల్. 87

కం. ఇనుఁ డత్యుత్కూట తేజం
బునఁ దనరి ఘనానురాగమునఁ దనుఁ జేరన్
జనిన పరదిశాంగన దా
ల్చిన నీరాజనమునాఁ బొలిచె సాంధ్యరుచుల్. 88

సీ. నెమ్మిమై వెన్నాడి నిజనాథుఁ బాయఁజా
లక యేగు పద్మినీ లక్ష్మి యనఁగ
నరుఁడప్పుడు విష్ణుఁడౌట నాతనిఁ దాల్పఁ
జను సుపర్ణునిమేని చాయ యనఁగ
నినదత్త రశ్మిఁ గైకొని పూర్ణతేజుఁడై
క్రాలు వైశ్వానరు డాలనంగ
నపరాహ్ణహమునఁ గ్రుంకి యతులాస్తశిఖరిపై
నారవైచిన కావిచీరలనఁగ
తే. గీ. ఘనపద స్వర్ణకారక కల్పితైక
కమలబాంధవ రత్నకంకణ కరాభి
రంజితతరంగిణీ విభు ప్రభుసమర్పి
తోరు కౌసుంభపట మన నొప్పె సంధ్య. 89

తే. గీ. ఉరుతరోర్వీధర గుహాళి నుండి జాటి
చేరువల నున్న వనములఁ దారి తారి
మెండుకొను పశుఖుర ధూలినండఁ గొనుచుఁ
జేరెఁ ఖురములఁ జీఁకటుల్ చోరులనఁగ. 90

సీ. పుణ్యజన వ్రాతముల పెంపు దరుగంగ
సారెకుఁ దీవ్ర తేజంబు నెఱపి
చెలువేది కువలయం బలముడిల్లి తలంకఁ
దన మహాభ్యుదయ వర్తనలు చూపి
నరవిమై పద్మినీ సంగమంబనురక్తి
వాటిల్లఁగా బట్టవగ లొనర్చి
ఘనతమస్తోమ మొక్కూట గొందులను నిల్చి
యొదిగి గూఢక్రియ నుండఁజేసి
తే. గీ. మిగుల నుగ్రప్రభుండన మెలఁగి మిహిరుఁ
డతులతర తేజ మఱి యధోగతిని బడఁగ
నతని యపకీర్తి సందోహ మఖిల దిశలఁ
గప్పెనాఁ గప్పె గాఢాంధకార సమితి. 91

సీ. కవవాసి కాఁక పెక్కువ జక్కవలు వేఁగె
మృగకదంబము తృష్ణ తగులునీఁగెఁ
బరువ సంధ్యారాగ గరిమ నెంతయునేఁగెఁ
దెరలి దిఙ్ముఖములు తెలివి వీఁగె
ఘూకభీతికిఁ గాక కాకలోకము డాఁగె
నఖిలపక్షులు కులాయముల నీఁగె
నళులు ఖావిఫలేచ్ఛఁ గలువ గుంపుల మూఁగె
రవికాంతశిలల బీరంబులోఁగె
తే. గీ. వెస నిరులగుంపు లెంతయు విఱ్ఱవీఁగె
గంతుఁ డోయింత సేవంపగముల నాఁగె
మానినీ మానవంతుల మనసు మాఁగెఁ
గ్రమ్మజారుల విపణంబు చిమ్మిరేఁగె. 92

తే. గీ. సమయవర్షా దినంబు భాస్వరత నడర
పొడము మేఘంపు గుంపులై పొలిచె నిరులు
గగనతలమున నయ్యెడంగలయ మెలఁగు
సురుచిర బలాకలో యనఁ జుక్కలమరె. 93

చ. సమయపు మాలికుండు పటు చాతురి విన్నను [1]మొల్లతోఁటపై
నమరఁగ నంధకార మను [2]నారిక పూల్వి దలంచి సాంధ్య రా
గమను శిఖిన్ దగుల్ప నతిగాఢముగా ననలెత్తి పూలమొ
త్తములు సెలంగెనా నపుడు దట్టముగాఁ గనుపట్టెఁ దారకల్. 94

చ. కలువలు కొప్పునం దురిమి కమ్మని కస్తురి పూయ నిచ్చినన్
వలువలు గట్టఁగాఁ బనిచినన్ గయిసేయఁగ నిచ్చి దూతికల్
చెలువులు నిల్చు నిక్కువలు చెప్పఁగ నెమ్మది నిట్టి చీఁకటిన్
దొలఁగఁగఁరాని త్రోవలనె తోడ్కొని పోదురు జారకాంతలన్. 95

చ. అలికులవేణి యొక్కతె సమాదృతిచే మునువేఁడి కొన్న యా
చెలువుని రోయుచున్ మగనిచెల్వము రోయుచు వచ్చువేళఁదాఁ
బిలిచి యొకండు గూడె మును బిల్చినవాఁడును వచ్చువానినె
చ్చెలిఁ గలసెన్ విటుండొకఁడు చెల్లుర మీకని నవ్వ నవ్వలన్. 96

ఉ. దూతి యొకర్తు వల్లభుఁడు దూరుచురా నెదురేఁగి చూచి తా
నాతనిఁ గాతరత్వమున నట్టిటుఁజూచుచు వచ్చు నెచ్చెలిన్.
జూతము దీని చందమని చోరుని యట్లు దలంచి నిల్పినన్.
మాతనుఁ జీరమై మఱచి మార్గమునన్ మఱియోర్తుఁ దాఁగనున్. 97

1. మల్లి. 2. నారికి పూర్వ.

మ. తమ సంకేత గృహమ్ములన్ విటవిటుల్ దట్టంబుగా నీలవ
స్త్రము లాఖండల రత్నహారము లుదారంబైన కస్తూరియున్
సమరాగమ్ముల లీలఁ దాల్చుచు యదృచ్ఛన్గూడి క్రీడించిరీ
తమ మాకల్పముసేయుమంచు నపుడా దైత్యారిఁ గీర్తింపుచున్. 98

వ. అంత. 99

కం. కళలును జక్కఁదనంబును
గలబిడ్డఁడు చేరరాఁగఁ గని నెయ్యమునన్
గలశాంబుధి మిన్నందెన్
దిలకించి యనంగఁ దూర్పుదెస దీపించెన్. 100

తే. గీ. కలశపాథోధి వీచికాకాంత వలనఁ
బూర్వదిగ్ధాత్రి కనుపింపఁ బొడవుఁగెంపు
మావి యూడంగ దన్ని నిర్మల కళావి
శాలుఁడై చాలఁ గనుపట్టెఁ బాలపాప. 101

సీ. దండిలోకములపై దండెత్తి చనుదెంచు
శంబరాంతకుసితచ్ఛత్ర మనఁగ
గాఢతమోగజాక్రాంతికై కరనఖ
రాంకమై నిగుడు హర్యక్ష మనఁగ
వేర్వేర పాలిచ్చి వేల్పుల యాఁకలి
దీర్పనేర్చిన కామధేను వనఁగ
సమయార్చకుఁడు హిమజలమున విష్ణుప
దం బోలలార్చు చిందంబనంగ
తే. గీ. నలరె వినుత్రోవ వెన్నుని యనుఁగు బావ
కలువ చెలికాఁడు తళ్కు చుక్కలకుఱేఁడు
నందములకుప్ప వెనుమన్కి మంచులప్ప
జనదృగంభోజ మిహిరుండు చంపురుండు. 102

తే. గీ. కలువ చెలికాని యురము పేశలముగానఁ
గఠినతర రోహిణీస్తన ఘట్టనమున
కమలి నానాఁట నటకాయ గాచెననఁగ
డంబు నడరించెఁ గందుబింబంబునందు. 103

ఉ. తారకకాంతి నెంతయు నుదారతమంబులు గొందిఁ దూర జా
కోరకరాజి మీఱ నలికోటికిమోదముతీఱ జారిణీ
వారము లిండ్లఁ జేరఁగలువన్ భ్రమరంబులు గోరఁ జంద్రికా
క్షీరధివారి నుల్లసిలె శీతకరుండు నభోంతరంబునన్. 104

చ. తళుకు మెఱుంగు ముత్తియపుదండలు నిండిన లీలఁ గ్రపుం
బలుకులు రాశిఁజేయు గరిమన్ మగఱాల్వెద చల్లురీతి నం
చలు పదువున్న తేవతెలి జల్లులు గట్టిన దారి వండువె
న్నెల ద్రుహిణాండ భాండమున నిండె నఖండ విచండిలద్యుతిన్. 105

శా. ఆలీలన్ రకమైన వెన్నెలల నొయ్యారుల్ ప్రియుల్ గూడి యా
ప్రోలన్ రంజిల మారుఁడల్గి యపుడాభోజాత్మజన్ హాలి వా
హ్యాళిన్ మీరినసేన డీకొలిపి ప్రత్యాలీఢ పాదస్థుఁడై
కే లెట్లాడెనొ యేఁదు ముండ్లక్రియఁదాఁ గీలించెఁ బూతూపులన్. 106

చ. మరుఁడటులేయ డీలుపడి మానిని దానరమోడ్పు చూపుతోఁ
బొరిఁబొరిఁగ్రమ్ము నూర్పుగమి పొంకముతో జిగిఁజిట్లు మోవితోఁ
దొరఁగెడు బాష్ప పూరములతోఁ దలయూచుచు నవ్వుచుం గరాం
బురుహముఁ జేర్చి చెక్కిటను బొట్టనవ్రేల ధరిత్రి వ్రాయుచున్. 107

సీ. మది నున్నవిభుఁజూచి మనవి యంచును మ్రొక్కు
నాలకించును మాటలాడె ననుచు
మాటి కువ్విళులూరు మధురాధరమునకు
నాలింగనము సేయ నాసఁజేయుఁ
బిలుచు దీనాలాపములనిందు రమ్మని
తహతహఁ బట్టంగఁదానె లేచుఁ
గడఁకఁ బోపొమ్మని గద్దించు నకియల
నొయ్యన బాగమ్ము లియ్యఁబోవు
తే. గీ. సెజ్జఁగూర్చుండ నిడుకొనుఁ జిక్కెననుచుఁ
దియ్య మెట్టిదొ కేల్వట్టి తియ్యఁజూచుఁ
జేతి కగపడకున్న నా చిన్నెలుడిగి
కలయొ మరుమాయయో యని కలవరించు. 108

కం. ఈలీల మరుని బారికి
బాలారత్నంబు దగిలి భ్రమల నటింపన్
జాలి విరాళియుఁదూకొన
నా లలిచెలులడలు మానసాంభోరుహలై. 109

ఉ. అమ్మకచెల్ల హల్లక శరాగ్ని భరమ్మునఁ గ్రమ్మ తీవ్రతా
పమ్మ మనమ్ము పెట్టు గలఁపన్ నిలుపోవక నెమ్మిఁ దూలి యీ
కొమ్మ వియోగవేదనలఁ గుందుచు నుండఁగఁ జూచుటెట్లు రా
రమ్మ రయమ్మునంబొదువ రమ్మయటంచుఁజెలుల్ భయమ్మునన్. 110

ఉ. శీతల కృత్యముల్ కడఁకఁ జేయక యిట్టులుపేక్షఁ ద్రోచినన్
జాతురియేయగున్నడి నిజమ్ముగ నల్గురిలోన బోంట్ల చే
నో తరలాక్షులారయని యొండొరు ప్రోడలుగూడి యొద్దికై
జాతరఁజేసి మన్మధ వసంత సుధాంశులకెల్ల మ్రొక్కుచున్. 111

ఉ. గొజ్జఁగి నీటి కాలువలకున్ నడు చక్కని గుజ్జు మావికిన్
బజ్జ నలర్చు మల్లియల పాదములన్విడరాని తీవియల్
సెజ్జగరాల్చు పుప్పొడులఁ జెందిన చంద్రశిలా తలంబుపైఁ
బుజ్జవ మొప్ప నెచ్చెలులు భోజనృపాత్మజఁజేర్చి యర్మిలిన్. 112

సీ. పన్నీరుఁ బోయంగఁ గన్నుల జాలు కొం
చన్నీరు నది నది యగుచుఁ బారె
శిరముపైనుంచి నించిన మేలి గొజ్జఁగుల్
శిరము కప్పురముతోఁ జిటిలి పొగసెఁ
బొరలు పూఁబాన్పునం బొదువఁ జేయ ననంటి
పొరలు లేఁజిపురులు బొరుగులయ్యె
గంధంబుపైఁబూయఁ గరకలు గూర్చి త
ద్గంధంబుఁ దెలియకేకముగఁ జిటిలెఁ

తే. గీ. దమ్ములును మంచి కలువ మొత్తమ్ము లెల్లఁ
గమలె నడుగులఁ జేర్ప లోకమలినముగ
ననలు విరహా నలముసెగ గొనలువార
దోహదంబైనఁ జెలులెల్లఁ దొట్రు పడఁగ. 113

శా. ఆ లావణ్యవతీ వతంసము మనోజాభీల వహ్నిజ్వల
జ్జ్వాలాజాలము లెచ్చనేడ్చెఁ గనుప్రేకల్దొట్టి బాష్పాంబుపూర్
డాలుంగుబ్బలఁబొర్లి పారఁ గలకంఠశ్రీ కఠారావళీ
ణాలోలస్వర మాధురీరసము శ్రవ్యంబై విరాజిల్లఁగన్. 114

వ. అప్పుడు. 115

ఉ. తా విరిసెజ్జ డిగ్గి మరుఁదమ్ముల దాయఁ బికాళి చిల్కలన్
మోవి వడంకఁ దేఁటులను మొక్కలపున్ వలిగాలిఁ జైత్రునా
నా విధరోషభాషల ఘనంబగు కాటుకకంటి నీరునన్
త్రోవల వింతలై పొరలఁ దోయరుహాయతనేత్ర యిట్లనున్. 116

ఉ. మారుఁడు క్రూరుఁడంచుఁ బలుమాఱు వియోగులు ద్రుంగఁదిట్టఁలో
దీరని ఘోరపాపనిరతిన్ రతిచేష్టల కగ్గమైన నీ
శూరతఁ జూవఁబోయి మెయిఁ జూర్ణము చేసుక జీవయాత్ర నె
వ్వారికి నెంచరాని పలుపంచలఁ బొర్లెద వబ్జసాయకా. 117

సీ. అన్న డగ్గఱఁజేరి యా రాజసంబెల్ల
నీయధీనంబుగా నిలువరాదె
పెదతండ్రిఁజేరి నీ పెంకెతనము మాని
మనసు రంజిలఁగొల్చి మనఁగ రాదె
పగవారి నందఱ బ్రతికించెఁ దండ్రి నీ
కాధన్యుసేవఁ జేయంగ రాదె
తల్లినిన్బోషింప నల్లారు ముద్దుగా
నారిమనంకముఁ జేరి యుండరాదె
తే. గీ. యెవ్వరికిఁగాని వాఁడవై యిడుమఁ బడుచుఁ
బడుచు బుద్ధుల మిన్నంది బలముఁగూర్చి
కడుపుఁజెడఁబుట్టు మామను గలసి మదన
తిరుగ నేటికి దేహంబు స్మరణ మఱచి. 118

కం. చంద్రాస్యల నేఁచఁగ ని
స్తంద్రత నీకిప్పుడౌనె చనఁదగ దయ్యో
సాంద్ర మహామృతకరములు
చంద్రస్నేహంబు లతివిషంబులు మదనా! 119

ఉ. దర్పము మీఱ మింట నరిదాఁటులు తత్తడిదాఁట నుబ్బుచున్
నేర్పరి నంచుఁ బుష్పములనేజ కరంబునఁబట్టి యార్చుచున్
దూర్పున మామ గన్పడిన తోడగు వాహినికంచుఁ ద్రుళ్లెదో
దర్పక పక్షపాతగతిఁ [1]దావులఁ దగ్గుట కుందు టెంచితే! 120

కం. సాధనము లెన్ని గల్గిన
బాధింపరు శూరులెందు బాలామణులన్
నీ ధనువుఁదూపు లెల్లను
శోధింపగ .... తి మూలఁ జొచ్చు ఝషాంకా! 121

కం. అని యని గనఁగనఁ గ్రాలుచు
వినువీథినిఁ దారుతెంచు విషమాస్త్రుని మా
మను జూడ నోడి విముఖత
వనితా రత్నంబు పలికె వారని కినుకన్. 122

---

1. దావుట లీగుట.

ఉ. ఈకుముదాప్తుఁబోలు ఘనులెవ్వరు చల్లని రాజితండు వో
లోకములోననంచు జనలోకము సన్నుతిసేయనుండు నీ
పీకరణిన్ వధూమణుల నేఁతువె చక్కెరఁ దిన్ననోట వేఁ
పాకుఁ దినంగఁబూని తకటా నిను నేమనియందుఁ జంద్రుఁడా! 123

తే. గీ. మొరసి నిప్పులు నిప్పులే కురియఁజొచ్చి
తక్కటా నిన్ను నమృతాంశుఁడనుచుఁ జాల
నెమ్మనంబున నేరీతి నమ్మవచ్చుఁ
దేనెపూసినకత్తి వైతివి మృగాంక! 124

ఉ. క్షీరమునందుఁ బుట్టుటల శ్రీధరలోచన మౌటశైత్యవి
స్ఫారకరుండ వౌట శుచిభావముఁ జెందుట గౌరవర్ణమె
చ్చో రహిఁబూనియుంట హరిజోడయి యుండుట చర్చసేయఁగా
నీరజవైరి! వహ్నికిని నీకును భేదమొకింత గల్గునే. 125

వ. అని నెచ్చెలిం జూచి. 126

సీ. అంభోధి దయ నెట్టు లభిరామమూర్తి యౌ
హాలాహలాభిల మగుచునుండ
నమృత స్వరూపకుం డననెట్లు నుతిఁగాంచుఁ
దనువింత లింతలై తునియుచుండ
కువలయావన బుద్ధి కొనసాగి మనునెట్లు
తమ్ములె తనుఁజూచి తల్లడిల్ల
జైవాతృకత యెట్లు జగతిపైఁ బెంపొందుఁ
బృథు తరంబుగఁ బుట్టవెట్ట మేన
తే. గీ. నెటులు సత్ప్రభువగు నిశావిటుఁడితండు
వనధిఁ బడనేమి లక్షణవంతుఁడైనఁ
నేటుకాఁడై యనాథుల నేఁచునట్టి
వందమామమ్మ భామ యీ చందమామ. 127

మ. నిను సౌమ్యాకృతికెల్ల నిల్లనుచుఁ బోనీ మంచి వాఁడంచు రా
జని నక్షత్రపుఁ దున్కలన్ సుతల నీ కాదక్షుఁ డియ్యంగ నం
గనలంబిల్చి సమానురాగములఁ గాంక్షల్ దీర్పలేవైతివా
ఘనపాపంబును నీదుక్రొవ్వుఁ జిదుమంగా నేరదయ్యోన్ శశీ! 128

చ. ఉసురుమనంగ వెల్వినరు నూపుపు నేరుపునన్ గ్రహించి నీ
యుసురు మనంగఁ జేసికొని యూరక తేచెదు వేచె దిమ్మెయిన్
వినరు మనంగ నెచ్చెలులు వేగమ చొచ్చెదు తాళవృంతమున్
వినరు మనంగ నీ కకట విగ్రహ మున్నదె యేణవాహనా! 129

ఉ. ఆమని వచ్చె నాకు నని యందఱిలోఁ గడు విఱ్ఱవీఁగుచున్
గాముఁడు మెచ్చ నెత్తులగు కత్తులు మ్రింగెద వార్భటించుచున్
రామ విరోధ మక్కఱకు రాకయె దావయి వచ్చు మార్గముల్
మామిడి మేలమింత నిను మత్తిలఁజేసెనె మేలుకోకిలా! 130

కం. చిలుకా నీవలు కక్కట
చిలుకా వీనులకుఁదగిలెఁ జెలి యోర్వదిఁకన్
గలకాలము నినుఁ బెంచుట
చిలుకా! మోమోట లేక చేసెదు వెతలన్. 131

ఉ. ఉల్లము పల్లవింప విరు లుప్పతిలన్ నగుచుండ సొంపునన్
హల్లకపాణి దేహలతయందము చెందఁగఁ బ్రోదిసేయకీ
యెల్లిద మేలచేసెదిపు డెల్లరఁ బ్రోచుచుఁ జంద్రుఁ జూపినన్
దల్లికి లేని ముద్దు మఱి దాసికిఁ గల్గునె యెందు మాధవా! 132

కం. నెమ్మిఁ బ్రియమాడరానళి
ఝుమ్మను రావమున గీతచాతురి మెఱయన్
గొమ్మనిపు డడ్డగించుక
తుమ్మెద నని గేలిసేయ దోసము గాదే! 133

చ. అని యిటు లాడియాడి తన లగ్గముగా సరివారిలోననున్
వనిత ప్రసూనబాణునకు వాని బలంబునకెంత నీమదిన్
గొనకొను మన్యవేదనలఁ గుందెద వందవె మందబుద్ధివై
యనయముఁజూడు మిట్లయిన నందలి యిందలి తారతమ్యమున్. 134

సీ. చెలఁగు విదూరజాంగుళి ముద్రికయె చూపి
తళుకుదు రాచిల్క తండములను
నాసాపుటోరు నిశ్వాసంబు సారించి
కినియు బంభరపంక్తి గీటడంతు
నుదుటఁ గుంకుమకన్ను నుదుటుగా సవరించి
చిత్తజు నలయింతుఁ జేరనీక
కప్పుఁ గొప్పడలించి గ్రక్కున జడయల్లి
తెమ్మెర నెయ్యంబు దీలుపఱతు

తే. గీ. మలయు పికముల శ్రీరామ మాడఁదాశి
డంబు చేతనె వాగ్బంధనంబుఁజేతు
నింతమాత్రమ్మునకు సెలవిమ్ము కొమ్మ
పరితపింతురె చెలుల మిందఱము గల్గ. 135

మ. అని ధమ్మిల్లము చక్కదిద్ది తిలకం బందంబుగాఁదీర్చి వే
నెన రొప్పన్ దెలిపావడన్ దుడిచి కన్నీరెల్ల వారింపుచున్
మినుకుం గుబ్బలపైఁ బయంటఁ గడు నెమ్మిన్ జేర్చి రాకానిశీ
థిని నబ్దమ్ముగ నెచ్చెలుల్ గడప ధాత్రీజాని తానచ్చటన్. 136

సీ. ఉదయించు చంద్రు నయ్యువిద నెమ్మోమని
చేసన్న వినయంబుఁ జేసి పిలుచుఁ
జంద్రికానివహమ్ము నతినవ్వులని యెంచి
మేలు మేలని సంభ్రమించు నాత్మ
హుంకారమునఁ దేఁటి ఝంకార మొనరింప
భ్రమయుఁ గోకిల వాణి పాటలనుచు
సమదజీవంజీవ సమితిఁజూచి వధూటి
కలికి చన్నులటంచుఁ గలవరించు
తే. గీ. సఖులుగాదని పల్క నిచ్చటికి వేగ
తోడి తేరాదె యని చాల మోడిసేయు
విహ్వలత నొందు సాంద్రమౌ విరహభరము
సైపఁజాలక యపు డజత్మ్మాపరుండు. 137

ఉ. అందముగాఁగ నిందుమతి యాకృతి వ్రాసి పటంబునందు నా
నందముతోడఁ బేరురమునన్ గదియించుఁ గరాంబుజాతముల్
పొందుగఁ జేర్చుఁగన్నుఁగవ బోఁటి ననుం గికురించినాఁడు నీ
వందల మెక్కి యెట్లు చనితంచుఁ బ్రియంబునఁ బల్కునెంతయున్. 138

ఉ. ఊరక నామదిం గినుకనూని చెలీ యిపుడెంత సేపయో
సారెకుఁ బిల్వఁబల్క పతి సాంద్రమనోభవ తాపయుక్తినే
నోరువలేక వ్రేఁగ మదినుండెడు నీవిపుఁడెట్లు వ్రేఁగెదో
చేరిన మారుఁడెంతయును సిల్గులఁబెట్టక పోవనేర్చునే? 139

చ. పలుచని తెమ్మెరన్ గదలు బావిలిసీలపుడాలు తోడ వం
తులుగల గొప్పకొప్పు జిగితో జతగూడిన సిగ్గుఁదేలు చూ
పుల ననుఁజూచిచూచి పువుబోఁడులు గన్గొనఁ జిన్నినవ్వ నం
థిలఁ జను రాకుమారి నిను నెమ్మది నెన్నఁడుచూడఁ గల్గునో. 140

చ. పిలిచిన నేమిరా యనుచు బిట్టదలించుచుఁ గెంపువైడి యం
దెలు ఘలుఘల్లునన్ మొరయ నిబ్బరపుంజిగి గబ్బికుల్కఁ గు
బ్బలవయి హారముల్ గునియఁ బయ్యెద జాఱఁగ జాఱుకొప్పుతోఁ
జిలుకలకొల్కి నీవు ననుఁ జేరఁగ వచ్చుట యింక నెన్నఁడో! 141

సీ. అని యనిద్రాహారుఁ డగుచు మనోజాత
శాతాశుగములకు జలదరించు
నెచటఁ గోకిలరావ మెసగె నచ్చటికెల్ల
నిదె వచ్చితి నటంచు నెలమిఁగదియుఁ
బసిఁడి చాయల నిమ్మపండ్లిచ్చి పొడగన్నఁ
జెలికుచంబు లటంచుఁ జెలఁగు మదిని
విరి పువ్వుబెత్తు లెవ్వరు దెచ్చినను గాంత
బాహువల్లరు లంచు భ్రాంతి నుడియు
తే. గీ. సాంద్ర ఘనసార మృగమద సాంకవాది
వాసనలు గమ్మనిన నింతి వచ్చె ననుచు
నలుదిశలుఁ జూచు నేవేళ నరవరుండు
తలఁపఁ డేకార్యము వియోగ దశలఁదగిలి. 142

కం. అని యిట్లు వగచు నజుఁ గని
జననాయక భోజరాజజాత వరించున్
నినురేప యనుచు సచివుఁడు
చనవున నూఱడిలఁ బల్కె సమయమునందున్. 143

శా. ప్రాతః స్నాన పరద్విజవ్రజ సరః ప్రస్థానకారుల్ ప్రియ
వ్రాతాన్య ప్రమదారతిస్మరణజాగ్ర ద్రోషయోషా శ్రవ
శ్యాతారానుల నాగమావసర చంచద్వాద్యనిర్ఘోష సం
ఘాతంబుల్ చరణాయుధ స్వనము లాకర్ణింప నయ్యెన్ దగన్. 144

కం. ఆ పూర్వదిశ యినుఁడుదర్క
జేపట్ట నలంకరించు జిగిముత్తియపున్
బాపట బొట్టిది యనఁగాఁ
జూపట్టెను వేగుఁజుక్క సురుచిర లీలన్. 145

కం. తుఱుమునఁ దుఱిమిన మొల్లల
సరు లెడలిచి గగనలక్ష్మి సంపఁగె విరులన్
జెరివిన క్రియఁ జుక్కలు జన
ఖరకర కిరణములు గొన్ని కానఁగ నయ్యెన్. 146

కం. అస్త్రాద్రి స్వర్భాను
గ్రస్తుండయ్యెనో యనఁగఁ గానఁబడక తా
మస్తు చెడి యపుడు శీతగ
భస్తి చనెన్ మిగుల మిట్టిపడ నరి వితతుల్. 147

తే. గీ. చెలఁగు చీఁకటి మొదలి జేజేలమూఁక
మీఁద దండెత్తు వెలిమాపు జోదు కొఱకు
డంబు హొంబట్టు వెలిగుడారంబు వైచి
రనఁగ దూర్పునఁ దోఁచెఁ బెన్మినుకుబరణి. 148

ఉ. తమ్ముల వాఁడి దార్చి కుముదమ్ముల తాపము గూర్చి చక్ర చ
క్రమ్ముల సేదఁ దీర్చి తిమిరమ్ముల నాశ మొనర్చి తారకా
ఘమ్ములఁ దార్చి రాపులుఁగు గ్రమ్మ ముదమ్మ విదిర్చి పేర్చి మొ
త్తమ్ములుగాఁ జెలంగె నలతమ్ముల జేనికరమ్ము లెంతయున్. 149

శా. మేరుక్ష్మాధరధీర ధీరకవి రాణ్మిత్ర ప్రతానాదరా
ప్రారంభోరుహ కీరహార నిటలస్థాగ్ని ప్రతాపక్ష తీ
క్రూరారిప్రభు వారి వారణ విభిత్కుంఠా[1] ధరీ కృద్యశో
గౌరోద్యద్రుచి సార సారస పరాకార స్ఫుర ద్విగ్రహా! 150

కం. గజపతి కటకవిభేదన
భుజగపతి ప్రతిభ కీర్తిభూషణ సుకవి
వ్రజ విద్వత్కవి గాయక
సుజన యుత సభాంతరాళ శుభగుణలోలా! 151

కవిరాజవిరాజితము. స్థిరగుణభూషణ బాంధవ పోషణ శ్రీకరభాషణ మేరుధృతీ
పరనృప భీకర రమ్యదయాకర భారజనీకర చారుమతీ
పరబుధగాయక సత్కవినాయక వాంఛితదాయక తాతికృతీ
హరిచిరవైభవ రూపమనోభవ యాహవ భూభవ నీతిరతీ! 152

గద్య. ఇది శ్రీరామభద్ర కరుణాకటాక్షవీక్షణ సమాసాదిత సరస కవితా వైచిత్రీపాత్ర తెనాలిరామకృష్ణ కవిరాజానుజ శ్రీగిరి కవిసార్వభౌమపౌత్ర యభినవ రామకృష్ణ సత్కవి పుత్ర తిమ్మమాంబాగర్భరత్నాకరరాకా కైరవమిత్ర కౌండిన్యగోత్ర పవిత్ర సకల సుకవివినుత సాహిత్యవిద్యాసమున్నిద్రరామభద్రకవిప్రణీతంబైన యిందుమతీ పరిణయం బను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

---

1. కుంఠా.

# చతుర్థాశ్వాసము

క. శ్రీ లక్ష్మాంబా తిమ్మనృ
పాలాగ్రణి గర్భ కలశపారావార
ప్రాలేయ కిరణ, విక్రమ
హేలాజిత శితహరీశ, కృష్ణమహీశా! 1

తే. గీ. అవధరింపుము భోజధరాధినాధు
ననుమతంబున నొక్కరమ్యస్థలమున
నేర్పుగల తజ్జ్ఞజనములు నీటు మించ
మంచములు చాలుకొనఁగ నిర్మించి రంత. 2

శా. నానా భూషణ భూషితాంగకులు, నానాసూన దామాంకితుల్,
నానా వర్ణసుగంధ లేపనులు, నానా చిత్రనేత్రాకృతుల్,
నానా నూనచమూవితాన ఘనసన్నాహంబు లేపారఁగా
నానా రాజకుమారు లర్థి జను లానందంబుతో నెంచఁగన్. 3

తే. గీ. వచ్చి విచ్చలవిడిఁ దమ యిచ్చ వచ్చు
మంచముల నిల్చి చంచద్విమానరాజ
మాన వైమానికుల లీలఁ బూనిరపుడు
సమధికాకార విభ్రమ సౌష్ఠవమున. 4

వ. అప్పుడు. 5

సీ. మేలైనవేల్పు జామిన్న తుమ్మెదతాళి
బిరుదైన మగజాల పెండియంబు
గోమేధికముల డాల్కొనఁ గూర్చిన కుళాయి
హెచ్చు మిన్నకిరీటి పచ్చపరుఁజు[1]
జత హురుముంజి[2] పూసల పెద్ద చౌకట్టు
కళుకు వన్నెలఁ జిల్కు కంటసరులు
నింపుతా గుజరాతి కెంపు టుంగరములు
ఘనపుష్యరాగకంకణ యుగంబు

---

1. హరువు. 2. హురుమంజి.

తే. గీ. మెఱయఁ బైతాణి యరచట్ట నరయ సుంకు
మంబు వైడూర్యముల చేసరంబు లలర
నల రఘుకుమారుఁ డైనట్టి యజనృపాలుఁ
డంగనానూత్న కిరతురంగుఁ డగుచు. 6

ఉ. దట్టిపొరన్ బతాణి జముదాళి[1] మలంచి, పిరంగి కత్తి[2]చేఁ
బట్టి హయంబు నెక్కి నలుపజ్జల రాఁ జతురంగ సైన్యముల్
పట్టణవీధిఁ జూడఁగను బల్విడి చిల్కపతాణి రౌతువూఁ
బట్టెముఁ బూని వచ్చెనని భామినులెల్లను జూచి సొక్కఁగన్. 7

చ. నరగజముల్ డమామలు ధణంధణ మ్రోయ రథోత్కరస్ఫుర
న్నరగజవాజి రావములు నాటఁగ దిగ్గజకర్ణ వీథులన్
గురుతర వైభవంబులను గుండిన భర్త యెదుర్కొనంగ నా
హరిసుతమూర్తి తేజిదిగె నప్పుడు మంచక భూపురస్థలిన్. 8

సీ. అరిగె లిర్వంకల దొరయునప్పుడు మేఘ
మాలికావృత భానుమంతులీల
వింజామరంబులు వ్రేయునప్పుడు పూర్ణ
కళలు గ్రమ్మిన సుధాకరుని సొబగు
కెంబట్టు సురటులు పంబినప్పుడు బాల
సహకార వనిలో వసంతు చెల్వు
భూషితానుగ కోటి పొదువునప్పుడు మరు
ద్గణము గొల్చు సురేంద్ర గౌరవంబు
తే. గీ. దాల్చి గంభీరభేరీ మృదంగ శంఖ
వేణువీణాది రవములు వేడ్క సేయఁ
బ్రకటతర వందిబృంద పాపత్యమాన
నిజజయోన్నిద్ర బిరుదాంక నికర మడర. 9

సీ. వరుస లేర్పడి మౌళి విరిసరుల్ బురుసారు
మాలు కట్టనుండి బైలు మెఱయ
నరచట్ట బిగువునఁ దఱుచుగా నుప్పొంగి
తావుకుమ తేట దట్టివార
మొలచినట్టు పిఱుంద మొలచుట్టి బిగిసిన
జిలుగు బంగరుప్రాత చేల దనర
ఘన సార్వభౌమాంక గండపెండేరంబు
వామపాదమునఁ జెల్వామతింప

1. జముదాడి. 2. కచ్చి.

తే. గీ. గొప్ప సుప్పాణి యొంట్లొప్పు గుప్పళింపఁ
దారహారంబు లెదకు నొయ్యారమొసఁగఁ
బ్రసవశర[1] నూత్నలీలనా రఘు నృపాల
తనయుఁ డేతెంచి మంచాగ్రమున వసించె. 10

చ. రభసము చూపు శంకరుఖరంబగు చూపునఁ బ్రాఁతమేను పో
నభినవమూర్తి దాల్చు మకరాంకునికైవడిఁ బొల్చు నారఘు
ప్రభవుని సింహసంహనన భావము రాజులు వీతతేజులై
యభిరతిఁ జూచి యిందుమతి యందు నిరాశతఁ జెందిరందఱున్. 11

వ. ఇట్లు తదీయ రూపాటోపాపహృతస్వాభిమత ఫలావాప్తులై సొంపుఁ దక్కినమహీపతులు కరదీపికాసమీపగత దీపకళికలుంబోలె నొండొరుల మొగంబులు చూచుకొనుచు విన్ననై యుండిరంత నంతిపురంబున నవ్వైదర్భ రాజానుమతంబునఁ దద్భార్య నిజననాందృవర్యం గయి సేయంబనుచుటయును. 12

చ. అలరుచుఁ దావినూనెఁ దలయంటి సుగంధము ప్రామి వాసనా
జలములఁ దానమార్చి మృదుశాటి కటిన్ సమకూర్చి వేణిమ
చ్ఛాలయనొనర్చి నెన్నుదుట నొప్పుగఁ గస్తురిరేఖఁ దీర్చి మైఁ
గలపముఁ జేర్చి రూఢిగఁ గామిను లిందుమతీ వధూటికిన్. 13

సీ. కనుపట్టు గొప్పకొప్పున నూసకంబును
సొగసు పాపటను జేర్చుక్కబొట్టు
రహిసీను వీనుల రత్నతాటంకముల్
చొక్కమౌ నాసను ముక్కరయును
రమణీయ కంఠభాగమునఁ గెంపులతీఁగ
గబ్బిగుబ్బల మౌక్తికముల సరులు
ననదుఁ గౌనున నింపుఁ గొనరు నొడ్డాణంబుఁ
గొమరొందు కటి బిళ్లలమొలనూలు
తే. గీ. పొంకములు గుల్కు కరములఁ గంకణములు
రంగు మీఱిన నునువ్రేళ్ల నుంగరములుఁ
జెలఁగు నంఘ్రిద్వయమున మంజీరయుగము
లలిత పాదాంగుళములఁ బిల్లాండ్లు నిడిరి. 14

1. దళ:

కం. ఆపాద మస్తకముగ నటు
లాపాదించిరి విభూషణాయతి, నతియున్
జూపట్టె దాన చూపఱ
చూపట్టె నిమేషభావ శూన్యతఁ జెందన్. 15

సీ. నీలవంజుల మగఱాలు పైకొనె నాఁగ
గొప్ప కొప్పున విరుల్ గుప్పళింప
నుదుటువెన్నెల పుల్గు లురుల దూఱెనొనాఁగ
బెళుకు కన్గడలఁ గజ్జలము దీర్చి
గట్టులపై మంచు గ్రమ్మి నిల్చెనొనాఁగఁ
గవగుబ్బలను జిల్గు రవికఁదొడిగి
పోఁకబోదియ బాళె లేకమై దిగెనాఁగ
నఱుత ముత్తెపు సరు లనువుపఱిచి
తే. గీ. శ్రవణపూరార్పి తాసిత కువలయంబు
తళుకు మీఱిన చెక్కుటద్దంబు లోనఁ
జాయ పొడకట్టి కనుపట్టెనో యనంగ
నొక్కయెడఁ గాటుకను దృష్టి చుక్క యునిచి. 16

కం. సుకలాప కలాపంబుల
శుకలాలితవచన యిట్లు చూపట్టంగా
సకలాంగంబుల నిడి విధు
శకలాలిక లెలమిఁ గొలిచి చనుదేరంగన్. 17

శా. కాంచెం జంచల కింకిణీ ధ్వనులు ఢాకల్ సేయ ఘర్షించి భా
షించం బూనినకైవడిం జరణమంజీరమ్ములున్ మ్రోయఁ రా
యంచల్ తత్కలనాద మాధురికి డాయం, దీవ్రతంగారుక్రా
మ్మించున్ మించు కటాక్షపాతముల యున్మేషంబు నారాయనన్. 18

కం. చేరంగా నరుదెంచిన
సారంగాక్షిన్ నిజాత్మజాతన్ ముదమిం
పారంగాఁ దొడపై నిడి
సారెం గౌఁగిటను బొదివి జనయిత్రి యనున్. 19

ఉ. నమ్మికమీఱఁగా మన సునంద సమస్తముఁజెప్ప నాత్మకున్
సమ్మతమైన రూపగుణశాలి కులాధిపు నొక్క రాసుతున్
నెమ్మి వరించుమమ్మ, రమణీయశుభాప్తిఁ జరించుమమ్మ, మా
యమ్మ భరించుమమ్మ ప్రమదాకరమైన వరానుకూల్యమున్. 20

వ. అని బుజ్జగించి యంచితమేధామాధుర్యధుర్యతాభినందనీయ వాగ్బృందయు, సగోత్రసూత్ర చరిత్రాభిధాన విజ్ఞాయమాన నానారాజ బృందయు నగు సునందానామ మందగమనం గమనీయరూప నైపుణీ నిశ్చేష్టిత యువహృదయపేటికలును నిరాఘాట చాటువాగ్ధాటీ జితస్మరఘోటికలు నగు చేటికలను గూర్చి యబ్బాలికన్ బాలకి నిడి యనుపుటయును. 21

సీ. తపనీయ నాళ సందానితంబై తావిఁ
గ్రమ్మెడు సురటిచేఁ గమిచి యొకతె
స్తన నితంబోద్వృత్తి బినుగు గా నసియాడఁ
బన్నీరుగిండి చేఁబన్ని యొకతె
హృదయ భూమ్మృగయు నరిది దీమ మనఁజాలి
బుజమునఁ నడపంబు పూని యొకతె
జిలుగురాయంచ ఱెక్కలడాలు గెలుబాడు
దీర్ఘచామరము సంధించి యొకతె
తే. గీ. నడవఁ దక్కిన యుడిగంపుఁ బడఁతు లడరి
బడి బడినిఁగొల్చిరా వేత్రపాణు లెడల
నెడల సందడి కడలకుంజడియ నీల
నీలకచ చేరె మంచాంతరాళ వీధి. 22

ఉ. కంచుకి సీకరోచ్చలిత కాంచన వేత్రము లానకధ్వనుల్
మించులు గర్జితంబులయి మెచ్చొనఁగన్ బరివార వేష్టితా
భ్యంచిత తద్వధూశిబిక యప్పుడు దాఘనలీలతో రుచుల్
వెంచి మహీభృదాళి వొదవెం దతముద్రసవర్ష ధారలన్. 23

వ. అప్పుడు. 24

సీ. లీలగేదఁగిరేఁకు వాలారు కొనగోళ్లఁ
బెక్కుభంగులఁజెక్కె నొక్కరాజు
ముఖుపుతో జముదాడి పరుజు ముష్టినమర్చి
యూఁది గట్టిగనిల్చె నొక్కరాజు
గళమువంచి యురంబుఁ గలయఁ గన్గొని తాలి
చక్కఁగా సవరించె నొక్కరాజు
వలనివార్తలు చెప్పి చెలికానిఁ జేపట్టి
పక్కపక్కనఁగేరె నొక్కరాజు

తే. గీ. బటువు లురుటులు ముద్దియల్ బయలు పడఁగ
నిక్కి మీసలువడిఁగొల్పి నొక్కరాజు
సారె గరకంకణములఁ గ్రేంకార మెసఁగ
నాలుగు పిడికేలఁ దాటించె నొక్కరాజు. 25

చ. భ్రమణవశంబునం జెదరఁ బాఱిన రేకులతాఁకునన్ మరం
దమహిత సౌరభ స్పృహల నంటున నంటుచుఁ బాయుచున్ మద
భ్రమరము లుగ్రసంస్మృతి నిబద్ధులకై వడి ఖేదమోద సం
గము వహియింపఁగాఁగరయుగంబున నొక్కఁడు ద్రిప్పెఁబద్మమున్.26

ఉ. పల్లకి జేరరా నొకనృపాలకుఁ డావలనట్టె చూచుచున్
బల్లవపాణి నల్దిశల భావనఁజేయుచుఁదన్ గనుంగొనన్
గల్లతటుల్ చెమర్పఁగరి కల్వకుఁగోరికి వాలునట్లుగా
మెల్లన వ్రాలె మంచమున మేలని బోటిచెలుల్ హసింపఁగన్. 27

కం. మొక్కలమున నొక భూపతి
మ్రొక్కినఁజే కలువబంతి మోమున నుంచెన్
జక్కవ పెంటిని చుక్కని
చక్కెరకెమ్మోవినగవు సందడిసేయన్. 28

కం. శృంగారపుఁ జేష్టల ని
భ్భంగిన్ నానావిధములఁ బ్రకటింపుచు న
య్యంగనఁ గనువేడుక హృ
ద్రంగమునఁ దరంగితముగ రాసుతులున్నన్. 29

కం. బాలాధిష్ఠిత మగు న
ప్పాలకి నప్పుడు సునంద భారవహులచేఁ
గేలన్ సూచించి మహీ
పాలకసూనులకు నెదుటఁ బట్టించుటయున్. 30

చ. లలన మిటారి కన్నుల కొలంది తటాలున రాజసూనులన్
గలయఁగ నప్పుడొప్పొదవఁగన్గొనెఁ దోడన తత్కనీనికా
కలిత రుచి ప్రకాండములు కల్వలకోరులుగాఁగఁబూని మా
యలవలరాజు వారి హృదయంబులు భేదిలఁజేసె నీసునన్ 31

చ. విసువక ముద్దుమో మచటు ప్రీలి గళంబు గ్రహించి కూరుముల్
గొనరి కరద్వయిం గమిచిగుత్తపుగుబ్బలప్రాలి సోలి రా
జసుతుల చూపుఁజాలు కటిచక్కటినంటి పరిభ్రమించి వె
క్కస మగునాస నా నవలఁ గాళ్లనువేళ్లఁ బెనంగె దీనతన్. 32

ఉ. మబ్బులు గప్పి పల్కి పలుమాఱును గాంక్షలురేచి యుబ్బులై
కబ్బులు చూపి మాయసమకట్టి భ్రమించి రసోదయంబులో
గుబ్బతిలంగఁజేసి కవఁగూడి పయిన్ మెఱవళ్లు దెల్పి య
ట్లబ్బురపాటు దెచ్చె వసుధాధిపసూనుల కింతియంగముల్. 33

ఉ. ఆయెడఁబూవుఁదూపులు సహస్రముఖంబులుగా నొనర్చిరా
మేయుడు మర్మముల్ దవుల మేనులు నొంప వ్రణంబులేని బల్
గాయములైన సొమ్మసిలు కైవడి మూర్ఛలఁజెంది రుర్వరా
నాయకులెల్ల నట్టి నతనాభిఁ గనుంగొని మోహితాత్ములై. 34

తే. గీ. ఎట్టకేలకుఁ దెలివొంది యిందువదన
యంఘ్రు లూరులు జఘనంబు నసదుఁగౌనుఁ
గుచములు గళంబు నెమ్మోము గొప్పకొప్పు
నుల్లమువ్వెత్తు కొనఁజూచు చుండిరంత. 35

కం. చిత్రగతి సునందాశత
పత్రాయతనేత్ర వచనపటిమ మెఱయ దో
ర్వేత్రంబుసాఁచి యందొక
గోత్రాధిపుఁజూచి కుటిలకుంతల కనియెన్. 36

శా. రాజద్రాజనిభాస్య ! చూడు మితనిం బ్రాంచద్గతిన్ విద్విష
ద్రాజీపూజిత బాహుశక్తి నురుధర్మస్థేమ సంయుక్తి నీ
రాజాఖండలుఁడేలు ధాత్రి గనియెన్ రాజన్వతీఖ్యాతి న
వ్యాజప్రాప్తసమస్త సత్ఫల జనవ్రాతైక భూయిష్ఠమై. 37

మ. పగమీఱం బరరాజు లాజులఁ బ్రతిస్పర్థింప వారిన్ధగ
ద్ధగదుగ్రాసి వహించి నొంచి మిగులన్ దాపంబు నొందించి యూ
హ గలంగించి పరంత పాహ్వయము నన్వర్థంబుగాఁ గైకొనున్
మగధాధీశ్వరు నీ నరేశ్వరునిఁ బ్రేమం జూడు ప్రీడావతీ ! 38

ఉ. దండి నితండనారత కృతక్రతు భోగముల న్నగారికిన్
బండువుగాఁగ నిచ్చలును బైనము కల్గఁగఁజేసి కల్పకా
ఖండ లతాంత శూన్యములుగా నొనరించెఁ బులోమనందనీ
పాండురగండమండలుల పజ్జల వ్రేలెడు కుంతలంబులన్. 39

ఉ. డెందమునం బ్రమోదము దృఢీకృతమై ననలొత్తఁ గాంచన
స్యందనమెక్కి యీ నృపతి సంగడిఁ బుష్పపురంబు చేరుచో
నందలి హర్మ్య జాలకములంది కనుంగొను బోంట్ల చూడ్కికిన్
విందొనరించు టొప్పు నరవింద దళాయత చారులోచనా ! 40

కం. నీ చిత్తమ్మునకుఁ బ్రియం
బై చనెనేనియు వరించు మర్థి నితని నా
నా చంద్రముఖి యకాంక్షా
సూచకముగ వదన వినతి చూపులఁ దెలుపన్. 41

కం. వెండియు వేఱొక వసుధా
ఖండలు సన్నిధి నుదగ్ర గంధాంధకవే
దండనిభయాన నిడివాక్
పాండిత్యమునన్ సునంద భామిని కనియెన్. 42

శా. అంగక్షోణి తలాధినాయకుఁ డితం డబ్జాననల్ మెచ్చఁగా
శృంగారంబులు పూననేరుచుఁ గలాసీమావరిజ్ఞాత వీ
నిం గాంక్షించితివేని తియ్య విలుకానిన్ గెల్వఁగా వచ్చునో
శృంగార ద్విపకుంభ పద్మముకుళ శ్రీజిత్కుచోదంచితా ! 43

శా. జంభారాతికిఁ దోడుగాఁ జని దిగీశవ్యూహ చంచద్భుజా
స్తంభస్తంభ నిదాన దానవ తతిన్ సాధించునాఁ డద్దివిన్
రంభాముఖ్య సురాంగనల్ రతులు గోరన్ వారిఁ దేల్చెన్ మన
స్సంభూతాతి సుఖస్థితిన్ మదనశాస్త్ర ప్రౌఢిమాభిజ్ఞుఁడై. 44

కం. ఘనమంత్ర సూత్రకారక
ముని సంఘవినీత దిగిభముల నంతతులే
పున తన వశముగ భూతల
మున నుండియు నింద్రభోగము నితఁడు గనియెన్. 45

కం. శత్రుకళత్రంబుల కుచ
గోత్రమ్ముల నశ్రుబిందు గురుమౌక్తికముల్
సూత్రములు లేకయయురః
సూత్రాకృతిఁజెంద నితఁడు శూరతఁజేయున్. 46

మ. సిరియున్ గహ్వరియున్ సరస్వతియు వాసిన్ వీని కన్నన్నద్రి
మ్మరియున్ గైవసమయ్యెఁ బల్కుల నొడంబాటొందియున్ జెంది సు
స్థిర భావంబుఁ బ్రజాసమృద్ధియు జగద్విఖ్యాతియుంగాంచి రిం
పరయన్ వీరలలోన నొక్కరితె వీవైతేని భవ్యంబగున్. 47

కం. అని పల్కి యతని మీఁదన్
మనసిడకుండుటయు నిందుమతిని సునందా
వనితాలలామ వేఱొక
జననాథుని యెదుట నునిచి చతురత ననియెన్. 48

ఉ. దిట్టతనంబు చూపులకుఁదెచ్చితె కొంత ఘనాంత చంద్రికా
ధట్ట విలాసహాస పిఱుఁదన్ బెడిదంబుగఁ బన్నియున్న యీ
దట్టపుసేనతో నుదుటఁ దార్కొన నుండెడు రాజవంతికా
పట్టణమేలు మేలు వహి[1]పార్థివకోటి నితండె సుమ్మనన్. 49

ఉ. బాలశశాంకుఁ డౌఁదలను భాసిలఁ జేరువనున్న యామహా
కాళపురీశు నీశుఁ గుతుకంబునఁ గొల్చి తమః ప్రసక్తి నే
వేళలఁజెంద కీన్నృపతి విశ్రుతభోగములన్ విలాసినీ
జాల సమేతుఁడై మదనశాస్త్ర రహస్యము లెన్నునిచ్చలున్. 50

కం. శిప్రాతరంగ శీకర
దీప్రతరానిలము సేదదేర్ప నువవనిన్
సప్రీతి నితనిబాహా
వప్రంబున సుఖముఁ జెందవలచితి వేనిన్. 51

కం. ఇతని వరియింపు మనపుడు
శతపత్రేక్షణయు నక్షిసంజ్ఞ యొసఁగినన్
జతురంత యానవాహలు
నతిరయమున నేఁగి యొక్కయవనిపు నెదుటన్. 52

---

1. మహిఁబా.

ఉ. పాలకి నిల్చ ఖండశశిఫాలకు బాలకు నిట్లనున్ సునం
దాలలితాంగి యీనృపసుధాకరుఁ డద్భుత బాహుచండిమా
శాలి యరిందమాఖ్యుఁడు విశాలవిలోచన చూడు మీతనిన్
బోలరు నేఁటిరాసుతు లపూర్వ వితీర్ణి పరాక్రమంబులన్. 53

సీ. కణఁగి దత్తాత్రేయుకరుణఁ జక్రముపంపు
సేయఁ దేజస్వియై చెలఁగె నెవ్వ,
డిచ్చవచ్చినదాఁక నిచ్చి రావణ దైత్యుఁ
బెట్టుగాఁ జెఱసాలఁ బెట్టెనెవ్వఁ
డెలమిఁ జతుర్యుగ ద్వీపనాథులఁగొట్టి
నెఱి జయస్తంభముల్ నిలిపె నెవ్వఁ
డతుల వైష్ణవభక్తిఁ గృతయుగాధీశుల
బలగర్వసంపద గెలిచె నెవ్వఁ

తే. గీ. డట్టి గరిమ సహస్ర బాహార్జునుండు
వంశపతిగాఁ బ్రతీప భూవరుఁడు చెలఁగు
నతులభుజశక్తి నీతని నతనితోడ
సాటి యనవచ్చుఁ బూర్ణిమా చంద్రవదన. 54

చ. మునుమిడి హైహయాంతకుఁ డమోఘకఠోర కుఠారధారచే
జనపతులన్ వధించునెడ సప్తశిఖున్ మదిమెచ్చఁ జేసి యా
యనలుఁడు ప్రాపుగా నతని నాహవమేదిని నోర్చి ధీరవ
ర్తనమునఁ గీర్తిఁగాంచె వనితా; జనతావినుతాంగి వీఁడిలన్. 55

కం. మాహిష్మతీ పురీ హ
ర్మ్యాహీనారామ సీమలందును లేఖా
వాహిని చెంతలనీతని
తో హర్ష మెలర్ప మెలఁగెదో నతి చెపుమా! 56

తే. గీ. అనిన నామత్తకాశిని యతనిమీఁదఁ
జిత్త మిగురొత్తకున్కి మోమెత్తకుండు
టరసి వేఱొకనృపుని డాయంగఁ జేర్చి
నవతటిద్గాత్రలతకు సునంద యనియె. 57

శా. మేధానిర్జితవాణి యీతని సమున్మేషస్ఫురద్భ్రూసధా
రాధారేయవిరోధి సౌధ పరివారస్ఫార దుర్వారతే
జోధన్యాత్మగృహస్థ శీతసుషమాస్తోమోన్నతిన్ శూరసే
నాధీశాను సుషేణనామ వసుధాధ్యక్షున్ నిరీక్షింపుమా! 58

చ. ఎవని పయోవిహారమున నింతుల చన్నులగంధ మంటుటన్
రవితనుజాత తాను మధురాపురవాహినియయ్యు నూర్మిమం
జువిబుధ సింధుయోగమున శోభిలుకైవడి నుండునట్టి భూ
ధవుని సుషేణురూపహిమధాము వరింపుము పద్మలోచనా ! 59

కం. ఆ విభుతో బృందావని
నీ వలరులశయ్య రతుల నెఱపుము వేడ్కన్
గోవర్ధనగిరి సురభిన్
గావఁగ శిఖి తాండవంబుఁగాంచుము తరుణీ !* 60

కం. అజభామిని గాఁదగునన
గజగామినియతనిఁ జూడక చనియె మార్గ
వ్రజదవనిధర మెదుర్పడఁ
ద్యజియించి పయోధిఁజెంద నగు నది వోలెన్

కం. తదనంతరంబు హేమాం
గదనామ కళింగనృపతిఁ గదిసి సునందా
మదనాగయాన నిర్జిత
మదనాకృతిమతికి నిందుమతి కిట్లనియెన్. 61

కం. హరిచందన లేపనన
ద్వరహార శరీర తులిత తరుణాతపని
ర్ఝరయుత[1] ధర్ముఁడురగపురీ
శ్వరుఁ డీతఁడు పాండ్యభూమివరుఁడు మృగాక్షీ ! 62

కం. అంభోధిపాయి వింధ్య
స్తంభయిత యగస్త్యుఁడితని తౌరగమేధా
రంభమున యాజకత్వవి
జృంభణ మునరించెఁ బూర్ణసితకరవదనా ! 63

శా. శీతనగాత్మజారమణసేవన లబ్ధ శరాధిరాజ్యుఁడౌ
సీతని ధాటికి న్వెఱచి యింద్రపరాజయ కర్తృతా వరి
స్ఫీత పరాక్రమ క్రముఁ డజేయుఁడు రావణుఁ డాత్మపట్టణ
స్థాతృత లేకయుండు సితసారసపత్ర విశాలలోచనా ! 64

* మూలములో ఇట గ్రంథపాతమనుమితము అని యున్నది. కాని యున్నట్లు తోచదు.

1. యుగ.

కం. లలి తైలావ్నత వల్ల్యా
వలి తలపడి రాఁగ నాగవల్లిమతల్లీ
కలితక్రముక సుమోజ్జ్వల
మలయస్థలి నితనిఁగూడి మలయుము చెలియా! 65

కం. కలువల నగు తనుకాంతులు
గల యీలాజన్య శీతకరుఁగూడి సము
జ్జ్వలజలదస్థిత చపలా
విలసన హసనం బొనర్పవే కనకాంగీ! 66

తే. గీ. అని పలుకు నా సునంద వాక్యమున కప్పు
డిందుమతి మది నవకాళ మియ్యదయ్యె
వెవెలుంగుల దొర లేని వెచ్చ మునుఁగు
తమ్మి శశికాంతి కెడయీక తనరు కరణి. 67

కం. రేలు చలియించు దీపిక
పోలిక నలనతి ధరాధిపులఁ గడవఁగఁ ద
[1]త్పాలకవర్గము క్షేమము
హేలన్ వైవర్ణమున్ వహించెం జాలన్. 68

కం. ఆరీతి వచ్చు చెలిఁగని
యారఘు తనయుఁడు వరించునను మదియూహల్
సారెకు నిజభుజమదరుట
చే రహిఁ బూనంగ సంతసిలి యున్న తఱిన్. 69

మ. ద్విజరాజాగ్రజ సూతవంశ కలశాబ్ధి ప్రస్ఫురత్పూర్ణిమా
ద్విజరాజు న్ద్విజరాజ భృన్నిటల దృక్తేజున్ మనోజ్ఞాంగ జే
త్రజరాలేఖ్యతనూ విలాసు నురుధైర్య ప్రాభవా వాసు న
య్యజరాజన్యవరేణ్యు నిందుమతి ప్రేమాయత్త చిత్తంబునన్. 70

ఉ. చూచి త్రపాభరం బుదుట చూపుల కైపులఁ గ్రమ్మ గ్రమ్మనెం
తే చలమెక్కి క్రేళ్లురుకు దీర్ఘ కటాక్షము లట్టియందపున్
రాచకొలంపు వేలుపు దొరం దెగఁజాలక యేసియేసి చే
కాచు మనోజు నంపరతెగల్వొలెఁ దత్తనువందఁ గ్రందుగన్. 71

1. త్పాలక మార్గ క్షామము.

కం. గజరాజ గమన చూపులు
నజరాజ వరేణ్యుచూపు లలమికొని రతి
ద్విజరాజముఖికిఁ బూనే
జజరాకాంతునకు విరివసంతము లయ్యెన్. 72

సీ. లలితముకుంద నీలశ్రీలఁ దనివొందు
కప్పుమీఱిన గొప్పకొప్పుఁ గ్రమ్మి
నవమహాపద్మ పద్మవిభవమ్మునఁ జొక్కు
కాముగీమగు ముద్దుమోము నలమి
తతసుధామకరకుంద విలాసమునఁదేలు
డాలు గీల్కొను దంత పాలిఁ దడవె
వరశంఖ సారసర్వస్వయుక్తి దనర్చు
దళమైన కళ మించు గళముఁబొదివి
తే. గీ. రమ్యకచ్ఛప సౌభాగ్యరతి నెనంగు
కలికితన ముప్పతిల్లు మీఁగాళ్ల దడవె
నంగనామణిగాత్ర మనంగనవని
ధానఖని యేమొకాని భూజాని చూపు. 73

తే. గీ. అతివ ధమ్మిల్లకేకిఁ బాయక భజించి
తన్మయతఁ జెందఁ బోలు భూధవుని దృష్టి
తతపయోధర గిరులపైఁ దారు నారు
చిలువఁ జలపోరు నతనాభిబిలము దూరు. 74

కం. జనలోక పాకశాసను
మనసున కబలావలగ్న మగ్నాలోకా
తనువృత్తి నెంత లోలత
యొనరెఁ జవలసంగదోష మూరక చనునే? 75

కం. చక్రస్తనీ కనత్కటి
చక్రంబు విచిత్రభంగి శరనిధిరశనా
చక్రేశ్వరునెద మదనుని
చక్రముక్రియ మోహభర మెసఁగ భేదించెన్. 76

కం. వారాశి వలయితేలా
సారశ్రీఁ దనివిఁ గొనని జననాయకదృ
క్తారలకు నిందుమతి రెం
డూరులచెలు వెంత వింతయో యరుదయ్యెన్. 77

సీ. కొప్పుఁ జీఁకటి గప్ప నొప్పుదప్పిన కొంకు
లపన చంద్రజ్యోత్స్న నపనయించి
నును జెక్కుఁ జరుల జబ్బునఁ జారిన యలంత
మెడపోఁక బోదియఁ దడవి యడఁచి
వలుద చన్గొండ మిట్టల మెలంగు శ్రమంబు
వళి తరంగముల యోలలఁ దొలంచి
నాభికూపంబులోన మునుంగు బిమ్మిటి
జఘన సైకతము రచ్చలఁ దొరంగి
తే. గీ. పటు నితంబ చక్రస్థితిఁ బాటిలు భ్రమ
యూరు కదళీ తరులతోడ నొదిఁగి తొరఁగి
తరుణిమై నాంఘ్రిమస్త మద్ధరణి విభుని
చూపు లేపులు మీరి తీదీపులాడు. 78

కం. కాంతామణిపై నవనీ
కాంతుని తల పట్టు దొరలఁగలికి కతనిపై
నంతసిలె మనను యద్భా
వ్యంతద్భవతియను లోకవార్త నిజముగన్. 79

చ. యుగయుగళంబు గేలిఁగొన నొప్పు భుజమ్ములు పూర్ణచంద్రునిన్
నగు నగు నెమ్మొగంబు పరిణద్ధ గళంబు విధంబు క్రేవలన్
నిగనిగ లీనుమే యొఱపు నిక్కు భుజమ్ములుగాంచి వీనికిం
దగుఁ దగుతే మనంగనని తామరసానన సానురాగయై. 80

శా. ఆలోకించుఁ దదంగ వైభవము నత్యాసక్తిఁ గన్నారఁగా
నాలోకించుఁ దదంగ సీమ సుమమాల్యంబున్ బ్రతిష్ఠింపఁగా
నాలోఁగ్రించుఁ దనంబునన్ మదనుఁడేయం దత్తరించున్ మనం
బాలోకేశ్వరి కట్టుగాఁగని సునందాబ్జాస్య దా నిట్లనున్. 81

శా. కోక స్తోక విలాస జిల్లన్లలిత వక్షోజాత వైవస్వతా
ఖ్యాకుందామను వర్యమాన్వయ కరుండై యొప్పుఁ దత్సంతతిన్
శ్రీకంఠోపముఁ డాకుకుత్స్థుఁడుదయించెన్ వాని పేరన్ భువిన్
గైకొం డ్రుత్తర కోసలేంద్రు లెలమిం గాకుత్స్థనామాంకమున్. 82

ఉ. వెండియు నయ్యశేష పృథివీపతి గోపతి నెక్కి దైత్యులన్
గండడఁగించు నాఁటి శితికంఠుఁడ పోలె మహోక్షమైనయా
ఖండలుపై వసించి కడఁకన్ దొలివేల్పులఁదోలి గెల్చి యీ
తండు గకుత్స్థరూఢిఁగనెఁ దత్కకుదగ్రమునన్ వసించుటన్. 83

ఉ. అంగద మంగదంబు నొరయంగ బిడౌజు నమూల్యరత్న పీ
ఠింగదియంగ నుండి ప్రకటింపుచు దైవతవంది బృందముల్
సాంగశతాశ్వమేధ మహిమావగతేంద్ర పదస్థలేందిరా
లింగితయంచు నెంచఁగ దిలీపుఁడు మించగు వాని సంతతిన్. 84

సీ. ఏరాజు రవికులాధారమై యంశుమ
ద్రాజగర్భాబ్ధి నుద్భవము నొందె
నేరాజు జేజేలు చేరి పనుల్ సేయ
హయమేధములు నూఱు నాచరించె
నేరాజు పిలువని పేరంట మేఁగి యా
శరకోటి నురుమాడి సురలఁగాచె
నేరా జహంకార హృతవజ్ర హేతియౌ
రత్నచూడా మరారాతిఁ దునిమె
తే. గీ. నతఁడు సప్తార్ణవీపరీ తావనీభ
రణ సముద్దండ మండలాగ్ర ప్రచండ
నిజభుజార్గళతోషిత భుజగలోక
పాలకుండు దిలీప భూపాలకుండు. 85

శా. ఆరాజన్యకు లావతంసము రణాహంకార హుంకార స
త్కారాచార హృతాతిరోష పవిజాగ్రద్రత్నచూడాఖ్యదే
వారాతిన్ విదలించి తద్విజయ శుల్కానీతయౌ మాగధ
క్ష్మారాజాత్మజఁ బెండ్లియయ్యె సురసంఘంబుల్ పనుల్ సేయఁగన్. 86

కం. రఘుఁడా నృపతికిఁ బుట్టి ని
రఘుఁ డధరితశతముఖుఁడు గుణాలఘుఁడు నితాం
తఘటిత విశ్వజిదాఖ్యక
మఘుఁడై యసమాన మహిమ మహి భరియించెన్. 87

మ. చతురంభోనిధి మేఖలావలయ రాజద్రాజ రాజత్కిరీ
టతటోత్కీలిత పద్మరాగరుచి కూటస్ఫూర్త బాలార్క సం
తతదీధిత్యనుయోగరాగ వికసత్పాదాంబుజాతోన్నతో
న్నతుఁడై యొప్పు దిలీపసూతి వికసన్నాళీక పత్త్రేక్షణా! 88

మ. భుజశౌర్యోన్నతిహారి రా రఘు నృపాంభోజారికిం బావన
ప్రజన ప్రాత సుధీవిధార ఘనధర్మస్తోమ నిర్వార స
ర్వజగద్గీత ఫలప్రదాత సుకథార్థప్రాత సంస్తోత్ర భూ
యజమానేత జనించె సుత్పలదళాభాక్షుండ పద్మేక్షణా! 89

చ. చెలువము ప్రాయముం గులము శీలము ధైర్యము నీతిసత్యమున్
గలిమి వివేకముం గరుణ గౌరవమున్ శమముం బ్రభుత్వమున్
బలిమి వితీర్ణి కీర్తి మతి పౌరుషముం దనయందె చాలవ
ర్తిల విలసిల్లు నీయజు వరియింపుము పూర్ణసుధాకరాననా! 90

చ. అన నతనిం గనుంగొని మృగాక్షి సునందకు నాన్నృపాలుపైఁ
బెనఁగొను వాంఛితంబు వినిపింపక సిగ్గున నుండ నప్పుడా
యనవరతానురాగభర మావరవర్ణిని గాత్రవల్లిఁ జ
య్యన వెడలెన్ సమగ్రపులకావళికాంకుర కైతవంబునన్. 91

సీ. తళుకుఁ జెక్కులకాంతి దశదిశలును గ్రమ్మి
క్రొమ్మించు చూపులఁ బ్రోదిసేయఁ
దళుకుకాంతుల మీఱు తారహారశ్రేణి
యలరు పాలిండ్ల నృత్యము లొనర్పఁ
జెలువైన మంజీర శింజారవములకు
దండల రవళి కైదండ యొసఁగఁ
దోరంపు పిఱుఁదు బంధుర భరంబున కోర్చి
చిఱుతొడల్ నిగనిగజిగి వెలర్పఁ
తే. గీ. దత్పురఃస్థలి శిబిక నాతరుణి డిగ్గి
చెలుల కైదండఁ గుచ్చెలఁ జేర్చికొనుచుఁ
దెలివి నడయాడు క్రొమ్మించు తీవె యనఁగ
మంచకము నెక్కె రాజస మహిమ వెలయ. 92

ఉ. వాతెఱ మందహాసమును వాలుగు కన్నుల సిగ్గు గర్వముం
బ్రీతి మనోజ తాపమును బింకపుఁ జన్నుల నుబ్బి [1]తార్కొనం
జేతి మధూకదామకముఁ జేరి గళంబున నుంచె నంతలోఁ
జాతురిరాజుమేని యరచట్టు వకావకలయ్యెఁ జూడఁగన్. 93

కం. అనురాగ రసతరంగం
బనఁ దత్క్రియ వైచుదామ మజుపైఁ దనరెన్
ఘనకుచ కంఠాశ్లేషం
బొనరింపఁగ బాహులతిక యొప్పెడు లీలన్. 94

1. నుచ్చి.

సీ. అంతట నక్కన్నెయన్న యన్నరనాయ
కాకార మేర్పడ ననుజ చెలువుఁ
దప్పకచూచి యత్యంత సంతోషిత
స్వాంతుఁడై కదిసి మంచకము మీఁది
రాజీవహితవంశ్యు రమ్మని చేయిచ్చి
ఛాయనా నయ్యెడ డాయవచ్చు
ననుజ నేర్పున కాత్మ హర్షించి మెచ్చుచు
నిరువురు డిగ్గిరా నిలకు నచట
తే. గీ. నందలం బెక్కుఁడని పల్కి యతని నిందు
మతినిఁ గాంచన శిబిక సమ్మతినిఁ జేర్చె
దేవసేన భజింప మున్ దేవసేన
గుహునిఁ దోడ్కొని చనునట్టి మహిమ వెలయ. 95

ఉ. హర్షము దక్కి యంతట స్వయంవర లగ్న సమాగ తాధిపుల్
శీర్షము లొయ్య వాంచి తమసేనలు దామును జేరిపాలెముల్
సర్షపరాజిఁ జల్లినను సందొకయించుక యీని సేనతో
వర్షముగాఁ బ్రసూనములు వారిజలోచనలెల్లఁ జల్లఁగన్. 96

తే. గీ. పట్టణముఁ జొచ్చి చతురంగ బలముతోడ
వాద్య ఘోషంబువలన దిగ్వలయ మద్రువఁ
నాడనా డాట చెలులు జవ్వాడ ధరణి
మహిమ వెలయంగ నారాజమార్గముననుఁ. 97

సీ. చల్లని పన్నీరు చల్లనెల్లెడలను
కొదమగాడ్పులబృంద మెదురుకొనఁగ
సాంద్రకేతన సితచ్ఛత్ర తోరణములు
ప్రబలమై యాతపపంక్తిఁ దఱుమ
పూవుఁ జొప్పరములం బొడము తేనియసోన
కగరు ధూపము లంబుదాగమముగ
నీరాజనంబులు నెలఁత లిచ్చుచుఁ జూపు
తొగల పూజనములు నెగడఁ జేయ
తే. గీ. నితని చక్కఁదనంబున కీలతాంగి
యీలతాంగికిఁ దగుభర్త యీతఁడనుచు
శాతకుంభ మణికుంభ సౌధములను
నిలిచి చూచిరి పురి నీలనీల కచలు. 98

కం. హరునకు నానగజాతకు
హరికిన్ లక్ష్మికిని వాణి కజునకు శచికిం
బురుహూతునకుందగు క్రియ
నిరువురకుం దగియె నౌరుల కీగతి గలదే. 99

మ. అని వీక్షించుచు నమ్మదాంబునిధి నోలాడంగఁ బౌరుల్ కన
త్కనక గ్రావ వినూత్న శృంగనిభ సౌధంబుల్ హజారంబులున్
ఘన వప్రంబులుఁ జంద్రశాలలును శృంగారంబు గావింప శో
భనలీలం గనుపట్టు రాజగృహమున్ భావించి రాజయ్యెడన్. 100

కం. పల్లకి డిగి యాలోనవె
పల్లవశయ లారతులు శుభంబున నొసఁగన్
సల్లాపంబులఁ దత్పుర
వల్లభుఁడును దోడుకొని ధ్రువంబుగ నునుపన్. 101

తే. గీ. ఎలమి నిందుమతీదేవి నించుబోఁడు
లమిత శుభవైఖరుల నగరపుడు చేర్చ
రవ్విదర్భాధిపతి యజు నచట నునిచి
వచ్చి విడిదిని వెలయించి వస్తుసమితి 102

తే. గీ. ప్రియముతో భోజభూపతి పెండ్లికొడుకు
పెండ్లికూఁతును గావింపఁ బృథివిపతికి
నిందుమతికిని వేఱ్వేఱఁ జందనంబు
నక్షతలుఁ బంపె నతివైభవాగమముల. 103

కం. అలికిరి మృగమదమున ముు
గ్గులు వెట్టిరి కప్పురమునఁ గురుఁజులు కదళీ
ఫలతరు తోరణపంక్తులు
వెలయించిరి నగరి నగరి వీధుల నెచటన్. 104

సీ. భేరీ మృదంగ గంభీర శంఖాదిక
తూర్యముల్ మ్రోయఁ జాతుర్యసరణిఁ
గానుకలులు పాలు కప్పముల్ దిక్కుల
ధరణీశు లనుచు సందడి చెలంగఁ
బౌరవారాంగనా పాఠక కవిగాయ
కానీక మెల్లెడఁ గ్రందుకొనఁగ
స్యందన సారంగ సైంధవా రూఢులై
వచ్చు భూభుజులు చావడులు నిండఁ

తే. గీ. బట్టు తెఱ లొప్పఁ జనుదేర పాలకీలు
వేడ్కఁ గడియారములు గాంచి విప్రవరులు
లగ్నసమయం బటంచుఁ బల్కఁంగఁ గదిసి
యైదువలు బాడుచుండఁ బేరామనిగను. 105

వ. అప్పుడు. 106

కం. ఇందుమతీందుముఖీమణి
చెందిరపుం బోడులు ధాత్రిఁ జిలుక నడచిరా
సుందరు లునిచిరి తమిఁజను
బిందియ లదరంగఁ బసిఁడిపీఁట వసింపన్. 107

కం. జడ విప్పి తావిమానియఁ
దడఁబడ హారమ్ములోర్తు తాఁదలయంటెన్
గడగడ వడఁక వలగ్నము
కడియమ్ముల రవము తాళగతులకు మొరయన్. 108

కం. గంధపు టటకలి వెట్టిరి
కుందనపుందంబుగలను గొజ్జఁగి నీరిం
దిందిరవేణులు ముంచుచు
నందంబుగ జలమార్చి రంబుజ ముఖికిన్. 109

తే. గీ. నెరులఁ దడియార్చి మరువమునీలమణులఁ
దుఱుము తుఱుమున నెఱిఁబెట్టి తుఱిమివిరులచే
నలికతలమునఁ దిలకంబుఁ గలికి కన్నుఁ
గవను గాటుకఁ దీర్చిరి గావి గట్టి. 110

సీ. చెవులనుం జవులెచ్చు నవమౌక్తికమ్ముల
కమ్మల నమరించెఁ గొమ్మయొకతె
మెడ గొప్ప కుప్పన మెడనూలు బెడగొప్పఁ
దారహారముల దాఁదార్చె నొకతె
కరములఁ బచ్చలతాకడియముల్ దండలు
తాయెతుల్ నమరించె తరుణి యొకతె
కటిని నొడ్డాణంబు గంటల మొలనూలు
ప్రేమ దైవారంగఁ బెట్టె నొకతె

తే. గీ. పసిఁడి మెట్టెలు పిల్లాండ్లు బావిలీలు
హంసకము లుంగరమ్ములు నాదియైన
భూష లమరించి కుంకుమఁబూసె నొకతె
రమణి యొక్కతె కంగుల రవికఁ దొడిగె. 111

వ. అంత. 112

వా. హారంబుల్ బిగిగుబ్బలు గునియ నృత్యత్కంకణాలీఝణ
త్కారంబుల్ కరతాళ మానముల వక్కాణింప నాసామరు
త్పూరంబుల్ వికచాబ్జవాసనలఁ దోడ్తోఁనింపఁగాఁ గంబుకం
ఠీరత్నంబవు డోర్తు రాజు శిరసంబెం దావిత్తైలంబునన్. 113

కం. గందవుటటకలి యొక విక
చేందీవర నయన యజున కిడియెన్ మధులి
ద్బృందంబుపైఁ బరాగము
పొందుగ నందంద చిందు పూఁదీవ యనన్. 114

మ. వళిసౌభాగ్యము నారుతీఱు కుచలావణ్యంబు దోర్మూలరే
ఖలయందంబు బయల్పడన్ బడుగులేఁగొ నల్లడిన్ గ్రుక్కని
క్కిలతాంగుల్ వడినంది యీనొక కురంగీ నేత్ర వైచిత్రితో
జలకంబార్చెఁ బసిండి బిందియల భాస్వద్వంశ రాణ్మౌళికిన్. 115

శా. పారీణత్వ మెలర్ప నోర్తు జిలుగున్ బైతాణి చెంగావి నిం
పారంగాఁ దడియొత్తియొత్తి శిర సౌయ్యారంబుగా నార్చి వా
ల్గోరుఁ ముక్కుల దువ్వి పెన్నెరులు చిక్కుల్ దీర్చి కీలించె శృం
గారం బెల్లను గుప్పసేయుక్రియఁ జొక్కాటంబుగాఁ గ్రొమ్ముడిన్. 116

సీ. ఒకతె జిల్గుమడుంగు లొఱపుగా నందిచ్చె
నొకతె వాసిత ధూపమొనర నిచ్చె
నొకతె కస్తురినామ మొయ్యారముగఁ దీర్చె
నొకతె చందనచర్చ యొఱపుఁ జేర్చె
నొకతె పూవులసరు లుదుటు మీఱఁగఁ బెట్టె
నొకతె పట్టురుమాలు సికను జుట్టె
నొకతె రత్నవిభూషణకులంబు సవరించె
నొకతె చెంగట వజ్రముకుర ముంచె

తే. గీ. నొకతె సవిలాస చంచల చకిత హరిణ
నిర్భరాలోకన సదృక్ష నిజకటాక్ష
రమ్యధగధగిత మణి నీరాజనంబుఁ
దరుణి దారాజనందన వరున కొసఁగె. 117

కం. రమ్మ శుభవేదికిని ల
గ్నమ్మిదె వచ్చెనని సన్నఁ గావించు క్రియం
గమ్మకపురంపు సురటినిఁ
గొమ్మ యొకతె విసరెఁ దావి గుబులుకొనంగన్. 118

తే. గీ. అపుడు భోజావనీజాని యనుమతమునఁ
దత్పురోహితుఁ డిదె ముహూర్తంబు నికట
మయ్యె జాగొనరింతురే యనుచుఁ బలుక
విడిది వెడలి నృపాలుండు ద్విపము నెక్కి. 119

సీ. కాంచన మయ చూత కదళీ ఫలంబులు
నారంగములు గొంచు నడచిరాగ
శోభన వాద్యముల్ ... ... ...
కంచుకి వ్రజము రవము (గ్రంథపాతము)

తే. గీ. స్తపములును మీఱ మౌక్తిక ఛత్రములును
దివ్విటిలు నోలి సాంద్రమై నివ్వటిల్ల
రజత వర్ణగజంబుపై నజుఁడు వచ్చె
నగ్గలిక మంత్రి కైదండ డిగ్గి యచట. 120

కం. పాదాభిషేచనం బపు
డైదువ లొనరించి మణుల నారతు లొసఁగన్
వైదర్భిఁ జూచు హృదయా
మోదముతో నగరుఁ జేరి మోహన లీలన్. 121

ఉ. శ్రీవిలసిల్లు మానికపుఁ జెక్కడపుంబని గిల్కు జాళువా
బావలు మెట్టి యొర్తు కరపంకజ మూఁతగఁ బట్టి యారఘు
క్ష్మావరుపట్టి కంచుకులు చాఁగుబలా జతనయ్య సమ్ముఖా
దేవ యటంచు హెచ్చరికఁ దెల్పఁగ వచ్చి సమంచితాకృతిన్. 122

మ. సుమముక్తాఫల దామ చామరము లక్షుద్రేక్షు కాండంబులు
కమలేందీవర కేతకీ ముకుళముల్ కల్హారముల్ హైమవ
ద్రుములుం బల్లవ తోరణౌఘకదళీ స్తంభంబులున్ మీఱఁగా
రమణీయం బగునట్టి పెండ్లి చవికన్ రాజాననల్ పాడఁగన్. 123

కం. అవరంజి పెండ్లి పీటను
నృపచంద్రుఁ డొయ్యార మొప్ప నెలమి వసించెన్
విపులామర సంఘముతో
నపుడు వసిష్ఠుం డొనర్ప నర్ఘ్యక్రియలన్. 124

కం. భావయపుడతని చెలువము
భావమునకు విందొనర్ప బదులొసఁగు క్రియన్
శ్రీ వెలయఁగ మధుపర్కము
కోవిద సమ్మతముగాఁగఁ గూర్మి నొసంగెన్. 125

సీ. ఫాలార్ధ చంద్రుఁ గప్పఁగఁ బర్వు తిమిరంపుఁ
గుప్పో యనఁగ నొప్పు కొప్పు పొదల
వదన కాంతి రస ప్రవాహంబులో బెళుకు
గండుమీలన నాలుఁగన్ను లలరఁ
దలఁపు తెల్లను గొన వెలయొడ్డిన ధనంబు
కుప్పలో యన గబ్బిగుబ్బ లడర
నతిభుగ్న రోమరేఖా [1]జిరంబునఁ దోఁచు
తమ్మినూలనవలగ్నమ్ము చెలఁగ
తే. గీ. పిఱుఁదు గమకంబు నడల గంభీరిమంబు
డంబు శృంగార సారోదయంబు నమరఁ
గన్య ప్రమదా సమూహ మూర్ధన్య నొఱపు
మీఱఁదోడ్కొని తెచ్చిరి పేరటాండ్రు. 126

కం. వరున ధ్రువంతే రాజా
వరుణో ? యని చెలఁగి మౌనివరులు చదువఁగాఁ
దరుణిం బెండిలిపీఁటను
తెఱవలు గూర్చుండ నిడిరి స్థిరతరలీలన్. 127

శా. కాకల్యంచిత కోకిలారవము జోకన్ పీఁకలన్ మీఱిపై
ణాకంతుల్ మునుమున్నుగా వరుసవెంటం బాడ ప్రీడావతుల్
డాకల్ దీరెడు బెళుకుచూపుగమి నంటన్ బర్విరోధింప గౌ
రీ కల్యాణపుఁబాటఁ బాడిరి ధరిత్రీలేఖరేఖా వతుల్. 128

1. ఖాజినంబు.

కం. తెఱవల్ వధూవరులకుం
దెరనడుమంబట్టి రందుదేలెన్ సరిని
ర్వ్యర చూపులు గగనధునిన్
[1]గరకల నెదురెక్కు వాలుగల చందమునన్. 129

మ. చెలిపాణిగ్రహణంబు భూవిభుఁడు దాఁజేసెం బ్రమోదంబునన్
జలజంబున్ జలజంబు గూర్చుక్రియ నిచ్చన్ గన్నె హర్షాబ్ధిని
మ్ములనోలాడరసాభివృద్ధి వెలికిన్ మోత్తుచుంఁ దోఁచెనా
కలితోద్గారత బాహువల్లి చెలువై కన్పట్టె నూత్నంబుగన్. 130

కం. కంకణములు గట్టించిరి
కంకణ రావములు దిశలఁ గడలు కొనంగాఁ
బంకజ ముఖి నజునకు ని
ష్పంకమతిన్ దారవోసె భ్రాత సుభక్తిన్. 131

కం. పొంగుచు భూసురముఖరా
భంగా శీర్వాద తతులు భాసిల నపుడ
య్యంగన గళమునఁ గట్టెన్
మంగళసూత్రంబు నజకుమారుండెలమిన్. 132

చ. కళుకువెలంది ముత్తెములు క్రమ్మన దోయిట ముంచి ముంచి భూ
వలయ బిడౌజుఁ డిందుమతి వాలగు కన్నులడాలు మేకొనన్
దెలివిడిఁ జేయిమించవలె దేవ యటంచును హెచ్చరించుచున్
భళియన నాప్తులెల్ల తలఁబ్రాల్ ప్రమదంబునఁబోసె నవ్వుచున్. 133

ఉ. రాజసుతాంగ సంగభవ లాగరసంబటు దోచెనా ప్రభూ
మాజనితాంజనాశ్రువుల నాఁగి త్రపాస్తిమితంబులై స్ఫుటాం
భోజముతేంట్లు వోలె ముఖమున్ దెలిగన్నులలంకరింపఁగా
లాజలు వేల్చెనంత నవలా విధి వద్ధృతపాణి పద్మయై. 134

కం. లోకముల చెలుల మస్తము
లీకన్నియ ద్రొక్కునంచు నిచ్చఁ దలఁపుచుం
గాకుత్థ్సుఁడు చెలిపాదము
చేకొని సనికల్లు ద్రొక్కఁజేసెన్ లీలన్. 135

తే. గీ. గురుపురోహిత వరపురస్సరము గాఁగ
సఖులకైదండఁ దాపెండ్లి చవికె డిగ్గి
ధరణినాథుఁ డరుంధతీ దర్శనంబుఁ
జేసె జాయాసమేతుఁడై శ్రీకరముగ. 136

1. గణికల.

చ. ఇటులు సులక్షణైక ఖని నీవరవర్ణిని నివ్విభుండు వి
స్ఫుటవిధిఁ బెండ్లియయ్యె నిఁకఁ బూర్ణమనోరథ సిద్ధి వీరు గాం
చుటకు నిదర్శనం బిదియ సుండని గుర్తిడినట్లు భర్తకున్
గుటిల వినీలకుంతలకుఁ గొంగు కొనల్ ముడివేసి రత్తఱిన్. 137

చ. అపుడు ప్రదక్షిణార్చుల శుభావహనీయ సమంచితానలం
బపరిమిత ప్రమోదకర మౌచు సమున్నతిఁ దేజరిల్లఁగా
నృపకుల మౌళి కేలఁగొని యిందుమతీ రమణీలలామ మ
వ్వపుఁ దనువుల్ చెమర్పవలవచ్చె యథావిధి వేల్చి హవ్యమున్. 138

చ. జిగిగల పద్మరాగములు చెక్కిన కంకణముల్ చెలంగఁగా
మగువలు శోభనాక్షతలు మౌళియుగంబున నుంచి దీవనల్
నిగుడఁగఁ దేనియల్ వడియు నిద్దపుమోవుల లేఁతనవ్వుతో
నగునగు నంచు మెచ్చుక్రియ నారతు లిచ్చిరి మోము చూపుచున్. 139

సీ. కనకరం భాదళకమనీయ భాజన
శతము లొక్కట తారనముగఁ జేర్చి
సమశీల వంశాభి జాత్యము దనరంగ
మణిమయాసనముల మహిమ వెలయ
పెండ్లి కొమారుని పెండ్లి కూఁతును చెలుల్
తెచ్చి పొత్తుననుంచి దీమసమున
నమృతోపమాన భోజ్య పదార్థ వస్తువుల్
దాపింపఁ దండోప తండములుగ
తే. గీ. నిష్టగోష్ఠిని బంధువులెల్లఁగూడి
ప్రేయసీ సంయుతము గాను బెండ్లియింట
నర్థి బువ్వన భుజియించి రపుడు మంజు
లాననాంభోజముల నగ వామతింప. 140

కం. ఇరవైనన గొప్ప కెంపుల
హరివాణములన్ మణులు తులాంబరములు నొం
డొరు లిచ్చి చెలికి నృపకుం
జరునకు సంప్రీతి వీళ్లు చదివించి రొగిన్. 141

సీ. ఆశాకరీంద్ర నిజాంశమ్ముల జనించు
భద్రకుంజరములు పదివదులును
హరిహయ జవన సత్త్వారూఢిచే మించు
నుత్తమ వాహంబు లొక్కవేయి
కౌస్తుభ ప్రతిమాన కాంతికి వెలుఁగొందు
మణులఁ దావించిన మండనంబు
యక్షేశు పుష్పకంబన దివ్యమై మనో
జవమున వర్తించు స్యందనంబు
తే. గీ. వాసిగలవాలు శార్ఙ్గ శరాసమునకు
జోడయినవిల్లు మగఱాలజోడు నపుడు
నలువపేరి యస్త్రంబును నలవిదర్భ
మండలాఖండలుఁడు కూర్మిమఱఁది కొసఁగె. 142

సీ. మేలైన మృదుహంస తూలికా తల్పముల్
మంచి చప్రపుఁగోళ్ల మంచములును
లలిఁబల్కు పట్టుఁ జిల్కల పంజరమ్ములు
భాసురతపనీయ భాజనములు
జవ్వాది పిల్లులు చంద్రకీ నిచయంబు
కస్తూరిమెకములు కలరవములు
దంతపు దువ్వెన తళుకు రత్నపు బొమ్మ
లందంపుఁబట్టెలు నద్దములును
తే. గీ. మగువకునునన్న యుడిగంపుఁ జిగురుఁ బోండ్ల
నొసఁగి మణిమయ భూషణ యుతముగాఁగ
నెలమి ముక్కాఱు పంటల నొసఁగు మంచి
గ్రామములువేయు మఱి హరిద్రకు నొసంగె. 143

తే. గీ. అన్న యారీతిఁగావలె నన్న వస్తు
పరికరము లెల్ల ననుజసుఁబతికి నొసఁగి
యనుపఁ దన్మాత తనుజాత ననునయించి
కలఁగుచు హితోపదేశము ల్గాఁగఁ బలికె. 144

సీ. దాక్షిణ్యమున భర్త తనమాట వినునని
నింపుగానివి విన్నవింపరాదు
కోపించి ప్రియుఁడు వాకొనిన నొక్కొకవేళ
ననవచ్చునా యని యలుగరాదు

వలసిన భూషణంబులు వల్లభుఁ డొసంగ
నిచ్చుఁదా నెవరికి నీయరాదు
పతితను లేపెడి పర్యంతమును సెజ్జఁ
బొదువ నమ్మెయి నిద్రఁబోవరాదు
తే. గీ. దండు వెడలిన పరిమళ ద్రవ్యములకుఁ
జెలువుఁదటువచ్చు దనుక నాసింపరాదు
మగఁడు భుజియించు నందాఁక జగతి నొంతు
తాను భుజియింపఁగారాదు మానవతికి. 145

తే. గీ. అమ్మ మావంటి యిల్లాండ్ర కందఱికిని
బుద్ధిఁ గఱపంగ నేర్చిన ప్రౌఢవీవు
మేలనఁగఁ బుట్టినింటికి మెట్టినింటి
కెట్లు దెచ్చెదొ కీర్తి రాకేందువదన ! 146

చ. అని యిటుపల్కి ప్రేమ మొకయంతఁగఁ జుమ్మలుచుట్టి నక్కటా
తన పగవారికిన్ వలదు ధారుణి నాఁటది పుట్టనంచున
క్కున నిడి బాష్పపూరములు గొబ్బునరా నభిషేచనమ్ముగాఁ
దనయను గౌఁగిటం బొదివెఁ దల్లియుఁ దల్లడమంద నందఱున్. 147

కం. ఈలీల జనని కౌఁగిట
బాలామణిఁబొదివి యొరుల పాలైతివనం
జాలకెడఁ బాయఁ జాలని తన
వాలుంగన్నులను బాష్పవర్షము గురియన్. 148

ఆ. వెక్కివెక్కి యేడ్చువేళఁ దత్సోదరుఁ
డొనె యల్లుఁగుల్లు నగడుసేయ
పరువె వచ్చి యదిగొ పల్లకిఁ బట్టినా
రనువరాదె కూఁతు ననుచుఁబలికె. 149

చ. పదముల వ్రాలు సోదరిని బాహువు లూఁతగ లేపనెత్తి తా
ముదమునఁ గౌఁగిటం బొదివి మూర్ధము మూర్కొని బుజ్జగింపఁగా
మదవతి యన్నపాదముల మజ్జన మార్చెను బాష్పవారిచే
గుదులుగ రాలు తజ్జలము గోరను మీటుచు నూఱడింపుచున్. 150

చ. అతుల గుణప్రతాన నిధియైన రఘుక్షితిపాల నందనుం
డతఁడిలునించుకోవలె ననంగ ననంగ సమానుఁడైన నీ
పతి నిపుడుంపఁగూడదని పంపుట యంతియ పిల్వనంపెదన్
మతి నిటువంతఁ జింతిలఁగ మానవతీమణి నీకుఁ జెల్లునే. 151

వ. అని సవినయంబుగా నగ్రజుండు వనుపఁగాళ్ల ప్రేళ్లం బెనంగు
నాత్మజం జూచి తల్లి యిట్లనియె. 152

సీ. చన్నిచ్చి నిన్నుఁ బోషణ చేసి పెనిచిన
దాదులె తల్లులు తల్లి నీకు
నా బాల్యముననుండి యనిశంబు నినుఁగొల్చు
చెలులు తోఁబుట్టువుల్ చిగురుఁబోఁడి
రమణఁగైసేయు సైరంధ్రు లీయింతులు
నీ కంగరక్షయో నీలవేణి
కోరి వేఁడియు నీవె కూర్మిమించ వరించు
పతియె యింకిటఁ బ్రాణబంధుఁ డబల
తే. గీ. ఇకవురాలైన యీ పురోహితుని పట్టి
నామతీర్థంబు సకియ నీ ప్రేమ కిరవు
లిందఱనుగూడి యత్తవారింటి కేఁగు
నీకు మామీఁది మమత మన్నింపఁదగదె. 153

కం. దివ్వెలకుఁ బిలువ నంపెడ
నవ్వని యెన్నంగ వలదు నావల్కనితా
నవ్వి ప్రియోక్తుల వేడుక
జవ్వని నోడఁబఱిచి యనుప సముచిత లీలన్. 154

ఉ. చండకరాన్వయుం డపుడు జాయను దోడ్కొనితా సవిస్ఫురా
ఖండల వైభవంబున విరాసిత హృద్యసుజాతుఁ డౌచు రాఁ
గుండిన రాజధానికి నకుంఠిత లీలవచ్చియున్న యా
మండల నాథులందఱును మానస వీథులఁ దమ్ము కోయుచున్. 155

కం. ఇందఱముఁ జూడ నీతఁడు
కుందనపుం బొమ్మ నెత్తికొని పోఁదగునే
యందంబులఁ దమసేనా
బృందంబులఁ జూడ కనుచు భీషణలీలన్. 156

సీ. వెలిపాళెములనుండి వెడలి శీఘ్రముగ వెం
బడిఁ గరిహరి రథ భటచయంబు
సామజౌఘము రాఁగఁ జని కొంతదూరంబు
చదలంబు సపలి దేశమున నునిచి

హావినికెచూచు కయనులుగా నల్లమూ
కలనిల్పి హరుల నాకడల నునిచి
బాణము ల్పఱపించి బయలగు చోటుల
గుట్టలపై ఫిరంగుల ఘటించి
తే. గీ. పరువునేలకు నెడగల్గఁ దరుల నండ
దండి బారులతోడ నుద్దండ లీలఁ
గొమ్ముఁగత్తులు గట్టించి కుంజరముల
కెలమి రధికులతో నెదురెదురె చూడ. 157

కం. చతుర చతురంగ సేనా
యతిఁ దన్మార్గమున వచ్చు నజుఁడయ్యెదుటన్
బ్రతి పక్ష సామజమ్ములఁ
గతిపయ దూరమునఁ గాంచి కౌతుక మొప్పన్. 158

కం. తనసేనలనెన గొల్పిన
ఘనతర వీరానకములుఁ గాహళములు బి
ట్టనిమొన మొరయఁగఁ గోయని
మును మున్నెలగోలు మ్రూఁక మ్రూఁగిన నంతన్. 159

ఉ. వారల మీరఁ జాలియు జవమ్మున తమ్మటముల్ దమారముల్
బోరు కలంగ సింహముల పోల్కి విజృంభితలీల నార్చుచున్
ధీరతఁ దాఁకిన న్మెఱసెఁ దీవ్రతరార్చుల ఖడ్గము ల్చమ
త్కారము మీఱ మస్తములు కందుకలీల నటింపఁ బెల్లుగన్. 160

కం. ఆలీలల నిరువాఁగును
గోలాహలముగ రణంబుఁ గొనకొని చేయన్
దాలిమిఁ జూచుట తగదని
యాలోచనఁజేసి సంగరావని డాయన్. 161

చ. అపు డజరాజు భోజతనయామణిఁగాప సుహృద్వసుంధరా
ధిపతుల నిల్పియేపున నెదిర్చె నిరంతరగర్వ ధూర్వహో
కుపిత మనస్కతా నిరత ఘోరత రాహితరాజ వాహినిన్
ద్రిపథగ నుత్తరంగ పరిదీపిత శోణనదంబు గ్రైవడిన్. 162

ఉ. సేనలనెల్ల నొక్కమొగిఁ జిందము లార్పులు నట్టహాసమున్
దోనెసఁగన్ జవోద్ధురతఁ దోకొని దీకొనిబిట్టు దాఁకినన్
బూని కళింగపాండ్య శకభూపసుషేణ పరంతపుల్మహో
గ్రానలతీవ్ర తేజులయి స్యందనబృందముతో నెదుర్కొనన్. 163

1. వర్షకాల.

మ. రథచక్రవ్రజ సాంద్రత ద్ద్విరద కర్ణష్ఠావష విస్తారిత
ప్రథనూద్భర్శదిశాధి రేణుగణనేత్ర గ్రాహిమి త్వాంకభృ
త్పృథుకేతూత్కర ఖావితావిల జలాహృత్పార మార్థ్యస్ఫుర
త్పృథురోమాను ధానమై బలసి యొప్పెన్ భూమిరాట్సైన్యముల్. 164

సీ. ఘీంకృతిచే వినిశ్శంకసింధుర కోటి
ఖాంకృతిచే భూరిపటహపాళి
టంకృతిచే నుద్భట శరాసబృందంబు
హుంకృతిచే వీరయోధచయము
చీత్కృతిచేఁ బరిస్థిత రథికశ్రేణి
శాత్కృతిచే శరసముదయంబు
ఝాత్కృతిచే సాదిజన పరివారంబు
ఫూత్కృతిచే భోగి భూపవితతి
తే. గీ. యని తెలియనయ్యె విగ్రహోదగ్రజాగ్ర
దాగ్రహోగ్రవినిగ్రహ వ్యగ్రవిక్ర
మక్రమోభయ జలధరోన్మథన విమత
సాంద్ర తమధూతికా తమస్సమితియందు. 165

కం. నానా విధాయుధక్షత
సేనలమే లెడలి యుల్లసిలు రక్తౌఘం
బానిబిడోద్ధత ధూళివి
తానతమం బడఁప బాలతరణియుఁ బోలెన్. 166

సీ. అరిహృత సేన ? ననభిలగ్న కచనిషా
దిశిరంబు లొయ్యనఁ దెరలి పడియె
హృతిఁ జిక్కి మొనయంగ నేపరి హరిమీఁద
నొరుగు సాదిని సాదియురకవిడిచె
రదనలి విచ్ఛేది వీరభట సిజాగ్నివా
రకగజ కరసీకరమ్ములడరె
రహి మూర్ఛ దెలిసి సారథుల ప్రేరణఁజేసి
రథికోటితము నొంచు రథులఁదునిమె
తే. గీ. పటుశిరిముఖచిత శిరస్ఫలవి తాన
గళిత శిర్షుణ్యాచపక సంఘప్రది ప్ర
శోణితమధూరువై రణక్షోణి మృత్యు
పానశాలిక బోలికఁ బరఁగె నపుడు. 167

కం. ఒకఁడహిత ఖడ్గ హ్రాతమ
స్తకుఁడవుడు విమానరాజతపహించి మరు
త్పికవాణిఁ గూడి నృత్య
త్స్వకబంధ నిరీక్షణంబు సలిపెం బ్రేమన్. 168

తే. గీ. రథికు లిద్దఱు తమదు సారథులు వడినఁ
దారె రథికులు యంతలై పోరునపుడు
హరులు తెరలిన గదలచే దుర మొనర్పఁ
జన నవియు బాహుయుద్ధంబు సలిపిరంత. 169

ఆ. రథికుతోడ రథియు రౌతుతో రవుతు గ
జాధిరోహితో గజాధిరోహి
భటునితోడ భటుఁడు బలవిక్రమ క్రమో
ద్భటతఁబోరి రుభయ బలములందు. 170

తే. గీ. అంపవానల రక్తసిక్తాంగు లగుచు
భల్లముల దేహములు తూంట్లబాన లగుచు
నంగములు సాంద్రఖడ్గ ప్రహారములను
భిన్న భిన్నంబు లగుచుఁ దత్ప్రుతన నెల్ల. 171

కం. పొడు పొడుము నఱకు నఱుకుము
విడు విడువుము కినిసిప్రేయు ప్రేయు మటంచున్
బుడమింద్రెళ్ళుచు లేచుచు
విడివిడి పొరలాడి రుభయవీరులు కినుకన్. 172

సీ. దొమ్మిడి బోరాడ పోర్పులోదగ్రత
సంకులం బగునట్టి సమర ధరణి
మజ్జలు ప్రేవులు మాంసాస్థి కేశము
తతకపాలములు రక్త స్రవంతు
లెల్లెడ ఘోరమై యేనుఁగు లీనుఁగు
లుగఁగేతనచ్ఛత్రతలోల మగుచు
శకల చక్రంబులు చక్రాంగ ఖండము
లురులు హరుల్ ద్రెళ్లు నుగ్రబలము

తే. గీ. నైసురాసుర జన్యంబు ననుకరింప
ధీరులై యిట్టు లిరువాగు పోరునపుడు
శింజినీవీరభట మహాసింహనాద
తతులు విలసిల్లె ఘనభోంతరములందు. 173

వ. ఇట్లుభయబలంబులును సంవర్త వేలాభీలక్ష్వేళగళఘాలోద్వేలాశుశుక్షణి ప్రేక్షణ సదృక్షీకరణ క్షమా క్షమాక్షీణ రక్షణ మాక్షోభ ప్రతాపాటోప జాజ్వల్య మాన లోలజ్యోతిర్జ్వాలా జాల నిరస్తచండ భానుమండలంబు లగుచు చలంబులు మెఱయ సరయసంచారంబుల మొగ్గరంబులు విచ్చి చనంజొచ్చుచు ననివార్య ధైర్యంబుల హెచ్చుచు నొండురుల భుజాగర్వంబులకు మెచ్చుచుఁ గుంతంబుల గుచ్చుచు గదల నఱచుచు పొట్లంబుగా నడచుచు సబళంబులం బొడుచుచు నెదిరి సాధనంబుల నొడుచుచు చిల్లాణంబులు వ్రేయుచు బల్లెంబులఁ బొడిచి పడఁద్రోయుచు జముదాళంబులం గ్రుమ్మచు శాతాసిసముదయమ్ములం జిమ్ముచు రథాంగ ఘర్ఘరా రావమ్ముల బృంహితమ్ముల ద్విరదమ్ములఁ దఱుముచు నిశితఖురాగ్రమ్ముల ధారిణీ భాగమ్ము వగుల నాజానేయమ్ముల నూకుచు వడిగలతమ్ము దాకుచుఁ జండకర కరోగ్ర నిశిత ధారా సారమ్ములగు మండలాగ్రంబుల చాకచక్యమ్ముల చూపులు మిఱుమిట్లుగొన విహారంబులు సలుపుచు తమ తమ నామధేయంబులు తెలుపుచు శంఖంబులు పూరింపుచుఁ గుణధ్వనులు చేయుచు వెనుదీయరా దనుచు మృత్యుదంష్ట్రాభీలంబులగు బాణజాలంబుల వ్రేయుచు రణాంగణ విహారము సలుపు సమయంబునఁ దమతమ చతురంగ బలమ్ములఁ బురిగొల్పుకొని దేశాధీశ్వరులనేకముఖంబులుగా భైరవంబులగు భేరీరవంబులు సెలంగఁ గలంగక నడచిన మొన నిలువక భయాకుల మానసంబై విఱుగుడు సూపిన నిజప్రధానుండగు నయదేవుం డెచ్చరింపఁ గరిబృందంబుపై కెగయు హరి చందంబున దందశూకానీకముం గవియు గరుడుని విధంబున నంబుధర జాలంబుం దఱుము ఝుంఝానిలం బన నజుండు కవచియు నిషంగియునై కల్పాంతపరాహం బత్యుద్రరౌద్రంబున సముద్రంబుసొచ్చి విచ్చలవిడి తజ్జలంబులం గలఁచు చందంబున నమందానందంబగు డెందంబుతో రిపుసేనా సముద్రంబు సొచ్చి కలఁచు సమయంబునఁ జుట్టుకొని పుష్పపురాధీశ్వరుండైన పరంతపుం డిరువదేను సాయకంబులును సంగరరక్షాపరిష్ఠుండగు నంగరా జేఁజ్

మార్గణంబుల్లును నవంతిపతి నూఱు నారసంబులును శూరసేన ఘూనాయకుండైన సుషేణుం డిన్నూరు చండ కాండంబులును। కళింగ మండలాఖండలుండైన హేమాంగదుండు మున్నూఱు భల్లంబులును నురగపుర పురందరుండగు పాండ్యుండు నన్నూఱు కోలలఁ గోలాహలంబుగఁ జుట్టుకొనియేసి యార్చి శంఖంబులు పూరించిన మగల మగండగు నజుండు సింహనాదంబు సేసి గొఱియలగమింగినియునా వృకంబు చందంబున. 174

కం. తనపై నందఱు నేసిన
ఘనసాయకములకు రెట్టుగా నజుఁడంతన్
జనపతుల కడిఁది తొమ్ములు
దొన దొనలుగఁజించి వారి తూపులు కడిమిన్. 175

ఉత్సాహ. మట్టుపెట్టి గర్వముల్ సమానులే యెదుర్పమీ
గుట్టు మట్టుఁదెలిసె నింకఁగొంక కేగుఁడందఱున్
దట్టి గట్టి పోరఁబోరఁ దారసిల్లి వచ్చినన్
గొట్టి కొట్టి మస్తకములుగుట్ట లిడుదు ధారుణిన్. 176

మ. అని మీరేయు ప్రసూనము ల్మదికి నాహ్లాదంబుఁ గల్పించె మీ
రును నాతూపులు వింద్లు నేమఱితిరో రోసంబున న్వచ్చి మీ
తనువుల్ గీములు నాంధ్రబిడ్డలను యుద్ధక్షోణిఁ జింతింతురే
వనజాతాప్తకులంబటన్న నిఁక క్షేమం జేరి రాకేఁగుఁడీ. 177

చ. బ్రదికితి రిందు నిల్వకిఁక పొదిఁడు గాచితినేఁడు మిమ్మనన్
గదనమున న్నృపోత్తముఁడు గర్వములాడు కొనంగడంగునె
మ్మదవతితోడ నిల్వకిటు మళ్ళఁదలంచినఁబోవ నీమునిన్
బదరక నిల్వుమంచునని బల్వురు నొక్కటఁదూపులేయఁగన్ 178

సీ. తూణాగ్రమున నట్టె పాణినిల్పిన యట్ల
చూపఱ కనుఁగవ చొక్కఁ జేయు
నుడివోక జ్యావల్లి నుద్భవంబగునట్ల
నిగుడు క్రూరాస్త్రముల్ నిగుడుచుండు
ధరనెందుఁజూచినఁ దాటి పండ్లోయనఁ
బరమస్తకంబులు పడుచునుండు
ఖంగను రావంబు గదుర మైమఱుపులు
సించి తదంగముల్ సించుచుండుఁ

తే. గీ. గడఁగి నేలకుఁ గోలకు గర్వితారి
వరులఁ దెచ్చుచు నజుఁడు సంవర్త సమయ
జాగ్రదుగ్ర మహానల జ్వాల లడర
నీరసాడవి నేర్చు విహార మొప్ప. 179

చ. ముడిగొన భ్రూలతాయుగము మోమునఁ గోపము రూపమందఁగా
సడలక రోష భీషణ భుజంగమ పుంగవుభంగి నూరుపుల్
వెడలఁగ హుమ్మటంచు భుజవిక్రమ మొప్పఁగఁజే ధరించు వి
ల్లుడుసువడంగ సైన్యములఁ గ్రూరశరమ్ముల పాలు సేయుచున్. 180

కం. అసహాయ శూరుఁడై యిటు
కసిమసఁగుచు వచ్చివచ్చి కరుణ జనింపన్
దెసమాలిన యీసేనల
విసువక సమయింప నేమి వేడుక యనుచున్. 181

కం. అమ్మొకటి దొడిగి వింటను
సమ్మోహన మనువు నొడివి జనపతి వైవన్
క్రమ్మగు మూర్ఛల నందఱు
సొమ్మసిలి ధరిత్రిఁబడిరి సుర లగ్గింపన్. 182

సీ. ఆప్రియవ్రత దత్త మైన సంమోహనా
స్త్రము మహామహిమ యెంచంగ వశమె
కరులతో హరులతోఁ గాల్బలంబులతోడ
క్షితిపతుల్ తమతమ చేష్టలుడిగి
చేసున్న విండ్లును జికిలి కత్తులు తూపు
లంకుశంబులు నుండనట్ల మూర్ఛ
నవనిపై మునిఁగి నిద్రాసక్తినుండువా
రలయట్ల పడియుండి రలతనపుడు
తే. గీ. సచివుఁడును దాను నారాజ సార్వభౌముఁ
డవనితల మెల్ల వీరువారనుచుఁ గలయ
గనుఁగొనుచు రాఁగ భూభుజుల్ కళవళమునఁ
జంపకు మటంచు భీతి నంజలులతోడ. 183

కం. నేరము లెంచఁగ వలదని
యారీతి న్వినుతిసేయ నార్ద్ర హృదయుఁడై
కారుణ్య దృష్టిఁ జూచుచు
వారించుచు భయము హస్తపవన జాతమునన్. 184

తే. గీ. వీరశృంగార రసములు వెల్లివిఱియ
నిందుమతిఁజేరి ధాత్రీపురందరుండు
వింటికోపునఁ జేయూఁది వేడ్కనిలిచి
కొమ్మ సమ్మోద మనుచును గొనలువాఱ. 185

వ. ఆ లీలావతి సమీపమ్మున నిలుచున్న యున్నత బాహు బాహులేయ పరాక్రమము విలోకించి పరమమోద భరితాంతరంగులై యంతరంగ సుహృజ్జనులు సంస్తుతులుసేయ నాయిందుమతి నాయకుని ముఖంబు క్రీడామోదమ్మునఁ గనుఁగొనుచు నుండ నరదంబుపై నిడికొని రణ తలంబునం బడియున్న రాజలోకంబుం జూపి యిట్లనియె. 186

మ. పడుగుం బేకయుఁగాఁగ సంగరధలా భాగంబునన్ మూర్ఛచేఁ
బడియున్నట్టి నృపాలురన్ బ్రజల నోపద్మాక్షి వీక్షించితే
వడి నాతో దయ విన్నవించి కడుఁబ్రోవంజాలు దీవంచున
ల్గడ భక్తిం బ్రణమిల్లి లేవని గతిన్ గన్పట్టి రిప్పట్టునన్. 187

కం. అని రాఘవుఁ డిందుమతీ
ఘనవేణికిఁ దెల్పుచును జగద్వినుతాయో
ధనవైరి విజయలక్ష్మిం
గని తా వైభవము మెఱయఁగా నవ్వేళన్. 188

సీ. నడయాడు రోహణ నగములో యవియన
మణిభూషలఁ జెలంగు మత్తకరులు
గలశాబ్ధి ఘనతరంగములు పొర్లినయట్లు
నుర్వి గంపింప గంధర్వచయము
పౌలస్త్య నరద మేపాటి సాటియెయని
మనసురా మెలఁగు స్యందనచయంబు
గుహలు వెల్వడి సింహకులముగూడనయట్లు
హేతులు మెఱయు పదాతిచయము

తే. గీ. ప్రాభవముమీఱ నాప్తులౌ బంధుజనులు
జయము గైకొన్న పృథుతరోత్సాహులను
వేడ్క నరుదేరఁ గాహళావేణుశబ్ద
భేరికా మర్దళధ్వనులు బోరుకలఁగ. 189

శా. సాకేతోర్వికిఁ జేరరా నెదుట నేచాయన్ సుధాసౌధముల్
ప్రాకారంబులు గోపురావళు లగారస్వర్ణకుంభంబులున్
జోకం గన్నులపండువై వెలయునచ్చో నొక్క కేలీవనిన్
లోకాధీశకుమార మన్మథుఁడు వాలుంగంటితో నిల్వఁగన్. 190

తే. గీ. ప్రొద్దపు డెఱింగిచారులామోదవార్త
రఘునృపునితోడఁ దెలువ నారాజమౌళి
బహుతరామోద భరితహృత్పద్ముఁడగుచుఁ
బురము గైసేయఁ బనుప నద్భుతముగాఁగ. 191

సీ. గరుడాశ్మతోరణ కలిత రంభాస్తంభ
ముకుర పటాంశుక నికరములును
సాంకవ మృగమద చందన సారకా
శ్మీరలిప్త హిమాంబు సేచనముల
ఫలయుతక్రముకేక్షు జలరుహ కేతకీ
ప్రసవదామక చామర వ్రజములు
వజ్రమౌక్తిక రంగవల్లీ వితానబం
ధుర కాలికాగరు ధూపములును
తే. గీ. చిత్రకేతన నూతన చిత్రములను
గొప్పవైన యుశీరంపుఁజప్పరముల
వారచంద్రాననాలాస్య వర్తనముల
నగరి గనుపట్టె నగరిపునగరి యనఁగ. 192

ఉ. బంధులు మంత్రిపుంగవులు పాఠక సత్కవి వంది బృందముల్
గంధకరీంద్ర యానలును గ్రందుగ ముందుగఁ దామెదుర్కొనన్
గంధముఁబువ్వు లెత్తులును గస్తురికుంకుమ కట్టువర్గమున్
సంధిల బోన పుట్టికలు జ్మా పర చంద్రముఁడంపె నర్మిలిన్. 193

వ. అంత. 194

సీ. ఘణఘణ ధ్వనులతో ఘంటలు మొరయంగ
ఝుల్లరుల్ వీనులు చౌకళింప
హాటిది సూర్యప్రపుటంపు బలుజూలుపై మౌక్తి
కముల గద్దియ మస్తకంబు వొదువ

తరమాలిగను దృష్టి దండవైడూర్య సూ
త్రము లభిషేచన క్రమము దెలుప
గోమైన యపరంజి కొమ్ము కట్లకు క్రింద
లలి బురుసా పావడలు చెలంగ

తే. గీ. గోవిదార ధ్వజంబుపై కుదురు కొనఁగ
వెల్లయేనుఁగుఁగావించి విరిసరముల
నేకసరమునఁ దెచ్చి గంధేభవరము
ఘనతరా ధోరణుఁడు పొడగాన్పు సేయ. 195

క. ఆపట్టపు టేనుఁగుపై
భూపాలకసూనుఁడెక్కి భోరుకలఁగవా
ద్యాపార తూర్యములుకర
దీపిక లిరుగడల సాంద్రదీధితి వెలుఁగన్. 196

తే. గీ. బిరుదులును ఛత్రచామర బృందములును
బాణవిద్యలు నాట్యముల్ పాతకాళి
గద్యపద్యస్తవంబులు గానములును
సానికూఁతులగమి పురస్థలిని దనర. 197

మ. శ్రవణానందనరీతి నగ్రసరణిన్ సంగీత మేళంబుతోఁ
గవగాబోటులు పాతకు ల్ధవళముల్ కాంభోజిరాగమ్మునన్
వువుదండల్ పయివైచుచుం జదువ గుంపుల్గాఁ జెలుల్గొల్చిరా
చివురుంబోఁడుల మిన్న యిందుమతి వచ్చెం బచ్చటాపల్లకిన్. 198

సీ. ఈలీల రాజసంబేపారఁగ నయోధ్య
ఘంటాపదమ్మునఁ గవులు పొగడ
నుభయ పార్శ్వమ్ముల నుప్పరిగల నిల్చి
పువుల నక్షతల్ముత్తైదువలు చల్ల
పూర్ణకుంభములూని భూసురులరుదేర
నీరాజనమ్ములు నెలఁతలొసఁగఁ
గ్రొత్త గున్నాపట్టు కురుఁజులు మేరువుల్
మేరు శృంగమ్ముల మేరమెఱయ

తే. గీ. వైభవంబొప్ప నూరేఁగి వచ్చునపుడు
బాళినెక్కుచు రత్నసోపాన వితతి
నెలమి గృహరాజి మేడల నిందుముఖులు
రాజవీథులఁ జూడంగ రాజసుతుఁడు. 199

తే. గీ. అప్పు డొకబోటి పరువున నరుగుదెంచెఁ
గప్పుజడ వెన్నుపైఁ గుప్పిగంతు లిడఁగ
మారుఁ డదలించి కశఁగొని మలయుచుండ
వసుమతీశున కెఱిఁగింప వచ్చునటులు. 200

చ. జలకములాడి పావడ విశాలకటీతటిఁ జుట్టి యందుపై
వలిపముగట్టి పోఁకముడి వైచుచువచ్చె మిటారి యోర్తుభూ
వలయవిభుం గనుంగొన రువారముగా సురతాంత వైఖరుల్
తెలిపెడి బాగునన్ గమనతీవ్రత నూర్పులు నందడింపఁగన్. 201

ఉ. కూరిమి నొక్కబోటి నృపకుంజరుఁ జూచెదనంచుఁ బాణిసీ
రేరుహతారహారము ధరింపఁగఁ దామెలుపేది యంతలోఁ
జేరె మధూకదామకము శీఘ్రమున న్మెడవైవవచ్చెనౌ
రౌర యనంగ నంగజశరాసలతారవపూరితాత్ముఁడై. 202

ఉ. ఒక్క చకోరనేత్ర మది నువ్విళులూరుచు రాజుఁ జూడరా
ముక్కలి యిచ్చెబోటి యది ముత్తెపుబావిలి యంచుఁదాల్చె వే
ఱొక్కతె కొక్కబోటి కటి కొద్దికయౌ మొలనూ లొసంగినన్
గ్రక్కునఁదాల్చె హారమని కాంతలదేమి యటంచు నవ్వఁగన్. 203

కం. ఈలీల మించుబోఁడులు
హాళిందనుఁజూచు చూపు లంగము వొదువన్
వేలుపుమన్నీఁడనభూ
పాల కుమారకుఁడు దనరి ప్రాభవలీలన్. 204

తే. గీ. మఱియు జేజేయటంచు సమస్తజనులు
సొరిది నేత్రోత్సవములుగాఁ జూచుచుండఁ
దండ్రి నగరి హజారంబుఁ దీండ్రఁగదిసి
దొరలు కైదండ యొసఁగ సంతోషగరిమ. 205

సీ. తివనంకుశము ఘడియంచు కాలాది
యూఁది చంగున దాఁటి యుచితలీల
హరిగెలక్రందున నవలి కక్ష్యలు మించి
నగరు ప్రవేశించి నరవరుండు

ఫణిహారి జనులందుఁ బ్రజలను దొలఁగింప
నెలమి పల్లకిదిగు నిందుమతికిఁ
దనకు నెదుర్కొని తరుణు లారతులీయ
డంబుగా నంతఃపురంబు సొచ్చి

తే. గీ. కరుణఁదీవింప రఘురాజు గంధవతియుఁ
దామరల మించు వారి పాదముల కెఱఁగి
సిగ్గు మురిపంబు చిట్టాడఁ జెలిచెలంగ
నగుచు మ్రొక్కించి రింతులయ్యు గళమునకు. 206

ఉ. ఆ చిగురాకుఁబోఁడిని లతాంగిని నన్నులమిన్నఁ బ్రోదియా
రాచిలుకన్ మిటారియగు రత్నపు బొమ్మను ముద్దుగుమ్మనా
రాచముగా మరుండలర రాచకొలంబునఁ బుట్టు నచ్చరన్
జూచి కవుంగిటం బొదివి జోడుగ దీవెనలిచ్చి రిర్వురున్. 207

కం. కులదేవతలకుఁ గోడలి
నెలమిన్ మ్రొక్కించి రతివ లిలునించుక బం
ధులురా మ్రొక్కించిరి కొడు
కుల తల్లివి గమ్మటంచు గురువులు పలుకన్. 208

కం. విందులకు నగరనప్పుడు
విందులు గావింప నాత్మ వేడుక పొదలన్
గుందనపుఁ బళ్లెరంబులు
క్రందుగ నిడి పంచరత్న కంబళములతోన్. 209

ఉ. ఇచ్చవసింపఁజేసిన మహీశులు పొత్తులుగూడి యొండొరుల్
దచ్చన లాడుచుండ నెఱతావుల దీవుల బోనవుట్టికల్
తెచ్చి సువారవుం జెలులు తిన్నగ బంగరు చట్లనుంచి మే
ల్పచ్చల కంకణద్యుతులఁ బచ్చలు గందనియట్లు రాజిలన్. 210

సీ. శాకముల్వివిధ మాంసములు చిత్రాన్నముల్
కజ్జముల్ పాలు శర్కరలు ఘృతము
లంబళ్ల పచ్చడు లానవాల్ పప్పు గా
రలు రసాయనములు చలువనీళ్లు
వరుగులు సిగరలు వడియముల్ తేనియల్
ఫలములు పాకముల్ పాయసములు
నూరుఁగాయలు బజ్జు లూరుఁబిండ్లప్పముల్
ఫలములు పెరుఁగులు పానకములు

తే. గీ. నీరు మజ్జిగ లెంతయు నేర్పు మెఱయ
నిట్లు వడ్డింప భుజియించి యెల్లదొరలు
లేచునప్పుడు పన్నీరు లేటిచూపు
వలపు బోడులు పోయంగ వార్చిరెలమి. 211

కం. కుంకుమయు మృగమదంబును
సాంకవము దుకూలములు ప్రసవదామకముల్
పొంకించి వక్కలాకులు
నంకిలిలేక యొసగి రఘువనుపఁగ నంతన్. 212

తే. గీ. సావడులు డిగ్గి మాగధచయము చదువ
వందిజనము నుతింపఁ గైవార మెదుటఁ
గంచుకులు సేయ వాద్యముల్ క్రందుకొనఁగ
రాజులు నగళ్ల కరిగిరి రథములెక్కి. 213

సీ. అంతట నంతః పురాంగనల్ రాసుతు
నిందిందిరాలక నిందుమతిని
గళ్యాణ మాణిక్య కల్యాణ పీఠిపై
నునిచి గంధాక్షత లునిచి నుదుట
సంపంగినూనె మస్తములంటి జాజికా
యటకలివెట్టి మున్నలరనలుగు
మున్నీరుగాఁ బాఱఁ బన్నీటి కొప్పెరల్
డించి తంబుగలను ముంచి ముంచి

తే. గీ. మజ్జనంబార్చి తడియొత్తి సజ్జకముగ
తావి సాంబ్రాణి ధూపంబు లావటించి
మడుఁగులు ధరింపఁ గూర్మి యిమ్మడుఁగుగాఁగ
హారతు లొసంగి నటియింప హారతతులు. 214

తే. గీ. వారి నిర్వుర నపుడు బువ్వమున నునిచి
విప్రపుణ్యాంగనలఁ బిల్చి వేఱువేఱ
నవముగ నిషేకసమయదానము లొసంగఁ
బసుకయిలు వేగఁగైసేసి పడతులపుడు. 215

కం. రంగలరు వరచతుర్విధ
శృంగారమ్ములను రాజసింహ మడుగులం
బంగరు పావలు మెఱయఁగఁ
గంగులరవికె చెలియొకతె కైలాగొసఁగన్. 216

చ. వలపులవింటి జోదు చెలువంబు హసించు మనోజ్ఞ రూపమున్
సొలపు నొయారమున్ మెఱయ సూరెలమేనిజవాది వాసనల్
వలగొనఁ గెంపురా మెఱుఁగు వాతెఱ లేనగ వాఁగ మేనికాం
తులు వలెవాటు దుప్పటిని దొమ్మిగ మేకొని రేకునించఁగన్. 217

కం. గజరాజ గమనముననెగు
భుజముల భుజకీర్తు లలర బోటులువాడన్
గజిబిజిగ మదనుఁ డేయఁగ
నజరాజౌయ్యొయ్యఁ జేరి యౌర యనంగన్. 218

సీ. చంద్ర కాంతోపలస్థగిత కుట్టిమతలం
బగరు ధూపిత దీపితాంతరాబ్జ
చిత్రవర్ణ విచిత్ర చిత్రిత కుడ్యము
ద్యత్ పద్మరాగాధికాంచితంబు
ఘనసార మృగమద గంధసారామేయ
మభినవ పాంచాలికాభిరామ
మాలంబి సుమరత్న హారహీరవితాన
మార్ద్రి క్రముక శకలాచ్ఛపర్ణ
తే. గీ. మలఘు పరిమళ పేటికా విలసనంబు
రాంక వాసన వల్లకీ రాజితంబు
కలిత కలరవ శుకకుల కలరవంబు
భవనరాజంబు మోహనభవన మలర. 219

చ. జిగి వెదఁజల్లు రత్నముల చెక్కడపుంబని చప్పరంబు మేల్
బగడపుఁ గోళ్లఁ గుందనపుఁ బట్టెలు సూర్యపుటంపుఁ బానుపున్
జిగురుకటారి కాని యని చిన్నెలు చెన్నగు పైగుడారమున్
నగినలబిళ్లలన్ సరిగజాతి తలాడయు మించుమించమున్. 220

తే. గీ. చూచి కూర్చుండు తఱిఁజని సుదతి యొకతె
మెలపుతో పీవఁ గనుసన్న సుదతు లెఱిఁగి
యెంత జాగమ్మలార మీ రిందుమతిని
సాగి రానీరు విభుఁడు వేసరిలె ననఁగ. 221

సీ. అటునిటుఁ బెనఁగఁ గొప్పవియునో యనివేగ
జడయల్లి తావి పూసరులు చుట్టి
జొబ్బిళ్ల కుంకుమ గబ్బిగుబ్బలఁ బూసి
చికిలి చెక్కుల మకరికల వ్రాసి

తిలకంబుఁ గొనబుగా దిద్ది కస్తూరిచేఁ
గమ్మని కపుర భాగమ్ము లొనఁగి
చలువ పావడమీఁద జబ్బుగా ముడివైచి
చెంగావి నెఱికల చీరగట్టి
తే. గీ. కంటసరములు నందియల్ కటకవలయ
రత్నతాటంకములు కెంపురవలనంది
దండలును మేఖలలు తళతళ వెలుంగ
నుంగరమ్ములు కైసేసి యువిద కపుడు. 222

కం. రమ్మంచు నెదుటి చెలులటుఁ
బొమ్మంచును వెనుకనున్న బోటు లదల్పన్
బొమ్మంచుఁ దానుఁ గదలక
కమ్మలె కదలించు సిగ్గు గరువము మీఱన్. 223

కం. ఈలీలఁ బడుకటింటికి
బాలారత్నంబు రాక బలిమిఁ బెనంగన్
జాలములఁ దెచ్చి మెల్లన
హేలావతు లాన్నృపాలు నెదుటన్నిలుపన్. 224

చ. చికిలిజవాజి చెక్కులను జిందులు ద్రొక్కఁగ నొంట్లదీధితుల్
సికవిరిదండ్ల లొంటిపొర జిల్గురుమాలునఁ జిల్గు తేరఁగన్
జకచకలీను వజ్రముల సన్నపుతాళి వెలుంగ ఱొమ్మునన్
రకమగు మేనిబంగరు చెరంగుల దుప్పటి తొంగ కుంకుమన్. 225

ఉ. పానుపుమీఁద నొత్తిగిలి బాలికరాక కెదుర్లు చూచుచున్
జానువుమీఁద నొక్కచెయి శ్మశ్రువుపై మఱియొక్క చేయిగా
మేని మృగీమదంబు నరిమించఁగ వాసన లూర్పుగాడ్పుతో
మానసవీథిఁ దత్తరము మైకొన నుండు విభుండు చూడఁగన్. 226

తే. గీ. తెరమఱుంగని చేపట్టి తివిచి తివిచి
చేరి కూర్చుండుమని బుద్ధి చెప్పి చెప్పి
వీడె మిమ్మని నర్మోక్తులాడి యాడి
చెలులు వేసరి యింక నీచిత్త మనుచు. 227

కం. కోపములు దెచ్చుకొని వడిఁ
బోపొమ్మని యలిగి పోవు పొంకమునఁ జనన్
దీపించు తత్తరమ్మున
దాపునఁ బయ్యంట లొడిసి తానుం జనఁగన్. 228

కం. వెస లేచి రాకొమారుఁడు
రసికతఁ జెలులేల నిన్ను రానీ రనికేల్
ముసిముసి నగవునఁ దొడుకఁగ
నసమీయక కలికి యిట్టునటు నీఁ గంగన్. 229

ఉ. భీతమృగాక్షి నందుగొని బిగ్గఁ గవుంగిటఁ జేర్చి యోరగా
వాతెఱ త్రిప్పఁద్రిప్పుకొని వైపుగఁ దేనియలాని యంతలో
మూతి బిగింపఁ గిలెఱిఁగి ముద్దుగ పీడెమునించి పుక్కిటం
జేతికి లోకువయ్యె నని సెజ్జకుఁ దార్చి నృపాలుఁ డర్మిలిన్. 230

కం. వలిగుబ్బదొడుక నొకచేఁ
గలహంసీ గమన రెండుకరములఁ బెనఁగన్
సులువుగఁ దానొక కరమునఁ
జెలువుఁడు పోకముడి విడిచెఁ జెలిఁ గలయంగన్. 231

ఉ. ఓప నటంచుఁ గొంతవడి యుల్లము ఝల్లన భీతిఁ ద్రోచుచున్
జూపులఁ గోపగించుకొని ఝల్లకుఁ దొట యెఱుంగ మెవ్వరుం
దాపున లేరె యంచుఁ గడుఁ దత్తర మందుచు దిట్లగాక తా
నోపిక నేవనుల్ దెలియకుండెను బంధురపారవశ్యతన్ 232

ఉ. అంతట మేచెమర్పఁ గర మావిభుపీఁపునఁ జేర్చియుండుచుం
జెంతకు మోవి దెచ్చినను సీత్కృతిఁ గ్రోలుచు నించుకించుకం
గుంతలముల్ చలింపఁ గొనగోరున దువ్వుచు మోముచూచుచున్
జంతతనంబునం గొసర సాఁగె నహో చవిగన్న పిమ్మటన్. 233

ఉ. పీడె మొసంగె నిద్దురకు వేళయె సీకని నవ్వఁ బైకొనున్
వేడుకమాట గొంకు ప్రభవింపఁగఁ గుంతలము ల్చలింపఁజి
ట్టాడఁగ లేఁతకొను మణిహారము లుయ్యేల లూఁగఁ జూడఁగా
నాడఁగఁ గుల్కు గుబ్బలు ముఖాబ్జమునం జెమ రంకురింపఁగన్. 234

తే. గీ. రమణి యీలీల ననురాగరసము చాల
సీడుజోడయి పలుమాఱు నెచ్చరింప
కలసి కలయిక నలయిక గదురనీక
వెడవిలుతు కేళినోలార్ప వేగుటయును. 235

ఉ. చిక్కులు వడ్డ హారములు చెక్కులపై నులిపచ్చి గోరులున్
జక్కెర మోవికెంపు లరజాఱి భుజమ్మున వ్రాలుగొప్పుకెం
పెక్కిన కన్నులున్ నిదురనెంతయు మబ్బులు మేను గుచ్చెలుల్
చెక్కుచు లేచివచ్చు నునుసిగ్గును భూషణ మయ్యె నింతికిన్. 236

సీ. కలయికలం జిట్లు కస్తూరి పూఁతతో
మెఱుగుఁగాఁ జొత్తుల మేనితోడ
మంకెపూ మోవితో మరుని లచ్చనలతోఁ
జిలుప నెత్తురు చెక్కుజీరతోడఁ
గరఁగి జాఱిన చిత్రకంబుతో నడుగిడ
నదనఁ బైకొనునట్టి యలఁతతోడఁ
జెంగావి కన్నులఁ జీరాడు నిదురతో
గుబ్బకొమ్ముల ఱొమ్ము క్రుమ్ముతోడ
తే. గీ. జాఱూ సికమీఁది సంపంగి సిరులతోడఁ
బసపు సొంకుల వలిపపు ముసుఁగుతోడ
వాసనలుగుల్కు పూబంతి నాసఁ బూని
వింత హొయలునఁ బచుకయి ల్వెడలె నజుఁడు. 237

కం. ఈ లీల మేనులొకటిగ
బాలామణిఁ గూడి చిత్రబంధ గతులనా
లీలావతీ మనోజ్ఞుఁడు
హేలి దివారాత్రములు విహారము నలుపన్. 238

తే. గీ. తండ్రి యంతట నతని యౌదార్య ధైర్య
శౌర్య గాంభీర్యముల కాత్మఁజాల నలరి
చేరరమ్మని యువరాజుఁ జేయవలసి
ధీనుతోక్తుల నిట్లని యానతిచ్చె. 239

సీ. తనసీమ యింతని దాన నాదాయ మిం
తని తానె ధ్రువముగా నరయవలయుఁ
గాల్బలంబులకును గరుల కశ్వములకు
నింతని మును నిర్ణయింపవలయు

సారమై సంధిల్లు సకలాంశములయందుఁ
    జెంపకర్థము సంగ్రహింప వలయు
నర్థములో నైహికాముష్మికములకు
    నర్థముగలుగఁ జేయంగ వలయుఁ
తే. గీ. బరుల సిగులుఁ దనభూమి ప్రజల సిలుగు
లిన్నియు నెఱింగి తానిగ్రహింపవలయు
నృపుఁడు దైవత భజనము జపములదర
నెపుడూ వృష్టియెడలఁ జేయింపవలయు. 240

కం. వలదెన్నఁడు దుర్వ్యసనము
లలివేణుల పొందు దొరల కాఖేటకమున్
జలుపవలె నుచితవేళల
కులము దిరంబుగను దీఱఁ గ్రూర మృగములున్. 241

తే. గీ. దుర్బలుల సొమ్ము గైకొని దుడుకుగాఁగ
హేమతులఁ దూఁగినను దానవేమిగలదు
ఫలము వారిది తత్తాప ఫలము తనది
పరుల సొమ్ముల కాసింప ప్రభులకగునె? 242

కం. మంచితనంబును భేదము
లంచముఁ బరికించి యెన్నిలాగులనైనన్
వంచన మరలింపక తము
మించిన సమమైనఁ బోర మేలగుటరుదా! 243

కం. భూమికిఁ బతియైనప్పుడ
భూమి ప్రజ పుత్రికలును బుత్రులు నగుటన్
భూమీశ్వరుండు తాఁబర
భామలఁ గోరంగఁ జనదు భావములోనన్. 244

సీ. అన్యాయ మగువిత్త మార్జింపఁ గడఁగిన
    నాకటికిఁ బదిగాఁగ నొరులఁ గలయుఁ
బరభూమి తెరువులఁ బ్రజల కిచ్చిన దాన
    సముచితాదాయముల్ సమసిపోవు
నడరు ననావృష్టి యతివృష్టి యేనియు
    నారంభములకెల్ల హానిదొడరుఁ
గొలువరు ప్రజలు మక్కువ తక్కువగునేని
    కలిమి బల్మలు సన్నగిలి తలంగు

తే. గీ. నట్లు గావున నెపుడు రాజైన యతఁడు
మేర దాఁటక తారంబు మేరువనెడు
నొరుల దుర్వాక్యములు చెవియొగ్గి వినక
పదిలుఁడైయున్న నిహమును బరముఁ దిరము. 245

కం. తనవారని పెఱవారని
మనమునఁ దెలియంగలేని మానవుఁడకటా
పెనుబసర మతని జతలే
మనుజ మృగమ్ములకు నెండమావులు గావే! 246

కం. దొర యగుట యెల్లఁ దానిహ
పరములకే కాక రెంట భ్రష్టగు కొఱకే
ధర నపకీర్తులఁ బొరయక
చిరమగు పుణ్యంబుఁ గీర్తి చెందఁగ వలయున్. 247

కం. కుల హీనుని గుణహీనుని
గలిగిన వెఱజుకొని లేమి గలఁగెడి వానిన్
చెలికిని పరజనమర్మం
బులు వాకొనువాని మూఢుఁ బొసఁగునె మనుపన్. 248

శా. స్వామి ద్రోహములెల్ల ద్రోహములకాచైదంబు లాద్రోహముల్
నేమంబంచుఁ బరిగ్రహించు నతఁడున్ క్షీణించు దుర్భాగ్యతన్
తామే దిక్కని విశ్వసించు ప్రజసంతాపంబునం బొర్లఁగాన్
నేమే నీయక త్రోచిపుచ్చుఖలుఁ డందిందున్ సుఖంబందునే? 249

ఆ. వె. వంశ పావనుఁడవు వత్స! నీ వెఱుఁగని
యర్థమొకటి ధాత్రియందుఁ గలదె
పేర్మి నిన్నుఁ బిలిచి పెద్దల మగుటను
దెలియఁ జెప్పవలసెఁ దెలియనటుల. 250

కం. యువరాజవు గమ్మని యజు
భువనామోదంబు నతి విభుత్వము మెఱయన్
నవముగ శుభము లెదుర్కొనఁ
బ్రవిమలమతి రఘువు పట్టభద్రునిఁ జేసెన్. 251

సీ. బ్రహ్మసంతతికి సౌభాగ్యంబు లొనఁగూడె
మునులకు సంతతామోద మొదవె
వేదాధ్యయనములు వివిధ యాగమ్ములు
ప్రబలమై విశ్వంభరను జెలంగెఁ

గామధేనువులట్లు కడవల కొలఁదిగా
గోగణమ్ములు పాలు గురియఁ దొడఁగె
వలె నన్నయప్పుడె వర్షింప మేఘముల్
గొలుచు లెల్లెడ గంప కొలలమించె
తే. గీ. గృహము బలిసద్మమయ్యె నయ్యహులకెల్ల
సకలవర్ణాశ్రమాచార సరణులొప్పె
నాయురభివృద్ధి భూప్రజలందుఁ జెందె
రాజ్యభరమయ్యజుని యందుఁ బ్రాజ్యమైన. 252
కం. ఈ యిందుమతీపరిణయము
వ్రాయను వినఁజదువ నెల్ల వారలకు రమా
నాయకుఁ డొసఁగున్ గీర్తియు
శ్రీయుఁజిరాయువు జయంబు స్థిర వైభవమున్ 253

నాగబంధము

చ. సకలక వీశలోక గురుచారుఫల ప్రదగేయ తాత తా
ధికతర తధీర జగద్వికరా సలత
ప్రకట యశోతిమాకరధ రాధర రమ్యవిలోక నాగరా
జకటక భేదనాకమల జాల హితద్యుతి సారభారతీ! 254

పుష్పమాలికాబంధము

కం. హారధరవర ఫణిమణి ఘృణి
వరతరధర భావ భవ యువతిభనిభతిభ
స్థిరతర శరముర హరశర
హరికవి హరిధర వరసుర హారజ సుశయా! 255

(పద్మ?) చంపక బంధము

ఉత్సాహ. వీరభావ భాసిసత్త్వ విద్భుజారి వారహా
హారవారి జారికీర్తి స్ఫురితా సుధీరసా
సారధీ సుతాఢ్య సూన చంపమాన దారకా
కారదాన మానితాధిక ప్రభావ భారవీ! 256

గద్య. ఇది శ్రీరామభద్ర కరుణా కటాక్ష వీక్షణ సమాసాదిత సరస కవితా వైచిత్రీపాత్ర తెనాలి రామకృష్ణ కవిరాజానుజ శ్రీగిరి కవిసార్వభౌమ పౌత్ర యభినవ రామకృష్ణ సత్కవి పుత్ర తిమ్మమాంబా గర్భ రత్నాకర రాకాకైరవ మిత్ర కౌండిన్యసగోత్ర పవిత్ర సకల సుకవి వినుత సాహితీ విద్యాసమున్నిద్ర రామభద్రకవి ప్రణీతంబైన యిందుమతీపరిణయంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.